# ప్రబంధ రత్నావళి

## ప్రాచీన పద్యసంకలనము

సంపాదకులు

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

పీఠిక

కళాప్రపూర్ణ, విద్యారత్న

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు

ప్రకాశకులు

శ్రీ ప్రభాకర పరిశోధకమండలి

హైదరాబాదు.

శ్రీ ప్రభాకర పరిశోధకమండలి ప్రచురణము

ద్వితీయ ముద్రణము - 1500 ప్రతులు.

మే, 1976. నల — వసంతము.



PRABANDHA RATNAVALI

By. Late Sri. Veturi Prabhakara Sastri

*Published by,*

SRI PRABHAKARA PARISODHAKA MANDALI
10-3-379/1, Vijayanagar Colony,
HYDERABAD-500028.

*Price* : Rs. 15/-

*Printed at*

CHANDRASEKHARA PRINTING WORKS,
Nampalli—HYDERABAD.

Copies can be had from the Publishers

*and at*

SREE BHARATI ENTERPRISES,
H. No. 4. Housing Board Colony, Lala Pet,
HYDERABAD - 500040.



జననము :

సర్వజిత్-మాఘ బహుళ ఏకాదశి,

7—2—1888.

నిర్యాణము :

వికృతి శ్రావణ బహుళ విదియ.

29—8—1950.

శ్రీరస్తు

# ప్రబంధరత్నావళి


వేటూరి— ప్రభాకరశాస్త్రి గారిచే

సంపాదింపఁబడినది



తిరువల్లిక్కేణి

రాజా వెంకటశేషయ్యగారిచేఁ

ప్రచురింపఁబడినది.

చెన్నపురి

సదానందనిలయ ముద్రాక్షర శాలయందు

ముద్రితఁపఁబడినది.

*1918*




ప్రబంధరత్నావళి

ప్రథమ ముద్రణ ముఖపత్రము

1918

క. సుతుఁడుఁ దటాకముదేవా
యతనము నల్లిల్లు నిధియు నారామము స
త్కృతియు ననుసంతతులయం
దతిశయము ప్రబంధమెపుడు నక్షయ మగుటన్.

(పుట 85-ప. 409)

# మనవి

శ్రీ ప్రభాకరపరిశోధక మండలి పక్షమున కీ॥ శే॥ వేటూరి. ప్రభాకరశాస్త్రి గారు మున్ను రచించినవియుఁ గూర్చినవియు నగు గ్రంథములుకొన్ని నవ్యములును పునర్ముద్రణములును వెలువడినవి. అవి నేటికి చాలవఱకు చెల్లిపోయినవి కొన్నిమాత్రమే, కొలంది మాత్రమే మిగిలియున్నవి. 'తెలుగు మెఱుగు' లతో (1948) నారంభమైన శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వ్యాససంకలనములు పిదప 'మీగడ తఱకలు', 'సింహావలోకము' అను మఱిరెండు సంపుటములు వెలువడినవి. ఇంకను వారివి ప్రాచీనసాహిత్యమునకును, సంస్కృతాంధ్ర కవుల చరిత్రకును సంబంధించిన వ్యాసములు కొన్నియును; జానపదసాహిత్యము, చరిత్ర, శాసనములు, భాష మున్నగు విషయములకు సంబంధించిన వ్యాసములు కొన్నియును సంకలన రూపమున ప్రకటింపవలసినవి కలవు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 1950 కంటె పూర్వము నాలుగాశ్వాసములకుపైపడి రచించిన ఉత్తర హరివంశ వ్యాఖ్యానము, వారే పరిష్కరించియుంచిన పద్యపాఠములతో కూడ ప్రకటింప బడవలసి యున్నది.

ఇంకను నాటకములలో వారి ప్రతిమానాటకము పునర్ముద్రణ భాగ్యమును బడసినది. శ్రీ శాస్త్రిగారు సగమే ఆంధ్రీకరింపగా మిగిలిన భాగమును డా॥ దివాకర్ల వేంకటవధానిగారిచే పూరింపఁజేసి 'నాగానందనాటకము ను వెలువ రించుటైనది.

ఇంకను వారి భాసనాటకానువాదములు, తెలుగుఁచేసిన ప్రహసనములు, స్వతంత్రములగు నాటికలు కొన్నియును, కలిపి, నాటకసంకలన మొకటి వెలు వరింపవలసియున్నది. ఇక పద్యకృతులలో 'దివ్యదర్శనము' 'కపోతకథ' 'కడుపుతీపు' మున్నగు లఘుకృతులొండు రెండు పునర్ముద్రణమందినవి. ప్రభా కర కవిచూడామణి కృతములైన కావ్యఖండికలన్నియు వారెదనెడ చెప్పిన పద్యావళితో పాటు చేర్చి కూర్చిన కావ్యసంకలన మొకటి వెలువడ వలసి యున్నది. శ్రీ శాస్త్రిగారి చాటుపద్యమణిమంజరి రెండు భాగములు ముద్రింప బడినవి: విస్తరింపబడిన ద్వితీయ భాగమున ప్రథమ సంపుటముమాత్రమే నేటికి

అందుబాటులో నున్నది. ద్వితీయ సంపుటముగా రావలసిన సామగ్రితో కూడి సమగ్రమైన సంకలనము చాటుపద్యమణిమంజరి తిరిగి ముద్రింపవలసిన అవసరమెంతేని కలదు. ఇట్లే వారి "నీతినిధి" వంటి ఉత్తమ వచన గ్రంథములు, "శృంగారశ్రీనాథము" వంటి మేటి విమర్శగ్రంథములు పునర్ముద్రణ మంద వలసి యున్నవి. ఇట్లే ఇంకను వారి రచనలు కథలు-గాథలు; కాబులు-జవాబులు; డైరీలు; గ్రంథపీఠికలు; టీకలు-టిప్పణములు; సమీక్షలు;ఉపన్యాసములు; వ్యాఖ్యలు-విశేషములు, ఆత్మకథ 'ప్రజ్ఞాప్రభాకరము'; జీవితము-యోగము అను విభాగములతో ననేక సంపుటములును;—సామెతలు - నానుడులు, గాంధిరామాయణము మున్నగు సంకలనములు మఱికొన్నియును క్రమమున ముద్రింపవలసియున్నవి.

ఇట్లే ఇంకను పలుమ్రాతప్రతులను పరిశీలించి పాఠనిర్ణయము గావించి ప్రకటనకు సిద్ధముచేసి యుంచిన ప్రాచీనకావ్యములు కొన్ని యున్నవి. 'లక్షణోద్ధార' మను లక్షణగ్రంథవిషయ సంకనమునకు బృహత్ప్రణాళికను రచించి, సామగ్రిని సేకరించి, విశ్లేషించి యున్నారు. అదియు వెలుగునకు రావలసి యున్నది.

ఇట్లు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపూర్ణగ్రంథావళి ప్రణాళికాబద్ధముగ క్రమమున వెలుపరింపవలసియున్నది. ఈ రచనాసామగ్రి నంతటిని శ్రీ ప్రభాకరపరిశోధకమండలి పరిశ్రమించి సేకరించి, పైని వివరించిన విధమునే విశ్లేషించి ప్రకటించుటకు సిద్ధపఱచియున్నది. తత్ప్రకటనమున కొకప్పుడు కొంత యత్నించితిమి గాని ఆయత్నము ఫలింపలేదు.

గ్రంథప్రకటన మనుకొన్నంత తేలిక పనికాదని తెలియును. అది మాటలతో జరుగునదియు కాదు. అయినను దీక్షతో వానినన్నిటి నొక క్రమప్రణాళిక ననుసరించి ప్రకటించుట కిపుడు శ్రీ ప్రభాకరపరిశోధక మండలి కృషిచేయుచున్నది.

ప్రథమ ముద్రణము జరిగిన యేఁబదియెనిమిదేండ్ల తరువాత నిప్పటికి విలువగల సంకలనగ్రంథము 'ప్రబంధరత్నావళి' పునర్ముద్రణమందు చున్నది. దీనికై అర్థింపఁగా ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు దయతో మూడువేల రూపాయలు, రెండేండ్ల వ్యవధిలో, వడ్డీలేక తీర్చుకోవలసిన విధమున, అప్పుగా

నిచ్చిరి దానికి వారికెంతో కృతజ్ఞులము. ఆ పైకముతోనే ఇప్పుడీకార్యము నారంభింపగల్గితిమి.

అప్పుతీరి, తిప్పలుదాటి, ఆరుమాసములకొక పుస్తకము చొప్పున వెలువరింప గల్గినను పదేండ్లపాటు జరుగవలసినంతపని యున్నది. ఆంధ్రప్రదేశ ప్రభుత్వమును, అకాడమీలును ఈ విషయమై ఉదారముగ ఉచితరీతిని ఆర్థిక సహాయమందించి యీ బృహత్కార్యక్రమమునకు చేదోడువాదోడు కాగలవనియు వారి తోడ్పాటుతో శ్రీ ప్రభాకరపరిశోధకమండలి తన బాధ్యతను నెరవేర్చి ఆంధ్ర పాఠకలోకముయొక్క ఆశయమును తీర్చగలదనియు ఆశించుచున్నది.

మా కోర్కె మన్నించి అడిగినంతనే విలువగల 'భూమిక'ను రచించి యొసగిన కళాప్రపూర్ణ, విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి హృదయపూర్వకముగా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము.

ఈ గ్రంథమునిప్పుడు ప్రథమముద్రణము ననుసరించి యథామాతృకముగ పునర్ముద్రించుచున్నాము. అనుబంధమున చేర్పబడిన విషయములను అందలి సూచన ననుసరించి గ్రంథమున చేర్చితిమి. ఆ కారణమున పద్యసంఖ్యాక్రమము మారినదేగాని ప్రణాళిక మారలేదు. అక్కడక్కడ పుటలలో శ్రీ శాస్త్రిగారే గుర్తించిన విషయములను అధోజ్ఞాపికలలో పేర్కొంటిమి (పుటలు 5, 6, 33, 106 లోని అధోజ్ఞాపికలు మాత్రము మేము క్రొత్తగా చేర్చినవని మనవి.) గ్రంథమున శీర్షికల ప్రక్కనగల (అం); (జ); (ఇ)-అను సంకేతములు ప్రథమ ముద్రణము (పు. 185-189)లో గల సూచనల ననుసరించి సౌలభ్యము నకై కూర్పఁబడినవి. ఆ యనుబంధములను కూడ యథాపూర్వము గ్రంథాంతమున పరిశీలనార్థముంచితిమి. ప్రథమ ద్వితీయ ముద్రణములందుగల పద్యసంఖ్యాక్రమము నెరుఁగుటకై తుదిని పద్యానుక్రమణిక నకారాదిగా సంధానించితిమి భూమికారచయిత పేర్కొన్న పద్యసంఖ్యలు ప్రథమ ముద్రణము ననుసరించినవే.

# కృతజ్ఞతలు

ప్రబంధరత్నావళి ప్రకటనమునకై చేయూత నొసగిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారికిని-ప్రత్యేకముగా అకాడమీ అధ్యక్షులైన డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికిని మా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాము.

సరసమైన ధరకు అచ్చుకాగితమును లభింపజేసిన ప్రభుత్వ యంత్రాంగమునకు మా కృతజ్ఞత.

స్వల్పవ్యవధిలో వడివడిగా అచ్చుపని సాగుచుండగా పద్యపదానుక్రమణికల నకారాదిగా తీర్చుటలో తోడుపడిన చిరంజీవులు విశ్వమోహన్, రాధాకల్యాణి, ఆదిత్య, ప్రభాకరులను ఆశీర్వదించి అభినందించుచున్నాము. భూమిక అచ్చు అగుచుండగా ప్రెస్సుపనిలో మాకు తోడుపడిన శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావుగారికి మా కృతజ్ఞతలు.

గ్రంథము నీరీతిని సుందరముగా ముద్రించి వేళకందించిన చంద్రశేఖర ప్రింటింగ్ వర్క్సువారికి, ముఖ్యముగా శ్రీ ఏ. వి. రావుగారికిని, మేనేజరు శ్రీ లీలాకృష్ణ రాజుగారికిని, శ్రీ కే యన్ సుందరంగారికిని మా కృతజ్ఞతలు.

హైదరాబాదు-28.
22-5-76.

ప్రకాశకులు.

శ్రీ గురుభ్యోనమః

# పీఠిక

ప్రాచీన కావ్యాలంకారము లిప్పుడు కొన్ని బయల్పడుచుండుట మనయాంధ్రభాషావధూటియదృష్టవిశేష మనవచ్చును. చెల్లాచెదరులై లోకమునం జేకుఱుచున్నయట్టి సుకవితాలంకారములు కాలక్రమమున వంకలుదీరిభాషాసౌభాగ్యమును బరిపుష్టపఱుపఁగలవు. క్రొంగ్రొత్తకవనములఁ గూర్చుటతోఁ బ్రాఁబడినకవనముల బయల్పఱుచుటయు భాషాసౌందర్యమునకుఁ బోషకమేగదా! గ్రంథరూపమును గైకొనకయ, లోకమునఁ జేకుఱుచున్న యాంధ్రకవితావాఙ్మయ మపారముగా నున్నది. అందుఁ గొంత భాషాయోషకుఁ బ్రాణప్రాయ మనఁదగినదికూడను; నాకిట్టి వాఙ్మయమును సేకరించుటయందుఁ గోరిక కొండంత. ప్రాచీనకవీశ్వరరచితము లగుచాటుధారలను బెక్కింటి సమకూర్చి చాటుపద్యమణిమంజరి యనుపేర నింతకుముందు సంతరించితిని.[1] మఱియు, నవకము, చవి, చక్కఁన కలిగి యాంధ్రతావాసనలఁ బరిమళించు మధురకవితలఁ బెక్కింటి సేకరించి వేఱొకగ్రంథమును వెల్వరింపనున్నాఁడను.[2] ప్రాచీనకవీశ్వరకృతములై యీనాఁడు దొరకకున్న ప్రబంధముల నుండి ప్రాచీనులే సేకరించియుంచిన పద్యసముదాయమును "ప్రబంధ రత్నావళి" యనుపేర నిప్పుడు ప్రచురించితిని.

ఇందలి పద్యములను సంకలనము సేసినవా రిర్వురు. ఒకఁడు పెద్దపాటి జగన్నాథకవి; నారాయణస్తుతి, శంకరస్తుతి, త్రిపురవిజయము, అర్ధనారీశ్వరము ననిమొదలువెట్టి యిట్టితెఱఁగునఁ బెక్కువర్ణనాంశముల చేర్పఱుచుకొని యైదాశ్వాసములుగాఁ "ప్రబంధరత్నాకర" మనుపేర నీతఁడు గ్రంథము సంధానించెను. పై గ్రంథమున మొదటిమూఁడాశ్వాసములు మాత్రమే తంజాపురపు సరస్వతీపుస్తకభాండాగారమునం దున్నది. కడమగ్రంథ మెక్కడను గానరాలేదు. వేఱొక్కని పేరు తెలియరాదు. అతనిసంధాన మాంధ్రసాహిత్యపరిషద్భాండాగారమునం దున్నది. ఆసంధానమునకుఁ బేరు లేదు. మొదలు

1. చాటు-ప్రథమ భాగము 1914; ద్వితీయభాగము 1922, 1952 (ప్రకాశకులు).
2. ఇందు 'బాలభాష' అను విభాగము మాత్రమే వెలువడినది. 1930 (భారతి). ఇదే ఆ తరువాత గ్రంథరూపమున వెలువడినది. (ప్రకాశకులు).

లేదు. తుదలేదు. పరిషత్తువా "రసాహరణపద్యము"లని పేర్కొన్నారు.[1] ఈ యిర్వురకూర్పులందలి పద్యములను గ్రుచ్చియెత్తి నే నీ ప్రబంధరత్నాకరమును గ్రొత్త వెలయించితిని. పై యిరువుర సంధానములందుఁ గలిగినను నిప్పటికి ముద్రితము లై సుప్రసిద్ధము లై దొరకుచున్న నన్నయాదుల భారతాదులలోని పద్యములు నిందుఁ జేర్కొనలేదు. కవులను గావ్యములందలి పద్యములను గూడ నకారాద్యక్షరక్రమమునకుఁ దార్చితిని. భాషాకవిచరిత్రాద్యపేక్షకుల కిచేత మిక్కిలి సాహాయ్యక మగునని చక్కఁ బర్చించియే సల్పితిని. ఇర్వురసంధానము లౌ వేర్వేఱుతెలుఁగులవి. ఆరెంటిని జేర్చుటలో విషయానుక్రమణికిఁ జిక్కులు పలుచు. పూర్వోత్తర సందర్భరాహిత్య మిప్పుడే కాక యప్పుడు నున్నది. ఆ యిర్వురును కూడఁ గథాఘటితములు కావు. కావున నీకూర్పు నేఁత కొంత చిక్కును దీర్చుటయే.

ప్రయోగరత్నాకరము[2] రంగరాట్ఛందము మొదలగు కొన్ని లక్షణగ్రంథములందుఁ బ్రాచీనకవికృతములుగాఁ గొన్ని ప్రబంధములపేర్లతోఁ బద్యము లుదాహరింపఁబడియున్నవి. ఆ పద్యములనుగూడ నీ కూర్పునందుఁ జేర్పఁ జూచితిని గాని యాలోచింపఁగా నం దసత్యతాసంశయము సంఘటిల్లెను. గణపవరపువేంకటకవి ప్రభృతులు కొందఱు తమకు సమ్మతము లగుకొన్ని ప్రయోగములను నిల్వరించుకొనుటకయి తమ లక్షణగ్రంథములందు లక్షణకల్పనముచేసి లక్ష్యముగాఁ బ్రాచీనకవీశ్వరకృతు లైన ట్లేవో గ్రంథనామములును, పద్యములును సృష్టించియుందు రనితోఁచెను. నన్నయ యింద్రవిజయములోనిదట యీ పద్యము:

క. "అంగజుఁ డనుమానటి ద
క్కంగను రాయంచయేపుగను నూపురముఁ జే
చెంగలువ నేజచేఁ జెలి
చంగవనడుచక్కిఁ గ్రుమ్మె సరగున నార్చెన్."

విశ్వాస్య మగునా? ఇట్లే భాస్కరునినుసందోపాఖ్యానము సోమనహరవిలాసము, భీముని నృసింహపురాణము మొదలగునవి. కావున లక్షణ

---

1 ఇది నాకు శ్రీ కే. వి. లక్ష్మణరావు పంతులుగారి మూలమున వచ్చినది.

2 ఇది గణపవరపువేంకటకవిది. తంజాపుర పుస్తకశాలలో నున్నది.

గ్రంథములందలిపద్యముల నిందుఁ బొందింప మానితిని. అవియెల్ల వేఱొక కూర్పుగా వెల్లడించెదను.

పెద్దపాటిజగన్నాథకవి కృష్ణామండలమందలి యేలూరునకుఁ జేరువనున్న పెదపాడునం దున్నవాఁడు. తన గ్రంథము నతఁడు నీలాచలమరాదు నెలకొన్న జగన్నాథస్వామి కంకితము సేసినాఁడు. అతనివంశస్థితి మొదలగునది యీ గ్రంథము ననుబంధమును జూచి యెఱుంగునది.[1]

ఇర్వురుసంధాతలును గొంచె మించుమించుగా సమకాలమువారనియే తలఁపవచ్చును. మన మెఱిఁగినంతలో జగన్నాథకవి యుదాహరించినవారిలో మాడయగారిమల్లయ్య, తెనాలి రామలింగయ యును, రెండవసంధాతయుదాహరించిన వారిలో నల్లసాని పెద్దనార్యుఁడును నర్వాచీనులు. జగన్నాథకవికంటె నిర్వదేండ్లు రెండవసంధాత ప్రాచీనుఁడయినసుఁ గావచ్చును.

గ్రంథమున నకారాద్యక్షరక్రమమున నుదాహరింపఁబడిన యథర్వణాదు లగుకవులను గూర్చియుఁ దత్తత్కృతులనుగూర్చియు దెలుపఁదగిననూత్నవిషయముల నిఁక నిందుఁగొంతొక వివరించుచున్నాఁడను. ఇందు నేను బేర్కొనని వారింగూర్చి భావికాలపరిశీలనములవలనఁ గాని, నేఁడే యింతకంటె హెచ్చు పరిశీలించియుండిన ప్రాజ్ఞలోకము మూలమునఁ గాని విశేషవిషయములు బయల్పడవలయును.

**అథర్వణాచార్యుఁడు :—** ఈతనిభారతము లాక్షణికు లుదాహరించెదరు. 'తృష్ణాతంతు' అన్నపద్యము లక్షణగ్రంథమందలిదే. ఈతనియాంధ్రచ్ఛందస్సు నాకు లభింపలేదు. వికృతివివేక మనియు, త్రిలింగశబ్దానుశాసన మనియు సంస్కృతమున రెం డాంధ్రవ్యాకరణగ్రంథము లీతనిపేరఁ గానవచ్చుచున్నవి. ఈ రెండును నథర్వణునిపేర నితీవలఁ గల్పింపఁబడినవే యని యూహ. "శ్లేషే సఖండనిర్ఖండోక్తి" రిత్యాదిలక్షణము లుండుటనుబట్టి యాయూహ యుక్తము కాఁ దోఁచుచున్నది. అటయఁగా, సంస్కృతమున నున్న యాంధ్రవ్యాకరణము లన్నియుఁ గొంతయసత్యకల్పనముతోఁ గూడినవి గనే కనప్టును. రా. బ. కందుకూరు వీరేశలింగము పంతులుగారు :—

1. చూ. ఇందలి అనుబంధము-ఏ. పుట. 129. (ప్రకాశకులు).

''ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణమ్"[1] అని వికృతివివేక మున బేర్కొ(బడిన యకలంకుడు కర్ణాటకవ్యాకరణమును రచించిన యకలంకుడనియు, నాతడు క్రీ శ. 1604 లో నుండెనుగావున నది యహోబల పండితుని కాలముననే సృష్టింపబడియె ననియు( గ్రౌత్తపెల్వరించిన కవులచరిత్రమున విశేషవిషయము చేర్చినారు. ఇది సిద్ధాంతము కానేరదు. అకలంకుడు ప్రాచీనుడున్నాడు. ప్రాకృతవ్యాకరణకర్తలలో( బూజ్యపాదుడు ప్రాచీనతముడు; ప్రసిద్ధుడు; క్రై 1490 ప్రాంతమున 'ఔదార్యచింతామణి'[2] యను ప్రాకృతవ్యాకరణము రచించిన శ్రుతసాగరుడు వీరిని బేర్కొన్నాడు. వికృతివివేకమున( బేర్కొన(బడినవారు వీ రేలకారాదు ? ఆశ్లోకము లివి :-

"సమంతభద్రై రపి పూజ్యపాదైః కలంకముక్తై రకలంకదేవైః
యదుక్త మప్రాకృత మర్థసారం తత్ప్రాకృతం చ శ్రుతసాగరేణ
శ్రీపూజ్యపాదసూరి ర్విద్యానందీ సమంతభద్రగురుః।
శ్రీమదకలంకదేవో జినదేవో మంగళం దిశతు.

శ్రీ పూజ్యపాదనకలంకసమంతభద్ర
శ్రీ కుందకుందజినచంద్రవిశాఖసంజ్ఞాః
శ్రీ మాఘనందిశివకోటిశివాయనాఖ్యాః
విద్యాదనందిగురవశ్శ మమీ దిశంతు."

సమయసంకోచముచే నీవిషయ మింతట విడిచెదను. బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు,

'క. మగణముగ్రగడియరగణము
వగవకకృతిమొదుటనిలుపు వానికిమరణం
బగునిక్కమంద్రుడు సుడియడె
యగునని యిడితొల్లిబెంక ణాదిత్యుడనిన."

అను పద్య మధర్వణాచార్యుని ఛందమందలిదని కుమారసంభవ పీఠిక లో( జేర్చినారు. వారు దీని నేదేని లక్షణగ్రంథమును జూచి కైకొనిరో యధ

1. జైనులకు :- శ్లో।। ప్రమాణకలంకస్య పూజ్యపాదస్యశాసనమ్। ద్విసంధాన కవేఃకావ్యం రత్నత్రయమిదంస్మృతమ్.

2. ఇది విశాఖపట్టణమున శ్రీపరవస్తువారియార్ష పుస్తకశాలలో నున్నది.

ర్వణఛందమును జూచియే త్రైకొనిరో చెప్పలేదు. ఇది యధర్వణుని దగునాఁ డాతఁడు నన్నిచోడనికంటెఁ దర్వాతివాఁడగును. మఱియు వారే క్రీడాభిరామ మును ముద్రించుచు దానికి నాందిగా "అంబరసీమఁ దానలు" అను పద్యము నతకరించి యది 'యధర్వణుని భారత విరాటపర్వమున మొదటి యాశ్వాసము నుండి' యెత్తఁబడినట్లు వ్రాసినారు. వారుదాని నధర్వణభారత విరాటపర్వ ప్రథమాశ్వాసమునఁ జూచిరేమోగాని, యిందు 'దామరాజు సోమయభరత' మందలిదిగాఁ గూర్పఁబడియున్నది. ఏది సత్యమో ?

**అన్నమయ్యంగారు, తాళ్లపాక:**—ఈతఁడు రా. బ. కం. వీరేశ లింగము పంతులుగారి కవులచరిత్ర ప్రథమభాగమునఁ జేరవలసినవాఁడు. పదునాల్గవశతాబ్దిలో నించుమించుగా శ్రీనాథునికాలమున నున్నవాఁడు. తిరు పతితామ్రశాసనమునుండి ఈ విషయ మెఱుఁగఁబడును.

**అప్పన:**—ఈతఁడు భోజమహారాజుచే సంస్కృతమున రచియింపఁబడిన చారుచర్యను దెలుఁగు సేసినవాఁడు. ఏనాఁటివాఁడో తెలియదు. రచనమును బట్టి ప్రాచీనుఁ డని యూహించితిని. గ్రంథారంభ మిట్లున్నది.[1]

"క. ప్రత్యూహబహుళతిమిరా
దిత్యుఁడు శ్రీకీర్తిభారతీసంతతసం
పత్త్యున్నతుండు శ్రీహరి
నిత్యుఁడు నాగాంబయప్పనికిఁ బ్రియమొసఁగున్

సీ. విద్వన్నుతుండు భారద్వాజగోత్రుఁ డాపస్తంబసూత్రుండు పరమపుణ్య
వినుతోజ్జ్వలాంగి గోవిందార్యునకుఁ గులద్వయశిరోభూషణధర్మచరిత
నాగమాంబకుఁ గూర్మినందనుఁ డప్పయమణిమౌళి సింగననామాత్యుమేన
యల్లుఁడు ధార్మికుఁ డనఘుండు శ్రీవల్లభాచార్యుతమ్ముండు హరిపదాంబు

గీ. జాతషట్పదుఁ డుభయభాషాకవిత్వ
మానవైదగ్ధ్యుఁ డప్పనమంత్రివిదుఁడు

---

1. ఇది శ్రీముక్త్యాలప్రభువులగు శ్రీరాజావానిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదబహద్దరు గారి పుస్తకశాలలో నున్నది. తంజావూరు పుస్తకశాలలో గ్రంథారంభము కొంచె మున్నది

సంస్కృతంబున నొప్పారు చారుచర్యఁ
దెనుఁగు సేసెఁ దా నెంతయుఁ దేటపడఁగ

ఉ. రాజహితంబుపొంటె సుకరంబుగ వైద్యసునీతిధర్మసి
ద్ధ్యాజపథానుసారమధురంబుగ నిర్జరభాషఁ బొల్చి యా
భోజునిచేతఁ జెప్పఁబడి పొల్పగు నీకృతి నూత్నసత్కళా
భోజుఁడు మంత్రియప్పన ప్రబుద్ధుఁడు చేసెఁ దెనుంగు బాసఁగన్.

**ఎఱ్ఱయ, కూచిరాజు :—** సకలకథానిధాన మని,[1] కొక్కోకమని యీతని కృతులు రెండున్నవి. కొక్కోకము సర్వత్ర దొరకునదియే. ఇంచలి సకల పురాణసారము మూఁడవది ఇది యింతవఱకు లభింపలేదు సకల కథానిధానపుఁ బీఠికలో నిది పేర్కొనఁబడినది చూడుఁడు.

'సీ. శ్రీవత్సగోత్రవారిధిపూర్ణశీతాంశుఁ డగుకూచమంత్రికి నాత్మజుఁడవు,
వివిధాష్టభాషాకవిత్వవాచాప్రౌఢిఁ బూర్వకవీంద్రులఁ బోలినాఁడ,
వఖిలపురాణేతిహాసకావ్యస్మృతిచయము రచించినచారుమతివి,
మాపినతండ్రి యామల్లమంత్రికిని గొక్కోకంబు సెప్పినకోవిదుఁడవు,

గీ. రసికు లభినుతిసేయఁ బురాణసార
మనుపమంబుగ నాకిచ్చినట్టి ప్రోడ
వట్లుగావున నొకటి నిన్నడుగఁదలఁచి
యిచ్చటికిఁ బిల్వఁబంచితి నెఱ్ఱనార్య !'

**కేతనప్రెగడ:—** ప్రయోగరత్నాకరమందు "భాస్కరుని కేతన కాదంబరి" అని కలదు దశకుమారచరిత్రకర్త మూనయకేతన కావున నాతఁడు వేఱుగును. తిక్కన సోమయాజి పితృవ్యుఁ డొకకేతన కలఁడు. ఆతని తండ్రి భాస్కరుఁడే. దశకుమారచరిత్రమందీవిషయము గానవచ్చుచున్నది. అందలి వర్ణనమునుబట్టిచూడఁగా నా భాస్కరునికేతనయుఁ గవిగా నెఱుఁగఁ బడుచున్నాఁడు.

---

1 ఇది ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో గ్రంథపాతములతో నున్నది. ముద్రింపఁ దగినయుత్తమకావ్యము. ప్రత్యంతరము దొరకలేదు.

'చ. కవితకు ముఖ్యుఁ డీతఁ డనఁ గామితవస్తువు లిచ్చువాఁడునా
నవరసభావకుం డితఁ డనన్ బురుషార్థపరాయణుండునా
నవునన రాజనీతివిషయజ్ఞుఁ డితం డనఁ గీర్తిచంద్రికా
ధవళితదిక్కుఁడై నెగడె ధన్యుఁడు కేతనమంత్రియిమ్మహిన్. (దశకుమార)

కాదంబరీదశకుమారచరిత్రములందు రసవత్తర మగుకాదంబరిని వీడి రెండవది యగు దశకుమారచరిత్రమునే కేతన తెలిఁగించుటకుఁ గారణము తత్పూర్వమే యది తెలిఁగింపఁబడియుండుట యగునేమో? తన కృతికిఁ బతి యగుచున్న తిక్కనసోమయాజికృతులనే పేర్కొనని యీయభినవదండి యిఁక నాతనికిఁ బెద్దతండ్రి యగువాని కృతిని బేర్కొనకపోవుటలో నసందర్భమేమి యుండును? కాఁబట్టి యీ కాదంబరీకర్త కేతన తిక్కన పెద్దతండ్రి కేతన కాఁ గూడును. ఇఁక నా కువలయాశ్వచరిత్రకర్త కేతనప్రెగ్గడ యేతఁడో? ఇదియెల్ల నానుమానికమే.

**కొమ్మయ, నిశ్శంక :—** ఈతని వీరమాహేశ్వరము దొరకలేదు. శివలీలావిలాసము[1] రెండాశ్వాసములు మాత్రము చేకూరెను.

**గంగరాజు (గంగాధరుఁడు) చిరుమూరి :—** రా. బ వీరేశలింగము పంతులుగారు కవులచరిత్ర ప్రథమభాగ పీఠికలో నైరావతచరిత్ర మీతని కృతిగా వ్రాసినారు. ఐరావతచరిత్రప్రతులు రెండు నే నెఱుంగుదును.[2] రెండింటను బీఠికాగద్యములు లేవు. కృతిమంచిది. చిన్నది. కథ భారతేతిహాసప్రసక్తము. కాని సంస్కృతాంధ్రభారతములం దాకథ గానరాదు. కర్ణాటభారత మందుమాత్ర మున్నది. ఆంధ్రమున వెలుఁగ నున్నయీకృతి యత్కర్తృకమో నాకెఱుఁగరాలేదు. గంగరాజుకృతి యని మీ రెట్లువ్రాయఁగల్గితి రని శ్రీ వీరేశలింగముపంతులవారికి వ్రాసి కనుఁగొంటిని. శ్రీరామకృష్ణకవిగా రపూర్వవాఙ్మయపరిశోధన మను పేరఁ బ్రచురించిన యుపన్యాసమునఁ జూచి వ్రాసితిమని

1. ఇది నాదగ్గర నున్నది. తప్పులతుప్ప. ఆరంభము రెండుకాగితములుపోయినవి. మచిలీపట్టణములో నున్న యిమ్మానేని వీరేశలింగమునాయని గారి వలనఁ జేకుఱినది.

2. ఒకటి ప్రాచ్యలిఖితపుస్తకశాలలో నున్నది. వేఱొకటి విశాఖపట్టణమున శ్రీ వరవస్తువారి యార్షపుస్తకశాలలో నున్నది.

బదులు వ్రాసిరి. [1] కవిగా రట్లుపన్యసించినచో నాధార మేమో? తెలియవలసి యున్నది.

**చిక్కయ, చందలూరి :-** నాచికేతూపాఖ్యానము సిర్వారు తెల్గున రచియించినారు. ఈతఁడును, శ్రీనాథునిబావమఱఁది దగ్గుఁబల్లిదుగ్గనయును., ఈతఁ డేనాఁటివాఁడో! దుగ్గన నాసికేత (నాసికా + ఇత) పదమును ప్రాసమున 'స' వచ్చునట్లు సవ్యుత్పత్తికముగాఁ జేర్కొనుటచే నట్లే ముద్రించితిని. ఉపనిషత్తులయందు నాచికేతుపదమే కన్పట్టును. దుగ్గనకృతి శివకాంచీమాహాత్మ్యము దొరకలేదు. నాసికేతోపాఖ్యాన[2] మున్నది.

**చౌడయ, గంగరాజు :-** కసువాహూత్యున కంకితముగా నొక పాముద్రిక మున్నది అది యీతని దగునో? ఈతఁ డేనాఁటివాఁడో? నంద(ప) చరిత్రము దొరకలేదు

**తిక్కన :-** విజయసేనమునందలి దని యిందు వైశ్యవర్ణన (158-వ పద్య) మున్నది. ప్రబంధమణిభూషణమున నీ క్రింది పద్యము తిక్కన విజయసేనము లోని దని శ్రీకవిగారు వ్రాసినారు.

"సీ. అమ్మెద ననినఁ బద్మాక్షుకౌస్తుభ మైన వెలువక కొనియెడువెరవు గలిగి,
విలువ యిచ్చెద మని వేఁడినఁ బులిజున్నుఁ గమ్మపసింతియు నమ్మఁ గలిగి,
యేవస్తు వెంతప్రొ ద్దెందఱు చనుదెంచి యెంతటి కడిగిన నెదురఁ గలిగి,
తమయింట లేనియర్థము లర్థపతియింట నైన వెదకిన లే వనుట గలిగి,

గీ. తమకులాచారవర్తన [క్రమ]ము కొఱకు
నంగడులయొప్పునకును బేహార మాట
గాని లాభమునకు నాట గాదనంగ
వఱలుదురు పురవరమున వైశ్యవరులు."

ఇదియు వైశ్యవర్ణనమే. రెండుపద్యములును విజయసేనమందలివే యగునా?

---

1. శ్రీవీరేశలింగముపంతులుగారన్యదీయములగు విషయము లనేకములు స్వకపోలసాధితములట్లు కవులచరిత్రమునఁ జేర్చినారు. ఆయా విషయముల రాకరము తెలుపకుండుట భావిపరిశీలకులకుఁ జిక్కుఁగల్గించును.
2. ప్రాచ్యలిఖితపుస్తకశాలలో.

**తిమ్మయ్య, కుంటముక్కల :-** ఈతని శైవాచార సంగ్రహము[1] దొరకి యున్నది.

**త్రిపురాంతకుఁడు, రావిపాటి :-** ఈ కవీశ్వరునికృతి[2] యుదాహరణము మాత్రమే సమగ్రముగా దొరకియున్నది. తారావళి, అంబికాశతకము, ప్రేమాభిరామము దొరకలేదు. క్రీడాభిరామమునకు సంస్కృతమైన ప్రేమాభిరామమును రచియించుటచేతనే యేమో యీతనిఁ గూచిరాజు-ఎఱ్ఱయ యిట్లు తన కొకోకమునఁ బేర్కొన్నాఁడు.

"సీ-గీ. ముని సనత్కుమారు ధనదతనూభవు
నాశ్వినుల జయంతు నభినుతించి
పృథివి రావిపాటి త్రిపురాంతకాదిశృం
గారకవుల నెల్ల గారవించి."

ప్రేమాభిరామము శృంగారకావ్యమే యగును గదా ! రామకృష్ణకవిగారు త్రిపురాంతకుఁడు మదనవిజయ మను కామశాస్త్రగ్రంథమును ( వాత్స్యాయన సూత్రములకుఁ దెలుఁగుఁట) రచియించెనని వ్రాసినారు.[3] దొరకినంతవఱకుఁ బరికింపఁగా నీతనియాంధ్రకవిత యతిప్రశస్తముగా నున్నది. ఈ క్రింది రెండు పద్యములుఁగూడ నంబికాశతకమందలివి.[4]

"చ. బెడఁ గగురత్నదర్పణముఁ బేరినవెన్నెల పోసి నిచ్చలుం
దుడుపక పాలసంద్రమునఁ దోఁచి సుధాకరుమేనికందుఁబోఁ
గడుగక నేరెటేట సితకంజము ముంపక నైజకాంతి తోఁ
దొడరినఁ దల్లి! నీమొగముతోఁ సరిపోల్పఁగఁ జాలు నంబికా !

ఉ. తెప్పలఁబోరుఁదల్పు లిసిఱింతలువాఱెడుచూపుఁ గుంచియం
ద్రిప్పి తళుక్కనం దెలిచి తిన్ననిమోమునఁ గాయువెన్నెలల్

1. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో ;

2. తంజావూరుపుస్తకశాలలో నున్నది. శ్రీ రామకృష్ణకవిగారు ముద్రించినారు

3. క్రీడాభిరామపీఠికాదులు చూడుఁడు.

4. ప్రయోగరత్నాకరమునం దున్నవి. మా. రా. కవిగారు ఉదాహరణ పీఠికలోఁ గూడ నుదాహరించినారు. మొదటిపద్యము నర్థ మసందర్భముగా నున్నది. తుడువఁగ, కడుగఁగ, ముంపఁగ, తొడరిన తల్లి, అని యుండఁగూడును.

ముప్పిరిగొన్న వేడుకలు మూఁగిననిగ్గనియాడ, బ్రీతి నీ
వప్పరమేశుఁ జూచి తనువర్ధముఁ గొంటి పొసంగ నంబికా !"

**నరసింహభట్టు, ఆమదూరి** — ఈతని షోడశకుమార చరిత్రము దొరకలేదు; కాని, వేణాకకవి, వెన్నెలకంటి సూరనకుమారుఁ డన్నయామాత్యుఁడు రచియించిన షోడశరాజచరిత్ర మొకటి దొరికినది.[1] శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరమున షోడశకుమారచరిత్ర మొకటి యెల్లనకృతముగా నుదాహరించినారు. వారు పరిశీలించిన యాప్రతి యెక్కడ నున్నదో !

**నాగనాథుఁడు, పశుపతి :-** ఈతఁడు వెన్నెలకంటి సూరనకంటె బ్రాచీనుఁడే కావలెను. శ్రీ వీరేశలింగముపంతులుగారు వెన్నెలకంటి సూరన (విష్ణుపురాణకర్త) కాలము క్రీ.శ. 1480-90 ప్రాంతమని యసమర్థసాధనములతో సిద్ధాంతపఱచినారు. కాని, తత్కృతిపతి యగు బసవయ రాఘవుఁడు[2] క్రీ. శ. 1526-29 ప్రాంతమున నున్నవాఁ డగుటచే నాతఁ డంతకుఁ గొంత తర్వాతివాఁ డగును.

**నన్నిచోడఁడు** - ఈ కవి కాలనిర్ణయాదికమును గూర్చి పెక్కురు చర్చించియున్నారు. అన్ని చర్చల పర్యవసానము నింతే. ఈ కాలమువాఁ డని నిర్ధారించుటకుఁ దగిన సాధనములు లేవు. శ్రీచిలుకూరి వీరభద్రరావుగారాంధ్రుల చరిత్రమున నిట్లు వ్రాసినారు. క్రీ. శ. 925-40 సం. ప్రాంతమున నున్న యీ సత్యాశ్రయుని నన్నెచోడమహాకవి తన కుమారసంభవకావ్యమున నీక్రింది పద్యములోఁ బేర్కొనియున్నాఁడు.

"క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్."

1. ఇది నా దగ్గఱ నున్నది. గ్రంథపాతములతో నిండి యందందుకులుగా నించుకమాత్ర మున్నది.

2. బసవయరాఘవుని శాసనము. (బట్టర్వర్తుగారి శిలాశాసనముల వాల్యూము 2 లో, నెల్లూరుజిల్లా, కనిగిరితాలూకా శాసనములలోఁ జూడుఁడు.)

దీనింబట్టి నన్నయభట్టారకునకు నూతేండ్లకుఁ బూర్వమే యాంధ్రకవితా సతి వర్ధిల్లుచున్నదని స్పష్ట మగుచున్నది.'

శ్రీ వీరభద్రరావుగారుగాని, మఱియెవరుగాని నన్నిచోడఁడు నన్నయ కంటెఁ బ్రాచీనుఁడని చెప్పఁజూచుటకును, గావచ్చునని లోకము విశ్వసించుటకు నీ పద్యమే ప్రధానాధారముగా నున్నది. శ్రీ రామకృష్ణకవిగారు ప్రచురించిన కుమారసంభవముద్రితప్రతిలో నీపద్య మిట్లున్నది. 1909 సం॥ దీనిని ముద్రించినారు అప్పు డీపద్యమునకు వారు పాఠాంతరమును జూపలేదు. వారి యచ్చునకు మాతృక యెక్కడిదో చెప్పను లేదు. కవిగారు కుమార సంభవము రెండవభాగపుఁ బీఠికలో నిట్లు వ్రాసినారు. "కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజాము రాజ్యమునఁ బ్రాచీనశాసన శోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాట దేశముననే లభించెను. తక్కినవి రెండును శుద్ధద్రవిడదేశమునన్నే యగపడెను" ద్రవిడకర్ణాటదేశములందు మూఁడుప్రతులు దొరకినను నచ్చులోఁ బెక్కులు గ్రంథపాతములుండుట వింతగానున్నది ఆ మూఁడు ప్రతులు నొక్క మాతృకకే పుత్రికలాయేమి? కాకున్నచో నవి పాఠభేదములు లేకయు సమాన గ్రంథపాతములు గలిగియు నుండుట వింతగదా? పట్టికలో ముఖ్య పాఠభేదము లని వారు చూపినవి ప్రాయికముగా ముద్రణమందర్థానుగుణముగాఁ జేయఁబడిన సంస్కారములకు వ్రాఁతప్రతిలో నున్న తప్పుపాఠములుగా గోచరించుచున్నవి. కుమారసంభవప్రతులయొక్కయుఁ బాఠములయొక్కయు రహస్యము లింకను బయల్పడవలసియే యున్నవి. కాని తంజావురపుసరస్వతీపుస్తకభాండాగారమునఁ దాటియాకులపై వ్రాయఁబడిన కుమారసంభవపుఁబ్రతి యున్నది. అక్కడఁ దక్క నింతవఱకుఁ బ్రత్యంతర మెక్కడను మనకుఁ గనరాదు. వినరాదు. ఆ పుస్తకములోఁబై పద్యమిట్లున్నది.

"క. మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

కవిగారికి "చన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్" అన్న పాఠ మెక్కడనుండి వచ్చినదో! వా రింకనెక్కడి ప్రతిసంపాదించినారో! ప్రథమ భాగమును ముద్రించునప్పటికి వా రీతంజావూరుప్రతి నెఱుఁగనే యెఱుఁగరు

గావలయు ఎఱిఁగియుందురేని యనర్ఘ మగునీపాఠమును జూపకుండుట కేమికారణము? తంజావూరుపుస్తకశాలలో నన్నిచోడనికుమారసంభవ మున్న దని యెల్లరు నెఱిఁగిన తర్వాత క్రీ. 1914 లో వీరు ప్రచురించినకుమార సంభవపు రెండవభాగమున "చాళుక్యరాజుమొదలుగఁబలువుర్" అనుపాఠాంతర మున్నట్లు తెలిపిరి. కాని యిప్పుడయినను దంజాపురపుఁ బుస్తకమును వీరు చూచినట్లు వ్రాయలేదు. కావున నీపాఠము మఱియొక ప్రతిలోఁజూచినారేమో? అత్యూహ లెందులకు? తంజావూరుపుస్తకపాఠముమాత్రమే మనకిప్పుడు గ్రాహ్యము: శ్రీకవిగారిపాఠము గలమాతృక బయల్పడువఱకును. అట్టిప్రత్యంత రము బయల్పడెనా యది పాఠాంతరముగాఁ గూర్చుకొందము. ఇఁకఁ "చాళుక్య రాజుమొదలుగ" నన్నప్పుడు రాజరాజనరేంద్రుఁడే యేలకారాదు? చోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁ డనుట కాధారములు తగినవి లేవు. శ్రీవీరేశలింగము పంతులుగారు నన్నిచోడనిభాషాప్రయోగములను గూర్చి చేసినయాక్షేపములు నిలువఁజాలనివి.[1] వానినెల్ల నిర్వచించుట కిక్కడ స్థలము చాలదు పాల్కురికి సోమనాథుఁడు 1180 ప్రాంతముల నున్నవాఁ డనుపంతులవారిసిద్ధాంతము పోలును నన్నిచోడఁ డంతకు ముందటివాఁడో వెనుకటివాఁడో సిద్ధాంత మేర్పడ లేదుగదా! ఈయిర్వురిలో నొకనిపుస్తకము నింకొకఁడు చక్కఁగా సంగ్ర హించుకొన్నాఁడు. ఇది చదివిచూడుఁడు!

"ద్వి. నెట్టన నేలకు నింగికి సూత్ర,
పట్టి మ్రోఁకాళ్లకు బట్టతలలకు
ముడివెట్టఁ దననీడ గడవంగఁ బాఱ,
వడి నెండమావులకడగళ్లు కట్ట;
పాయక రెండుగాఁ బారెడునీరు,
వ్రేయఁ బుల్జున్ను గోరో యని యమ్మ;
జానార యొలువఁ జట్రాతిపైఁ గ్రుంక,
నేనుంగుపురు డోమ నిసుము త్రా ద్వైన;
లలిగొన దెసలు తాళములు వాయింపఁ,
జెలఁగుచు రోఁకటఁ జిగురులు గోయ;
కలి వెన్న పుచ్చఁ గొందలు దొతిఁ జేర్ప,

1 ఆంధ్రకవుల చరిత్రము 1 భాగము.

నిల మంచుఁ గుంచానఁ గొలువ రేఁబవలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు,
వ్రాయ వాయువుఁ బట్టి వడగళ్లగుళ్ల
గట్ట వెన్నెలగుంపుగాఁ జేయవచ్చి
పుట్టినప్పుడె నేర్పు బుద్ధులప్రోఁక."

"సీ. నేలయు నీఁగియుఁ దాలముల్ వాయింప నెండమావులఁ బట్ట బండతలయు,
మ్రోఁకాలు ముడివెట్ట రోఁకటఁ జిగుళులు గోయఁ జట్రాతిపైఁ గ్రుంగ నిడుపు,
లేక చిత్రము వ్రాయ నాకాశమునఁ దాఁపరము నిడ మంచుఁ గుంచములఁ
గొలువ,
నేనుంగుపురు డోమ దానార గొన గాలి గం టిడ నిసుమున గట్టు దాల్ప,

గీ. నీరినడుము దెంప నేలఁ దెన్నుండి చే
వెల్పఁ గలిగియుఁ ద్రచ్చి వెన్న గొనఁగఁ
గడవ నేర్పు గలిగి కందువు మా నేఁడై
కర్తిగంటు లయిన యత్తగంతు." కుమా. భా. 2-135.

ఇట్లీయిర్వురగ్రంథములనుండియు వలసినన్ని సంవాదములు చూప వచ్చును. సులువుగా ద్విపదలో సోమనాథుఁడు కూర్పఁగా నన్నెచోడఁ డిట్లు సీసపద్యమునఁ జేర్చుకొన్నాఁడేమో ; సుసూక్ష్మముగా నీయిర్వురకృతులను బరిశీలించినచో నీవిషయము బయల్పడఁగలదు. భాషావ్యుత్పత్తిలోఁ జోడఁడును సోమనాథుఁడునుగూడ సమధికులేయని యాయాగ్రంథములఁ జక్కఁగం జదివి యెఱిఁగినవారు భావింతు రని నా నమ్మకము.

**పెద్దిరాజు, పొన్నాడ** :— ప్రబంధమణిభూషణపుఁ బీఠికలో శ్రీరామకృష్ణ కవిగారిట్లు వ్రాసిరి. "విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణియుఁ[1] బ్రద్యుమ్నచరితయు రచియించెను. రెండవకృతిచాలఁ బ్రౌఢమయినది. దానిలోనుండి 113-వ పద్యము మాత్రమే గ్రహింపఁబడినవి." కావ్యాలంకార చూడామణి కర్తయింటిపేరు విన్నకోట గదా ; ప్రద్యుమ్న చరిత్రకర్త యింటిపేరు పొన్నాడ యని యిందున్నది. కవిగారట్లు వ్రాయుట

---

1. కావ్యాలంకారచూడామణి 7 ఉల్లాసములు మాత్రము ముద్రింపఁబడెను. ఇంకను మఱికొంత గ్రంథము ముద్రింపఁబడవలసి యున్నది.

కేమి యాధారమో? ప్రద్యుమ్నచరిత్రము వారికడ సమగ్రముగానుండెను గాఁబోలును. లేనిచో నదిచాలఁ బ్రౌఢమయినదనియు నన్నూటయేఁబదికిఁ బైపడిన పద్యములు యత్కర్తృకములో, యేకృతులలోనివో తమకెఱుఁగ రాకపోయిన యాప్రబంధమణిభూషణమున, 113-వ పద్యమొకటిమాత్రమే ప్రద్యుమ్నచరిత్రమునుండి గ్రహింపఁబడినదనియు నెట్లు చెప్పఁగల్గుదురు? కవిగారు ప్రబంధమణిభూషణ మనుపేరుతోఁ బ్రచురించిన సంధానసమ్పుటకుఁ బ్రతులు నాల్గయిదు తంజాపురపుఁ బుస్తకశాలలోనున్నవి. కాని వానియందు లేనిపద్యములనేకములు వీరి ముద్రణమునఁ జేరినవి. వీ రే యేప్రతులను బట్టి యాగ్రంథమును ముద్రింపఁగల్గినారో తెలియదు.

**పోతరాజు** :- ఈతఁడొక (బేతాళపంచవింశతి) రచియించెనట! శ్రీ రామకృష్ణకవిగారు తమకు దొరికిన కవిభల్లటునివి క్రమార్కచరిత్ర బేతాళపంచవింశతి యందలి వని యుదాహరించిన పద్యములు కూచిరాజు ఎఱ్ఱయ రచించిన సకలకథానిధానమందలి బేతాళపంచవింశతి కథలలోనివే. ఇటీవల నొక బేతాళపంచవింశతి భాగముదొరికినది.[1] అది యత్కర్తృకమో?

**మల్లయ, నంది** :- ఈతఁడును ఘంటసింగయయును గలసి జంటకవులుగదా! అఘోరశివాచార్య దక్షిణామూర్తిశివాచార్యులకు వీరు శిష్యులు. విద్యానగరమున 'శివాచార్య' పీఠమొకటి యాకాలమునయుండెను. అందు వైరాగ్యశివాచార్యాఘోరశివాచార్యదక్షిణామూర్తిశివాచార్యాదు లధిష్ఠాతలు. అఘోరశివాచార్యాదుల కృతులు శైవాగమగ్రంథములు శైవతత్త్వామృతాదులు పెక్కులున్నవి. లక్షద్వయాధ్యాపకుఁడట యఘోరశివుఁడు. మా. రా. కవిగారు క్రీడాభిరామపీఠికలో "......అవి రుచ్యములుగావని సందసింగనయు ఘంట మల్లయయు-(ఇంటిపేర్లఁ బేర్లను దారుమారు.) గలసి యార్వీటి తిమ్మరాజున కంకితముగా షష్ఠస్కంధమును శృంగారషష్ఠ మనుపేరుతో రచించిరి" అని వ్రాసినారు. నందిమల్లయ ఘంటసింగయలు ప్రసిద్ధులు. వారుగాక పేర్మార్చి యీవిధముగాఁగూడ నిర్చురున్నారా? ఏమో! లక్షణగ్రంథకర్తలు వాటి పద్యములను శృంగారషష్ఠమని యుదాహరింతురు. ఇదియెట్లో? ప్రయోగరత్నాకరమునను శృంగారషష్ఠమందలిదిగా నీపద్య ముదాహృతము.

---

1. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది.

"ఉ. చండాంశు ప్రభవీక్ష తిమ్మయతనూజా! తిమ్మ! విధ్వస్తపా
షండంబైన త్రిలింగభాగవత షష్ఠస్కంధభాగంబు నీ
కుండక్కెం జతురాననత్వగుణయుక్తు లీల వాణీమనో
భండారోద్ధతి చూఱకారబిరుద ప్రఖ్యాతి సార్థంబుగన్."

ఈ సంధానమున మలయమారుతము సర్వయ షష్ఠస్కంధ ముదాహరింపఁబడినది.

**రామయ్య, ఆంధ్రకవి:**—వాసిరాజు రామయ్యయు నీతఁడు నొక్కఁడో? వేఱో? ఈతఁడు ప్రాచీనకవులను మాత్రమే స్తుతియించినాఁడు. అందు, "ఛందోనిబంధనచాతురీధౌరేయ వాగ్ధామువేములవాడభీము" ననుచున్నాఁడు—లాక్షణికులుగూడఁ బెక్కురు కవిజనాశ్రయము వేములవాడ భీమకవి రచితమని యుదాహరించెదరు.

''క. చను నుత్తమగండాఛ, ర్వణహనుమదనంతనకవిరాక్షసజయదే
వనుతశ్రీధరగోక, ర్ణనీలకంఠాది భీమసచ్ఛందంబుల్''

అనఁగా "దశవిధచ్ఛందములు." రంగరాట్ఛందస్సు.

ఈ విషయము మిక్కిలి సందిగ్ధముగానేయున్నది. భీమకవియే రచియించి కోమటియగు మల్లియరేచనిపేరఁ బ్రకటించెనని నానుడి! ఆకోమటి మిక్కిలిగా నందుఁ బ్రశంసించుకొనఁబడినాఁడు వేములవాడ భీమకవియో కోమట్లను బడఁదిట్టినాడు; వినుఁడు.

ఉ "కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసములేద, యింటికిన్
సేమమెఱింగి చిచ్చిడినఁ జెందదు పాపము; వానినెప్పుడే
నేమఱుపాటున న్మఱియు నేమియొనర్చిన లేద దోస; మా
భీమునిలింగమాన! కవిభీమునిపల్కులు నమ్మియుండుఁడీ.

చ. గొనకొని మర్త్యలోకమునఁ గోమటి పుట్టఁగఁ బుట్టెఁ దోన బొం
కును గపటంబు లాలసయుఁ గుత్సితబుద్ధియు రిత్తభక్తియున్
ననుపరిమాటలున్ బరధనంబును గ్రక్కున మెక్కఁజూచుటల్
కొసుటలు నమ్మటల్ మఱియు గొంటుదనంబును మూర్ఖవాదముల్.

వేములవాడభీమున యిట్లు సెప్పఁగా వేఱొకకవి దాని నిట్లు ప్రశంసించినాఁడు.

ఉ. లేములవాడభీమ! భళిరే! కవిశేఖరసార్వభౌమ! నీ
వేమని యానతిచ్చితివి యిమ్ములఁ గోమటి పక్షపాతివై
కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసము లేద యంటివా
కోమటి కొక్కటీక 'పదిగొన్న'ను ధర్మమె వర్మపద్ధతిన్"[1]

కోమటి సొమ్ముఁదిని కృతిసమ్మకొని యాతని నెంతోపెద్దగాఁ బ్రకటించినకవినోరే యాకోమటి కొలము వారినిట్టు తిట్టునా? ఏమో? కృతిచెప్పించుకొని వెల్లడించుకొని తుదకుఁ గోమటి ద్రోహముచేయఁగాఁ దిట్టినాఁడేమో! ఏమో ఊహలెందులకు? "ఘనుఁడన్ వేములవాఁడవంశజుఁడ" నిత్యాదిచాటుపద్యములకుఁ బ్రసక్తుఁ డగు భీమకవి కవిజనాశ్రయకర్త కానేరఁ డనియే నాతలంపు అతఁడు శివభక్తిపరాయణుఁడు. ఐతిహ్యములు, చాటుపద్యములు, నితరకవికృతస్తుతులు, నీవిషయమును రాద్ధాంతపఱుచుచున్నవి. పార్వతీపరమేశ్వరులే తమకుఁ దల్లితండ్రులనుట శైవులసంప్రదాయము. "ధర నుమా మాతా పితా రుద్ర యనెడు । వరపురాణోక్తి నీశ్వరకులజుండ ... బసవని పుత్త్రిండ బసవగోత్రుండ" [2] పాల్కురికి సోమనాథుఁడు.

"ఇట్లే భీమకవియుఁ దాక్షారామభీమేశనందనుఁడ"నని చెప్పికొన్నాఁడు ఇఁకఁ గవిజనాశ్రయకర్తగా గ్రంథమున నెఱుఁగఁబడు రేచనజైనుఁడు శైవులకును జైనులకును బ్రచండవిద్వేషము. వీరికి వారికి నాఁటుచాళ్లపెట్టు. మతమున విశ్వాసము, పట్టుదల, నెట్టుకొని యున్నయా కాలమున మాఱుమతపువాని పేరఁగృతినివెల్లడించుటయేకాక యందుఁ, దనకు మిక్కిలివిద్వేషింపఁదగిన యామాఱుమతపు దేవరనుబ్రశంసించుటయు 'భీమేశనందనుఁడ'నని చెప్పుకొ[illegible] స్వమతాభిమానికి భీమకవివంటివానికి సంభవింపదు కవిజనాశ్రయమున [illegible] దేవతాప్రశంసయే కాక స్తోత్రముకూడ నున్నది. శ్రీ జయంతిరామయ్య[illegible]

1. ఈ పద్యమున లేములవాడ యనియె కలదు. తక్కిన భీమకవి చాటువులన్నిటిలోఁ గూడ లేములవాడ, యను పాఠమున్నది. ఇది ప్రయోగపరత్వాతిశయమున నుదాహరింపఁబడినది.

2. కం. వీ. కవులచరిత్రమున, "దీనినిబట్టి సోమనాథుఁడు లింగాస్యుని పుత్త్రుఁ డయినట్టును బసవేశుని పుత్త్రుఁ డయినట్టును గనఁబడుచున్నాఁడు" అని యుండుట సరికాదు.

పంతులుగారు1 దక్షిణదేశమున దొరకిన యొక్క ప్రతిలో మాత్రమున్నవని యేడు పద్యము లవతారిక యను పేర గవిజనాశ్రయమునఁ బ్రకటించినారు. ఇందు మించుగ ముప్పదినలువది కవిజనాశ్రయపుఁ దాళపత్రప్రతు లాంధ్రదేశమునను దక్షిణ దేశమున బరిశీలించితినిగాని యీ పద్యములు నాకెందును గానరాలేదు. పంతులుగా రాపద్యములను గూర్చి యిట్లు వ్రాసినారు. "ఈ యవతారిక యొక్క ప్రతిలో మాత్రముండుటచే బ్రక్షిప్తమని తోఁపవచ్చును గాని, కవితావైఖరిని బట్టిచూడ నది ప్రక్షిప్తము కాదనియే నా నమ్మకము." పంతులుగారి యీ నమ్మక మసమర్థమని నా సమ్మతము. అనంతునిచ్ఛందమందలి మొదటిపద్యమే యీషద్భేదముతో నీయవతారికకు మొదటి పద్యముగా నున్నది.

క. శ్రీపల్లభు యతిగణసం, సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భాసజసురు సలఘుచ్ఛం, దోవినుతు మురారి భక్తితో వినుతింతున్.

లేకపోయినను భీమేశనందనుఁ డగుభీమకవి యిట్లు 'మురారి' నిష్టదైవముగా స్తుతియించు నని సమ్మతాము. కాన యిది యాతనిది కానేరదు. ఇంక రెండవపద్యము :

"క. శ్రీకరముగ రచనపై
లోకంబున సుకవివరులు లోలతఁ బొగడన్
బ్రాకటముగ నీఛందము
లోకం బౌ ననఁగఁ దెలుఁగులో నొనరింతున్.

ఇందుఁ బ్రాసమునకై 'శ్రీకరముగ' 'లోకంబున' 'ప్రాకటముగ' 'లోకంబౌననఁగఁ' నని నాల్గుపదిబాళ్ళు పడినవి. యతికై 'లోలత' వచ్చినది. కవిజనాశ్రయమందలి శైలికి నీపద్యముల శైలికిని పోలికయే లేదు. ఈ ఛందము తెల్గులో నొనరింతునని రచింపబోవువాఁ డెట్లు చెప్పఁగూడును? రచింపఁబోవు దశలో 'నీఛంద మనుటకుఁ బొసఁగుఁబా టెట్లు? కవిజనాశ్రయమును బఠించినఁ కవితాలుబ్ధుఁ డెవఁడో దాక్షిణాత్యుఁ డిటీవల నీ యవతారిక నైతిహ్యమును బట్టి కూర్చిన ట్టీపద్యమే చెప్పక చెప్పుచున్నది ఇట్టికవితా వైఖరినిబట్టి చూచి యట

1. కవిజనాశ్రయము శ్రీరామయ్యపంతులుగారిచేఁ బ్రకటింపఁబడినది. అందు రెండవపద్యమున "పరహిత చరితుండ నాంధ్రపదభక్తి మెయిన్" అను పాఠమున్నది. ఒక పత్రికలో 'జితేంద్ర'యని యున్నదనియు, నది కవి సమ్మతమైనచో 'జినేంద్ర' యని యుండవలెననియు వారు వ్రాసిరి. అనేక తాళపత్రప్రతులలో 'జినేంద్ర' యన్నపాఠ మున్నది

రామయ్యపంతులుగారిది ప్రక్షిప్తముకాదని నమ్ముచున్నారు. 5, 6, 7, పద్యములుగూడ నస్వరస మగు కూర్పుతో నున్నవి. మఱియుఁ బంతులుగారు;

క. పరఁగిన విమలయశోభా
సురచరితుఁడు భీమనాగ్రసుతుఁ డఖిలకళా
పరిణతుఁ డయ్యెను భూసుర
వరప్రసాదోదితధ్రువశ్రీయుతుఁడై"

క. అసమానదానరవితన
యసమానోన్నతుఁడు వాచకాభరణుఁడు ప్రా
ణసమానమిత్రుఁ డీకృతి
కిసహాయుఁడు గానుదాత్తకీర్తి ప్రీతిన్

అని గ్రంథమందు దగలసిన పద్యములను సాధుపాఠములుగల సముచిత ప్రతులతోడ్పాటు లేమిచేఁ గాబోలును, "విమల యశోభాసురచరితుఁడు" "భూసురవరుఁడు ప్రసాదోదితధ్రువశ్రీయుతుఁడై" 'యాచకాభరణుఁడు' అను చెడు పాఠములతో గ్రహించి "ఈ పద్యము లనన్వయములుగా నుండుటచేత నందు బేర్కొనఁబడిన భీమునకును గ్రంథమునకును గల సంబంధ మిట్టిదని నిర్ణయింప వలను గాకున్న" దని పీఠికలో వ్రాసి ప్రక్షిప్తములట్లు గ్రంథమునఁ జేర్పక క్రిందఁ గూర్చినారు. పైపద్యము లనన్వితములుగావు. గ్రంథమునఁ గూర్చుకొని చూడ నచోఁ దేటపడఁగలదు పాఠము తప్పుగా నున్నప్పుడు సమన్వయ మెట్లేర్పడును?

మఱియు, రామకృష్ణకవిగారు భీమకవిదేశము నైజాం రాష్ట్రమందలి వేములవాడయగునో యని నీతిశాస్త్రముక్తావళిపీఠికలోఁ దెలిపినదానిఁ బున రామయ్య పంతులుగారు కొన్ని యుపపత్తులతోఁ బెంపొందించి బలపఱిచినారు. వాస్తవము కావచ్చును నైజాంరాష్ట్రమందలి వేములవాడలో వెలసిన యీశ్వరునకు రాజేశ్వరుఁడను సుప్రసిద్ధనామ మయ్యెను. మనభీమకవి తరచుగా దనయిష్టదైవమును 'భీమేశ్వర' 'భీమలింగ' నామములతోనే పేర్కొన్నవాఁ డయ్యెను. ఆ రాజేశ్వరునకుఁగూడ భీమేశ్వరుఁడని సుప్రతీతి గలదా? లేదు. అ సుప్రసిద్ధ మయిన రాజేశ్వరనామమును విడచి స్థలాంతరమున సుప్రసిద్ధమైన భీమేశ్వర నామమును బేర్కొనుట భీమకవి గోలకొండ రాష్ట్రవాస్తవ్యత్వమునకు గొంత బాధకము. పద్యములలోనున్న వేములవాడ యన్న పేరు గోదావరీమండల

మందలి వేములవాడకుఁగుదురకపోవుట తత్రత్యత్వమునకు బాధకము. కవినిఁ గూర్చియుఁ గవికావ్యములను గూర్చియు నిది మిథ్థ మని నిర్ధారణ మేర్పడని యప్పుడీస్థలమును గూర్చి యింతచర్చ యెందులకు?

మఱియు. రామయ్యపంతులుగారు 'ఘనుఁడన్ వేములవాడ' అన్నపద్యమున శ్రీరామమూర్తిగారు 'కల్పించిన' 'వెలుంగాధీశ'యన్నపాఠమునకు బదులుగా వీరేశలింగముపంతులు గారు 'తెలుంగాధీశ' యన్నపాఠముచు జెప్పి' రనియుఁ 'దెలుంగ్వధీశ' యని కాని 'తెలుంగధీశ' యని కాని యుండవలయునే కాని 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణదుష్ట మనియు నట్లు భీమకవి ప్రయోగింపఁడనియు గర్హించి 'కళింగాధీశ'యని చేర్చుకొని "కళింగాధీశ యను పాఠ మీ ప్రతీతి కనుగుణము, సర్వవిధముల నిర్దుష్టము; ఇదియే కవిప్రయుక్తపాఠమై యుండవలయును" అని వ్రాసిరి కాని యీపాఠము వీరి కెట్లువచ్చినదో చెప్పనొల్లకపోయినారు కావుననే వీరేశలింగముపంతులుగారు "తెలుంగాధీశ యన్నపాఠము వ్యాకరణదుష్ట మగుటచే నది కళింగాధీశ యని యుండవలెనని యొక రనుచున్నారు" అని యది రామయ్యపంతులుగారు సంస్కరించినపాఠమయిన ట్లభిప్రాయపడినారు. 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణదుష్ట మనెడు వాదము గ్రాహ్యము కాదు తద్భవ, దేశి, నామములకు డుప్రత్యయము పరమగుచో నకారాదేశము వచ్చును. రంగఁడు, లింగఁడు, మారఁడు, సూరఁడు, గురువఁడు, తిప్పడు, మొ ఇట్లే తెలుఁగఁడు కూడను తెలుఁగఁడే తెలఁగఁడని కూడ మాఱెను. 'తెలుఁగుఁడు' అని యుండదు 'తెలుఁగు' అన్నట్లుకూడఁ గాసరాదు సంస్కృతసమాసఘటిత మగునప్పుడా యకారాంత రూపమే ప్రాతిపదిక మగును కళింగగంగు, సాళ్వమంగు అనురూపము లున్నను గంగ్వధీశుఁడు, మంగ్వధీశుఁడు, నని యుండదు. పంతులుగారు 'తెలుంగాధీశ' యనుట వ్యాకరణదుష్ట మనునప్పుడు, శ్రీనాథకవిసార్వభౌముని 'యక్షయ్యంబగు' పద్యమును మరచిపోయినారు. వీరేశలింగము పంతులుగారి పాఠము యుక్తమే. "సుచరిత్రాఢ్యుని వత్సవాయితెలుఁగున్ క్షోణీశ చూడామణిన్" అని కం. వీ. గారు ప్రచురించిరి గాని యదికూడ "వత్సవాయుతెల(ల) గక్షోణీశచూడామణిన్"అనియే యగునని నానమ్మకము.

ఇఁక నా 'కళింగాధీశ' యన్న పాఠమును రామయ్యపంతులుగారు నా చాటుపద్యమణిమంజరినుండి· గ్రహించియుండవచ్చును. ప్రాచ్యలిఖితపుస్తక

శాలలోని యొకతాళపత్త్రప్రతిలోఁ జూచి దానిని చాటుపద్యమణిమంజరిలో 'తెలుంగాధీశ' యనుటకుఁ బాఠాంతరముగా ముద్రించితిని. లోకమువాకు లందుఁ దెలుంగాధీశ యన్న పాఠమే పాదుకొనియుండుటనుబట్టియు శ్రీనాథు నకుఁ గస్తూరికాభిక్షాదానము సల్పినతెలుంగురాయని పేరే భీమకవికూడఁ గస్తూరికాభిక్షమే యాచించినవానిపేరుగా నుండుటలో సందర్భవిశేష ముండఁ దగి యుండుటనుబట్టియుఁ ద్రోసిపుచ్చుటకు సాహసింపక ప్రధానపాఠముగా 'దీనినే యుంచితిని ఈ పాఠము పరిత్యాజ్య మనుటకు వ్యాకరణదుష్ట మనెడుకార ణము తగనిది. ఇతరవిధములఁ 'గళింగాధీశ' యన్నపాఠము పరిగ్రాహ్యతరము కావచ్చును

మఱియు వీరేశలింగముపంతులుగారు "సోమ గురువాక్యములు పెట్టి భీమ సుకవి, గరిమ బసవపురాణంబు గణనచేసె''నని పిడుపర్తి బసవన బసవపురాణ పద్యమును గొని వ్యాఖ్యానచాతుర్యముచే 'గణనచేసె' ననుటకుఁ గర్ణాటీకరించు టగా నర్థముఁ గూర్చి, పాల్కురికి సోమనాథుని యాంధ్రబసవపురాణమునుబట్టి కర్ణాటభాషలో భీమకవిచే రచియింపఁబడిన బసవపురాణము నుదాహరించి యా యర్థమును స్పష్టపఱిచిరి. పిడుపర్తి బసవన బసవపురాణపుఁ దాళపత్త్రప్రతు లలో "గరిమ బసవపురాణంబు కన్నడించె" సని యున్నదిగావున వ్యాఖ్యాన శ్రమ మక్కఱలేకయే యయ్యది కంఠోక్త మగుచున్నది. కాని యా భీమకవియే వేములవాడ భీమకవి యని పంతులవారు పల్కుటకుఁ బ్రమాణమో ? లేదు వేములవాడ భీమకవి చాటుపద్యములలోఁ గూడ దాక్షారామ భీమేశ్వరుని స్మరించి యున్నాఁడు. కర్ణాటక బసవపురాణకర్త యాతఁడే యగునాఁ డందలి యెన్మి దాశ్వాసములలో నెక్కడనేని భీమేశ్వరుని స్మరింపకుండునా ? తెలుఁగుఁగవీశ్వ రులచే స్తుతింపఁబడుట కాతఁ డేవేని తెలుఁగుఁగబ్బములను గూర్చియే యుండ వలెనుగదా ! ఏవో యవి చేకుఱవలసియే యున్నవి. ప్రయోగరత్నాకరమున వేములవాడ భీమకవి నృసింహపురాణమందలివని కొన్ని పద్యము లుదాహరింపఁ బడినవి. ఎంత నిజమో ! వీరేశలింగముపంతులుగా రీతఁ డారాధ్యబ్రాహ్మణుఁ డనిరి. కోవెల గోపరాజు నన్నయభట్టును భీమకవిని వేఱుగా స్తుతియించి, తిక్క నాదులను ''మత్కులచంద్రు''లని తర్వాతఁ జెప్పుకొన్నాఁడు. మీఁది చర్చవలన వేములవాడ భీమకవి విషయము సర్వమును సందిగ్ధమే యగుచున్నది.

**రామలింగయ్య—తెనాలి.** రామకృష్ణుఁడు వేఱు, రామలింగఁడు వేఱుగా మా. రా. కవిగారు వ్రాసినారు.[1] సత్యము కావచ్చును.[2]

---

1. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక. 1. క్రీడాభిరామపీఠిక చూడుఁడు.

2. ఉ॥ గ్రాంథికసన్నుతప్రతిభఁ గాంచి రసజ్ఞత మించి యాదిమ
   గ్రంథము లుగ్గడించి ఫణిరాట్పరికల్పితశాస్త్రవీథికిన్
   బంధువు లైనసత్కవులఁ బ్రార్థన చేసెద దుష్ప్రబంధసం
   బంధమహాంధకారఖరభానుగభీరవచోమచర్చికన్.

   సీ. మహిత మూలస్థానమల్లికార్జునశిరస్స్థలచంద్రచంద్రికాధవళితంబు,
   చెదలువాటీపుర శ్రీరఘూద్వహభుజాస్తంభరక్షణవిధాసంభృతంబు,
   వేదండముఖతటాకోదితపద్మసౌగంధికగంధపాణింధమంబు,
   రాజబింబాననారాజిత గాంధర్వ మాధురీసాధురతీధరంబు,

   గీ. కరటికటనిర్గళద్ధ్వాననిరవధికసామ్యగనూతనవృష్టిజంబాలితాఖి
   లావనీపాలమందిరప్రాంగణంబు । గురుసమృద్ధులసైదోడు కొండవీడు

   మ. పరగన్ వారిధివేష్టితాఖిలమహీభాగంబునన్ రెడ్డిభూ
   వరసింహాసన మై శుభాయతన మై వర్ధిల్లు తత్పట్టణం
   బురుబాహాబలసంపదం బెసుచు భద్రోద్యోగి నాదెండ్ల గో
   పరసాధీశుఁ డశేషబంధుకుముదప్రాలేయధామాకృతిన్.

   గద్యము. ఇది శ్రీమదేలేశ్వరగురువరేణ్యచరణారవిందషట్చరణ సకలకళాభరణ రామ
   నార్యసుపుత్ర సుకవిజనమిత్ర కుమారభారవిబిరుదాభిరామ రామలింగయప్రణీతం
   బైన యుద్భటారాధ్యచరిత్రంబునం ... ... ... ...

   మన్మిత్రులు చల్లా సూర్యనారాయణరావుపంతులుగారు దీనిని బంపినారు. పాండురంగ
   మాహాత్మ్యకర్తయు, నేతత్కృతికర్తయు నొక్కఁడే యని గాని, వే అనిగాని
   నిర్ధారింపఁ దేలకున్నది. అతఁడు నీతఁడును రామయపుత్రులే. "శైవ వైష్ణవపురా
   ణావళీనానార్థరచనాపటిష్ఠైకరమ్యమతివి" కావున నాతఁడుకూడ నీశైవకథర
   చియించి యుండఁ దగును. అక్కడ రామకృష్ణుఁడని యిక్కడ రామలింగఁడని
   యున్నది. ఇక్కడఁ దెనాలి ప్రశంసకానరాలేదు. ఈయుద్భటారాధ్యచరిత్రము
   కూడ బయల్పడినఁగాని యదార్థముతేలదు ఇం దుదాహరింపఁబడినపద్యమందు
   నాదెండ్ల గోప మంత్రి పేర్కొనఁబడినాఁడు. ఈ రామలింగనికిఁ గుమారభారవి
   యని బిరుదు.

**వల్లభరాయుడు:–** శ్రీ మా. రా కవిగారు వల్లభరాయఁడు రచించినట్టున్న క్రీడాభిరామ[1] మను వీధినాటకమే శ్రీనాథుని వీధి నాటకము కావచ్చు ననిరి. శ్రీ కం. వీ, పంతులుగా రది "యతిసాహస' మనిరి. నా నిశ్చయము తప్పక యది శ్రీనాథునికృతియే యగునని; కారణసామగ్రి పుష్కలముగా నున్నది. ముద్రింపఁబడు నా "శృంగార శ్రీనాథ" మను గ్రంథమున నీచర్చ కలదు

**శేషనాథుఁడు :–** ఈతని పర్వతపురాణము ముద్రితము

**శ్రీనాథుఁడు—** వల్లభాభ్యుదయ మను శ్రీనాథకృతి యొక్కటి యున్నట్టిం దలి యొక్క పద్య మెఱిఁగించుచున్నది. వల్లభాభ్యుదయమునుగూర్చి శ్రీ మా. రా. కవిగారిట్లు వ్రాసినారు. "వల్లభాభ్యుదయములోఁ గృష్ణాతీరమున నుండు శ్రీకాకుళస్వామి తిరునాళ్ళలో జరుగు నసభ్యములు దీనికంటెఁ బచ్చిగా నున్నవి. మఱియు నాంధ్రవల్లభుని తిరునాళ్లలోని విధవాదుర్వర్తనములు శ్రీ నాథుఁడు విశదముగా వర్ణించియున్నాఁడు......శ్రీనాథుఁడు శ్రీకాకుళాధీశ్వరుఁ డగు తెలుఁగురాయని దర్శించి యతని కంకితముగా వల్లభాభ్యుదయమును జెప్పెను గదా ! అప్పుడు 'అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ' అని శ్రీనాథుఁడు చెప్పెను" ఈ వ్రాఁత శ్రీ కవిగారా వల్లభాభ్యుదయమును జక్కఁగాఁ జదివి యెఱిఁగినవా రనిచెప్పుచున్నది గదా ! ఆ గ్రంథము శ్రీకాకుళాధీశ్వరుఁ డగు తెలుంగురాయఁని కంకితమట ! అతఁడేయట సాంపరాయని తెలుంగురాయఁడు. సాంపరాయని తెలుంగురాయఁడు కృష్ణాతీరమందలి శ్రీకాకుళమునేలినాఁడనుట కట్టుకత. అధారము లేవియునులేవు. ఈ విషయమునఁగల యసందర్భములు పూర్ణముగా నా "శృంగారశ్రీనాథము"న వెల్లడింపఁబడినవి. ఇప్పటికి నలువది యేండ్లకుఁబూర్వ మొకకవి శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యమును వల్లభాభ్యుదయ మను పేరఁ దెల్గించినాఁడు అది యున్నది శ్రీనాథుని వల్లభాభ్యుదయమునుగూర్చి యిందలి పద్యమొకటితక్క మనకిఁక నేమియుఁదెలియదు. శ్రీ కవిగారు గ్రంథ మును జదివినట్లు వ్రాయుచున్నారు వారు దానిని వెలడింపవలసి యున్నారు.[1]

---

1. మా.రా. కవిగారు, క్రీడాభిరామఁపుభీతికలోనే యిట్లు వ్రాసినారు. "చంద్ర శేఖరుఁ డనునియోగిపుంగవుఁడు నరసింగరాయలమంత్రి యని సాళువాభ్యుదయ మున నున్నది. కావున "చంద్రశేఖరుక్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు" అనునది స్పష్టముగా నర్థమగుచున్నది." స్వాళ్వాభ్యుద

**హరిభట్టు** :— ఈతడు బహుగ్రంథకర్తగా నున్నాఁడు. ఈతని మాత్స్యవారాహపురాణములు దొరికియున్నవి. ఉత్తరనృసింహపురాణము దొరకలేదు. విష్ణుభాగవతము నేకాదశద్వాదశస్కంధములుగూడ నీతఁడు తెలిఁగించినాఁడు. ఆంధ్ర సాహిత్యపరిషత్పుస్తక భాండాగారమున 'హరి'భట్టు రచించినట్టు పై రెండు స్కంధములు నున్నవి. హరిభట్టనుటకు హరికభట్ట నుట వ్రాఁత గాని దోషమే.

నీతిసారము, పంచతంత్రి, కామందకము[1] మొదలగు కొన్ని గ్రంథము లకుఁ గర్త లెవరో యెఱుఁగ రాదు. మఱికొన్ని పద్యము లేగ్రంథము లందలివో కూడ నెఱుఁగరాక యున్నవి. ఇందుఁ బేర్కొనఁబడిన కవీశ్వరులు పెక్కురు ప్రాయికముగా కం. వీ. కవులచరిత్రము ప్రథమభాగమునఁ జేరఁదగినవా రగుదురు. ఇంతవఱకు నాంధ్రభాషలోఁ గవిజనాశ్రయముతక్క జైన ప్రసక్త మగు కబ్బము కానరాలేదు. ద్రవిడకర్ణాటభాషలలో జైనకృతులు పెక్కులున్నవి. ఇందు జినేంద్రపురాణ మనియు నాదిపురాణ మనియు రెండు జైన ప్రబంధము లుదాహరింపఁబడినవి. కాని వానియందలిపద్యము లెక్కువగాఁ జేకొనఁబడ వయ్యెను. ఉన్నపద్యములం జూడగాఁ బ్రాచీనతర–రచనముగాఁ దోఁపకున్నది

సంస్కృత వాఙ్మయమున శార్ఙ్గధరుని పద్ధతి, జల్హణుని సూక్తిముక్తావళి, వల్లభదేవుని సుభాషితావళి మొదలగు సంధానగ్రంథముల మూలమున నిప్పు డనుపలభ్యమానము లగు కావ్యములయుఁ గవులయు వృత్తాంతము లెన్నో గుర్తింపఁబడుచున్నవి; అట్లే యీసంధానములు గూడ నెందఱనో యపూర్వకవు లను, నెన్నింటినో యపూర్వకావ్యములను బయల్పరచినవి. ఇందుఁ గొన్ని యేని మన భావిపరిశీలనమూలమున బయల్పడఁగల వని విశ్వసింతము. మఱియు నెల్లూరి పెగ్గడరామాయణము మొదలగు ప్రాచీనప్రబంధము లిందుఁగూడ నను

---

యము ప్రాచ్యలిఖితపుస్తకాలలో నున్నది. అందెక్కడను సరసింగరాయలకుఁ జంద్రశేఖరుఁ డనునియోగిపుంగవుఁడు మంత్రిగా నున్నట్టు కానరాదు. వార మఱెక్కడి ప్రతిలో నట్టుచూచినారో! ఆచరణమున కట్టి యర్థములేదు. శృంగార శ్రీనాథమందలి "కినకాభిషేకము" చూ.

1. తంజావూరు పుస్తకశాలలో వేంకటరాజప్రణీత మగుకామందకము పద్యకావ్య మున్నది. అది యిది కానట్టున్నది.

దాహృతములు పెక్కులు మనకు దొరకవలసియున్నవి. పేరుకూడ లేకుండఁ గాలప్రవాహమింక నెన్ని మంచికావ్యములను ముంచివైచినదో గదా!

ఈ సంధాతలు ప్రాచీనులే యగుటచే వారి కాయా కవీశ్వరుల కావ్యములు దొరికియేయుండుననియు వారు వానిని పఠించియే పద్యములను సంగ్రహించిరనియు విశ్వసింపఁగూడును అయినను ప్రతివిలేఖకాదులమూలమున నిప్పుడు దొరకినప్రతులందుఁ గొన్ని కావ్యముల పేళ్లును గవుల పేళ్లును తారుమారయియుండవచ్చును. కొన్ని పద్యముల విషయమున నీ రెండుసంధానములకును ద్వైవిధ్య మేర్పడెను. ఈపద్య మీకావ్యమందలి దగును గాదని నిర్ధారింప నా కావ్యములు దొరకినంగాని కుదురదుగదా! ఈసంధానములకుఁ బ్రత్యంతరము లేని లభింపవయ్యె.

ఈ గ్రంథము చెన్నపురిలో ముద్రింపఁబడుచుండుటయు నే నక్కడ నుండరాక యవిరతప్రయాణములతో దేశాటనము సల్పవలసియుండుటయు సంఘటిల్లుటచే నచ్చుపని చూడనేకాక పీఠిక వ్రాయను వలసిన గ్రంథపరిష్కరము పరికింపను గూడఁ గుదురదయ్యెను. అయినను నా రెండుప్రాచీనసంధానములను జతకూర్చుట మొదలుగా నిట్లు ముద్రితమై వెల్వడుదాఁకఁ జెన్నపురిలో మన్మిత్రులు బ్రహ్మశ్రీ గన్నవరపు-సుబ్బరామయ్యగారు సల్పిన తోడ్పాటు, పరిశ్రమము, మిక్కిలి పెక్కుప. వారితోడ్పాటు లేనిచో నే నిప్పుడీగ్రంథమిట్లు ముద్రింపఁజాలను. మాముద్రణావసరమునఁగూడఁ గొన్ని పొరఁబాట్లు పొసఁగియుండవచ్చును. సందిగ్ధము లగు పద్యభాగము లట్లే నిల్పితిమి ప్రయత్నపూర్వక మగు విపర్యయ మిందేదియు నుండదు. ప్రమాదములు సరిపఱుచుకొనఁ బ్రాజ్ఞులకు నమస్కారము.

వేటూరి-ప్రభాకరశాస్త్రి.
9-1-18.

# పీఠిక

తెలుగులో పూర్వకవుల కావ్యములనుగూర్చి తెలిసికొనుటకు లక్షణ గ్రంథములును, సంకలన గ్రంథములును ప్రధానాధారములు లక్షణ గ్రంథములలో అప్పకవీయము, రంగరాట్ఛందస్సు, సర్వలక్షణ సారసంగ్రహము మొదలైనవి మనకు పరిచితములైనవేగాని. అందుండి మనకు కాలగర్భమున నడగిపోయిన కావ్యములు చాల కొలదిగానే తెలియుటవల్ల వాఙ్మయచరిత్ర కారుల కవి కొంతవఱకుమాత్రమే ఉపయోగకారులు.

అముద్రితములైన లక్షణగ్రంథము లింకను ఎన్నియో యున్నవి గాని యింతవఱకు వానినిగూర్చి పరిశ్రమ యేలేదు – వాని కూలంకష పరిశీలమువలన మన కీనాడు తెలియని ప్రాచీనకావ్యములు బయలుపడును – అవి పూర్తిగా పరిశీలితములైనగాని వాఙ్మయ చరిత్ర పూర్తికాదు.

## సంకలన గ్రంథములు

మన యదృష్టవశమున సంకలనగ్రంథములు మానవల్లి రామకృష్ణ మహోదయులు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మూలమున వెలుగునకు వచ్చి, ఆంధ్ర వాఙ్మయచరిత్రకారులకు విస్మృతములైన కావ్యములను, విస్మృతులైన కవులను పరిచయ మొనర్చినవి–అట్టి సంకలన గ్రంథములు మూడు.

1. ప్రబంధమణిభూషణము – 1910. సంపాదకులు మానవల్లి కవిగారు.
2. సకలనీతిసమ్మతము – 1923. ,,
3. ప్రబంధరత్నావళి – 1918 సంపాదకులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

మొదటి రెండును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారిచే విపుల పీఠికలతో పునర్ముద్రితములైనవి [1]

1. పీఠికలకర్త నిడుదవోలు వేంకటరావు, సంపాదకులు డాక్టరు పి. యస్. ఆర్. అప్పారావు — (1970–71)

ప్రభాకరశాస్త్రిగారి గ్రంథము నేడు అనగా ప్రథమముద్రణమున కేబదియెనిమిదేండ్లయిన తరువాత తిరిగి ముద్రణభాగ్యమునందుట సాహితీ చరిత్ర కారులకు ముదావహమైన విషయము.

## సంకలన గ్రంథములు - వాఙ్మయ చరిత్ర

పై మూడు గ్రంథములును తెలుగు వాఙ్మయచరిత్రలో నన్నయకు పూర్వమునుండి, క్రీ. శ. 18వ శతాబ్దివఱకు గల విస్మృతములైన కవి కావ్యములను దెలుపుచున్నవి. వాఙ్మయ చారిత్ర్యకదృష్ట్యా పరిశీలించిన వాని వివరణ మిట్లుండును.

ప్రబంధరత్నావళి - నన్నయకుపూర్వ కవికృతులు క్రీ. శ. 1660 వఱకుగల కాలమున నున్న కవులు, కావ్యములను దెలుపును

సకలనీతిసమ్మతము - నన్నయనుండి క్రీ. శ. 1480 వఱకు గల కవులు కావ్యములను దెలుపును

ప్రబంధమణిభూషణము - క్రీ. శ. 16, 17 శతాబ్దములలోనున్న కవులు కావ్యములు తెలుపును.

## ఆధారములు

ప్రబంధమణిభూషణమున కాధారమైన తాళపత్ర గ్రంథమును కవిగారు పేర్కొనలేదు - కాని ప్రభాకరశాస్త్రిగారు ప్రబంధరత్నావళి పీఠికలో నిట్లు చెప్పినారు "కవిగారు ప్రబంధమణిభూషణమను పేరుతో ప్రచురించిన సంధాన మునకు ప్రతులు నాల్గైదు తంజావూరి పుస్తకశాలలో నున్నవి" (పుట 16)

దీనివలన - ప్రబంధమణిభూషణమునకు మూలము తంజావూరి పుస్తక శాలలోనున్న గ్రంథమనుట స్పష్టము.

సకలనీతిసమ్మతపు వ్రాతప్రతిని మాత్రము ఆత్మకూరు సంస్థానాధీశ్వరులగు శ్రీమంతు రాజా ముక్కర సీతారామబహద్దరు వారిచ్చినట్లు తెలిపినారు - (పుట 72 పునర్ముద్రణము).

ప్రభాకరశాస్త్రిగారు తమ గ్రంథపీఠికయందు తాము సంధానించిన విధానము నిట్లు తెలిపిరి.

"ఇందలి పద్యములను సంకలనము చేసిన వారిర్వురు. ఒకడు పెదపాటి జగన్నాథకవి. నారాయణస్తుతి, శంకరస్తుతి, త్రిపుర విజయము, అర్ధనారీశ్వరము నని మొదలుపెట్టి తెలుగున పెక్కు వర్ణనాంశములు నేర్పఱచుకొని యైదాశ్వాసములుగా 'ప్రబంధరత్నాకర'మను పేర గ్రంథము రచించెను. పై గ్రంథమున మొదటిమూడాశ్వాసములు మాత్రమే తంజావూరి సరస్వతీ పుస్తక భాండాగారమందున్నవి. కడమ గ్రంథమెక్కడ నున్నది కానరాదు. వేఱొక్కని పేరు తెలియరాదు. అతని సంధాన మాంధ్ర సాహిత్య పరిషద్భాండాగారమున నున్నది. ఆ సంధానమునకు పేరులేదు మొదలు లేదు తుదిలేదు–పరిషత్తువా రుదాహరణ పద్యములని పేర్కొన్నారు. ఈ యిర్వుర కూర్పులందలి పద్యములను గ్రుచ్చియెత్తి నేనీ ప్రబంధరత్నావళిని గొత్తవెలయించితిని".

పైదానిని బట్టి–ప్రబంధరత్నావళి కాధారములు.

1. జగన్నాథకవి ప్రబంధరత్నాకరము
2. ఉదాహరణ పద్యములు.

వీనిలో ఉదాహరణ పద్యములు పరిషత్పత్రికలో ముద్రితములైనవి. మొదటిదగు ప్రబంధరత్నాకరమును గూర్చి వివరములు తెలిసికొనుట యావశ్యకము

తంజావూరి పుస్తకశాలలోని గ్రంథ వివరములు.

189. ప్రబంధరత్నాకరము–పెదపాటి జగ్గన **Prabandharatna-karamu–Pedapati Jaggana M.** 382.S—$18\frac{1}{2} \times 1$; **d**–162 = 114: **G.** 3240.

## యుగ విభజనము

ప్రబంధరత్నావళి తెలుగు సంకలనగ్రంథములలో కాలక్రమమున ద్వితీయమైనను–ప్రాచీన కావ్యోదాహరణములను ప్రపంచించుటచేత నద్వితీయమైనది. ముఖ్యముగా ఆంధ్రవాఙ్మయ చరిత్రకీ గ్రంథమెట్లు తోడ్పడినదియు వివరించుచున్నాను.

# నన్నయ పూర్వయుగము (క్రీ శ. 850-1000)

## జైనసాహిత్యము

నన్నయకు పూర్వము తెలుగులో సాహిత మున్నదనియు నది జైన సాహిత్యమనియు మొదటిసారిగా నిరూపించినది ప్రబంధరత్నావళి-ఇందు

పద్మకవి - జినేంద్రపురాణము.

సర్వదేవుడు - ఆదిపురాణము.

అను రెండు కావ్యములనుండి పద్యము లుదాహరింపబడినవి. వీనినిగూర్చి పీఠికలో (27 పుట) నిట్లున్నది.

"ద్రవిడ కర్ణాటభాషలలో జైనకృతులు పెక్కులున్నవి. ఇందు జినేంద్రపురాణమనియు నాదిపురాణమనియు రెండు జైన ప్రబంధము లుదాహరింపబడినవి. కాని వానియందలి పద్యము లెక్కువగా జేకొనబడవయ్యెను. ఉన్న పద్యములం జూడగా ప్రాచీనతర రచనముగా దోపకున్నది."

నేను వీనినిగూర్చి పరిశ్రమచేసి-ఇవి ప్రాచీనములనియు, తెలుగున జైన సాహిత్యమునకు సంబంధించిన కృతులనియు నిర్ణయించితిని.

## పద్మకవి జినేంద్రపురాణము (క్రీ శ. 941)

ఈ పద్మకవియే కన్నడ వాఙ్మయమున ఆదికవియని ప్రసిద్ధిగాంచిన పంపమహాకవి. పద్మకవి పంపకవియేయని "నాడోజపంప" అను గ్రంథమున నిర్వివాదముగా నిరూపింపబడినది. పంపమహాకవి తెలుగుదేశమున కరీంనగర మండలమున వేములవాడ నివాసి వేములవాడ కధీశ్వరుడైన అరికేసరి ఆస్థానకవి పంపకవి. తెలుగుబ్రాహ్మణుడు. జైనమతము నవలంబించినవాడు. ఈతని సోదరుడు జినవల్లభుడు వేయించిన శిలాశాసన మొకటి నేడు బయలుడినది. అందు 3 తెలుగు కందపద్యము లుండుట విశేషము. దీనినిబట్టి పంపకవి తెలుగున కవియని మనము నిశ్చయింపవచ్చును.

పంపకవి తన గురువైన జినేంద్రముని చరిత్రమును జినేంద్రపురాణముగా తెలుగున రచించినాడు. ఇందుండి యొక్కపద్యము మాత్రము నేడు మనకీ గ్రంథము ద్వారా లభ్యమైనది (చూ. నా తెలుగుకవుల చరిత్ర పుటలు 32-36)

## సర్వదేవుడు (క్రీ. శ. 953)

సర్వదేవుని తెలుగుకవులు స్తుతించిరి. ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్రలో.

చ. వినుతియొనర్తు నాంధ్రసుకవిప్రభు నన్నయభట్టు తిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని, జక్కన నాచనసోము సర్వదే
వుని భవదూరు వేము నలపోతన పిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి ధూర్జటి కేతన భట్టబాణునిన్.

ఎఱ్ఱన క్రీ. శ. 1500 ప్రాంతమువాడు.

దీనినిబట్టి తెలుగున సర్వదేవుడన్న కవి యున్నట్లు మనకు తెలియగలదు.

ఈ సర్వదేవుడు 'కన్నడ రత్నత్రయమని ప్రసిద్ధిగన్న పంప, పొన్న, రన్న లలో- పొన్న అనునతడు. ఈతడు కన్నడభాషలో శాంతిపురాణము అను గ్రంథము రచించి, అందు ద్వాదశాశ్వాసమున నిట్లు చెప్పుకొన్నాడు-

మ. సకలజ్ఞ కవిచక్రవర్తి జినచంద్రేంద్రంగ సద్భక్తిపూ
ర్వక దిందమ్మన భక్తినుంత దనుజాతం పొన్న నుంపేల్వు దం
దుకర ప్రార్థిత శాంతినాథ కథయం వేసప్పనం సర్వదే
వకవీంద్రం బరదంబుధర్ పొగఱ్వనం తన్నం మహోత్సాహదిం.

పైపద్యమువలన పొన్నకవియే సర్వదేవకవి యని నిశ్చితమైనది.

పొన్నకవికూడ పంపకవివలె తెలుగువాడే. అతడు వేంగిదేశమున కమ్మనాటిలో పుంగనూరు వాస్తవ్యుడు.

### ఆదిపురాణము

సర్వదేవకవి రచితమైన పై గ్రంథమునుండి రెండు పద్యము లుదాహరింపబడినవి. అందొక మత్తేభము ఒక కందము గలవు.

క. హరినీలమణి విరాజిత
సురుచిర గోపురముదగిలి చూచి తమిస్రా
కరుడు విధుంతుదమండల
పరిశంకంజేసి పురముపై జననోడున్.

ఆదిపురాణమనగా జైనతీర్థంకరులలో తొలివాడైన-ఋషభదేవతీర్థంకరుని చరిత్రము- దీనిని కన్నడభాషలో పంపమహాకవి వ్రాయగా తెలుగున పొన్నకవి వ్రాసినాడు.

పొన్నకవి ఆదిపురాణము మన కీనాడు లభ్యముకాకపోయెను. తిక్కన కాలమునాటి కుండినట్లుగా మనకిక్రింది పద్యములనుబట్టి తెలియుచున్నది.

క. అరదములు దీవు లున్నత
కరులు గిరులు హరులు వీచికలు సుభటసము
త్కర మ్యుగ్ర సత్త్వములుగా
శరనిధిగతి పాండుపుత్త్ర సైన్యం బొప్పెన్. (భీష్మ 1-131)

## ఆదిపురాణము — కన్నడము

క. తరళ తరంగ తురంగం
కరిమకరకరీంద్రమాఖిలశఫరతదాత్యు
త్కరముగ్రగ్రాహరథం
భరతం గిత్తురుపయోధి బళ విళ సవమం.

ఆదిపురాణము తెలుగునను నిదే ప్రాస యుండనోపును తిక్కన పద్య మున - "ర" ప్రాసయే యుండుట గమనించదగినది.

తిక్కన - కరికరశీకరతురగో
త్కరలాలాజాలరక్తధారాపటలీ
పరిషిక్తంబై సంగర
ధరణీరజ మడఁగె నద్భుతం బెలరారన్ - (భీష్మ 1-245)

కన్నడము-కరికరశీకరమదజల
తురంగలాలాంబుసేకదిందఅదుఅది
ర్దరజం నరేంద్రచామర
మరుదభిహతియందెరళ్దు తూళ్దత్తాగళ్

పైవానినిబట్టి తిక్కననాటికి సర్వదేవుని ఆదిపురాణము వ్యాప్తిలో నున్నది.

ఉ. శాలివనాలి గ్రాలి జలజాతపరాగము దూలి పద్మినీ
కూలలతాంత సౌరభము గ్రోలి మధూలిత పక్షజాతవా
తూలము నేలివాఃకణము దోలి మదేభమదాంబుధారలన్
దేలి వనాంతరాళములఁ ద్రిమ్మరు గాలి ప్రమోదశాలియై.

ఇది సర్వదేవుని యాదిపురాణమునందలి దని లక్షణసారమను నొకలక్షణ గ్రంథమున నున్నది

అప్పకవినాటికి ఆదిపురాణమున్నట్లు తెలియుచున్నది. ఆదిపురాణ మని యిచ్చిన పద్యము ఉత్తర హరివంశములో నున్నది కాని - ఆ కాలమునకు తెలుగున ఆదిపురాణ మున్నట్లుగా అది తెలుపుచున్నది.

(తెలుగు కవుల చరిత్ర పుటలు 91-96)

## శివకవియుగము (1100-1250) నన్నెచోడకవి

నన్నెచోడకవికృత్యంతరమగు కళావిలాసము నుండి యిందు 4 పద్యము లుదాహరింపబడినవి. ఈ గ్రంథమునకు ముందుగా కళావిలాసమును గూర్చి తొలుత మానవల్లి వారే తెలిపిరి-1908 లో కుమారసంభవ ప్రథమభాగమున-పీఠికలో నాల్గు పద్యము లిచ్చిరి.

| | ప్రబంధరత్నావళి |
|---|---|
| క. తలపోయఁగ రుచులాఱును | 184 పద్యము |
| చ. తొడవులు వెట్టుసంభ్రమముతో | 185 ప. |
| సీ. పృథుల విశ్వంభరారథము | 186 ప. |
| క. శ్రీమంతుఁడు గుణవంతుఁడు. | 187 ప |

ప్రబంధరత్నావళిలో 187 పద్యముగా నున్న 'శ్రీమంతుఁడు' అన్న పద్యము కవిగారియలేదు. దానికి బదులుగా

చ. లలనలు కొందరాత్మపతులం దగగూడిన చెయ్వులన్నియున్
దలఁచి సఖీజనంబులకు దప్పక చెప్పెడివారు పుణ్యజీ
వులు చెలి యామినీశుని కవుంగిల డాయుటెగాక తాల్మికి
ల్దొలఁగిన తీరుగేరునటు దోపవు నాకు రతిప్రయోగముల్.

ఇందువలన కళావిలాసమున మనకు లభించిన పద్యములైదని తెలియవలెను. ఇందలి మన్మథస్తుతి లోకోత్తరమైనది. ఇతరకవులెవ్వరును చేయనిది.

అట్టిజగజెట్టి మన్మథుఁ డఖిలలోక
ములకు వెఱగొంగ జీవులమూలకంద
యతని యిలుసొచ్చివెడలని యతఁడుగలఁడె
యతని యమ్ములఁబడకున్న యతఁడు గలఁడె.

(కవిగారి రచనలు, పీఠికలు పుట 2)

## సోమేశ్వరుడు పాలపర్తి. (5–11–12 పద్యములు)

ఇచ్చట 'పాలపర్తి' అని యుండుట సరి కాదు. అది "పాలకుర్తి" యని యుండవలెను. ఇది ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి ఉదాహరణ గ్రంథములో గలదు. అచ్చటి వ్రాతప్రతినిబట్టి నేను నా ప్రతిలో సవరించినాను. ఇం దుదాహరింపబడినవి రెండును సీసపద్యములే. అవి త్రిపురాసురసంహారమును ప్రశంసించునవి ఇందలి రెండవపద్యము భావధ్వనికి ప్రశస్తమైన లక్ష్యము.

సీ. వింటిక్రిందికి కొమ్మ వికలించి పెఱికిన
భూకాంతకును నాభి పొలుపు మిగిలె
నమ్మ పుచ్చుకొనంగ నమితతరంగముల్
పాలసంద్రంబునఁ బ్రజ్వరిల్లె
బండికండులు రెండు పండ్లిగిలించినఁ
గలువలు తామరల్ చెలిమి చేసె
వాజులఁ గొనివచ్చి వర రథంబునఁ బూన్పఁ
జిచ్చుకు నాకలి చిచ్చు వుట్టె

గీ. నారి సంధింప కశ్యపునారి వడకెఁ
గోల సంధింప లచ్చికి గోల వుట్టె
విల్లు తెగ బాపి పురములు ద్రెళ్ళ నేసి
తరిది విలుకాఁడ వౌదువు శరభలింగ!

త్రిపురాసురసంహార మింత భావధ్వనివైభవముతో వర్ణించిన వేఱొక కవి లేడు.

## రంగనాథుఁడు (407-409)

ఈతని పద్యములు మూ డుదాహరింపబడినవి. ఈతడు పాల్కురికి సోమనాథుని సమకాలికుడైన చక్రపాణి రంగనాథుడు - ఈతనిగూర్చి తొలుత తెలిపినవారు ప్రభాకరశాస్త్రిగారే. (చూడుడు బసవపురాణము ప్రథమముద్రణము (1926), పీఠిక పుటలు 23-26.)

ఈతడు శ్రీగిరినాథ విక్రమము అను 700 సీసపద్యములుగల గ్రంథము రచించెను. ఈతని చరిత్రము కన్నడ కవిచరిత్రలో గలదు. అందాతడు పెక్కు శతకములను దండకములను తోటకవృత్తములను, రగడలను రచించినట్లు గలదు. ఇందు దుదాహరింపబడిన పద్యము-

"గిరిజాధినాయకా" అను

మకుటముగలది. ఆ పేరుగల శతకములోనిది కావచ్చును-ఇట్లే ఈతని చంద్రాభరణశతకమునుండి యొక పద్యము లాక్షణికు లుదాహరించిరి. ఈతని రగడలను రెండింటిని-నయన రగడ-నమశ్శివాయ రగడ అను వానిని శాస్త్రిగారే గుర్తించిరి-ఆరెండింటిని వారు "రంగనాథుని శివకవిత్వము" అను వ్యాసమున ప్రకటించిరి. అది శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాసంస్థపత్రిక యందు ప్రకటితమైనది. (1951)

## తిక్కన-ఎఱ్ఱన యుగము (1250—1400)

### తిక్కన

తిక్కన విజయసేనమునుండి యిందు పద్యము లుదాహరింపబడినవి. (151 - 160)

151వ పద్యము "ఉత్సాహప్రభుమంత్రశక్తులు" అనునది- నీతిభూషణములోని పద్యము-సకలనీతిసమ్మతము (150 పద్యము)

సీ. అరిమానసంబులు

ఉ. అల్లనఁ దొండ మెత్తి

క. కిసలయకదళీ

చ. కొనియెద మన్న

శా. గీర్వాణాచల
క. పరధన పరాంగనాజన
సీ. మదనవశీకార మంత్రదేవత
గీ. మహిమ చెడదు స్వామ్యమాత్య.

గ్రంథాంతమున :

సీ. పద్మంబులును
చ. తరుణుల వీగు చన్నుగవ.

పై పద్యములుగాక – మానవల్లి కవిగారు కుమారసంభవమున లఘుటీకలో నీ క్రిందివానిని నుదాహరించినారు.

ఉ. పల్లవ పుష్పసంపదలఁబంచి వసంతుఁడు కావురాకకై
యెల్లవనంబుసంకటములేఁదగఁదారొడికంబుమీఱ న
ట్టల్లనగ్రోలిక్రోలి మలయానిలు డందు పురాణపత్రముల్
దుల్లఁగఁజేసె సత్రిక్రియఁ బటుత్వము రాముఁడు పిచ్చలింపగన్

## సోమయాజివిజయసేనము

సీ కలయంగధారుణీతలమగ్నిత ప్తమై
యుప్పరిపెనమట్టు లుబ్బియుండుఁ
గులపర్వతంబులు కొలిమిలోఁగ్రాఁగిన
యినుపముద్దలక్రియ నెసఁగియుండు
(మానవల్లికవి రచనలు పీఠికలు పుట 22)

ఆంధ్రకవితరంగిణియందు – 3 వసంపుటమున తిక్కన చరిత్రయందు పై పదకొండు పద్యము లుదాహరింపబడినవి కాని నేను పైని చూపిన పద్యము సీసపద్యపాదము అందు చూపబడలేదు–

## అప్పకవీయమున విజయసేనమునందు

వల్లభుఁడేగు దుర్లభుఁడు వానిదెసం దగులూది యిమ్మెయిన్
దల్లడమందెదేల యుచితస్థితికి న్ననుఁబాపఁజూపినన్
దల్లియు బంధులోకమును దండ్రియునేమను వారెఱింగిరే
నుల్లమనీకు నిట్లు తగునో తగదో పరికించి చూడుమా. (3–253)

అని ప్లుతయతికి నుదాహరణముగా నీయబడినది. దీనినే కస్తూరిరంగకవి ఆనందరంగరాట్ఛందస్సున గ్రహించినాడు (3—189)

ఇందువలన విజయసేనమునందలి పద్యములు 13 ను- ఒక సీసపద్యమున రెండు పాదములును లభించినవని గ్రహింపవలెను.

విజయసేనము - తిక్కనకృతిగా పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకర మున యుదాహరించినాడు -

ప్రబంధరత్నావళి చివర -

పెదపాటి జగన్నాథకవి మాత్రమే యుదాహరించిన కవులు కావ్యములు

ఆంధ్ర సాహిత్యపరిషద్గ్రంథసంధాత మాత్రమే యుదాహరించిన కవులు కావ్యములు.

ఇర్వురు నుదాహరించిన కవులు కావ్యములు - అను మూడు శీర్షికలలో కవి కావ్యవివరము లీయబడినవి.

ఇందు మూడవ శీర్షికలో -

"8 తిక్కన-విజయసేనము 158-157. ఆం. 152, 154, 155-160" అని స్పష్టముగా దెలుపబడినది కావున క్రీ.శ. 1560 నాటికది తిక్కన కృతియే యని సంకలనగ్రంథకర్తలు నిశ్చయించినట్లు తెలియగలదు.

(పుట 188)

విజయసేనమునందలి -

"తరుణుల వీపుచన్నుగవ తాకున" అను ప్రబంధ రత్నావళిలోని పద్యము- తిక్కన నిర్వచనోత్తర రామాయణము 1-51 లో నున్నది.

తిక్కన తన గ్రంథములలో నొక కృతిలోనివి మఱియొక కృతిలో గ్రహించు సంప్రదాయము గలవాడు. నిర్వచనోత్తర రామాయణ పద్యములను భారతమున గ్రహించినాడు. అట్లే తన విజయసేనమునందలి పద్యమును నిర్వచనోత్తర రామాయణమున గ్రహించినాడు. ఇందువలన -

"ఈ లాక్షణిక గ్రంథ ప్రామాణ్యము ననుసరించి విజయసేనమును తిక్కనగారే వ్రాసినారనుట కవకాశము కనిపించుటలేదు" అను వాక్యము

పరాస్తమగుచున్నది. ( డాక్టరు కేతవరపు రామకోటిశాస్త్రి. తిక్కన కావ్య శిల్పము. (పుట 3). )

తిక్కన విజయసేనములోని-

"మదనవశీకార మంత్రదేవత దృష్టి
గోచరమూర్తి గై కొనియె నొక్కొ"

అను పద్యపాదమును నూతనకవి సూరన తన ధనాభిరామమున నిట్లనుకరించినాడు-

"మదనవశీకార మంత్రరూపములోన
మెలగెడు తొలుకారు మెఱుపులనఁగ" (2-24)

దీనినిబట్టి విజయసేనము ప్రచారములోనున్నదని చెప్పవచ్చును.

ప్రబంధమణిభూషణమున (క్రీ. శ. 17 వ శతాబ్ది)గల విజయసేనము నందలి పద్యములు ఇవి యీ గ్రంథమున లేవు.

సీ. అమ్మెద ననినఁ బద్మాక్షుఁ గౌస్తుభమైన వెలవక కొనియెడు వెరవుగలిగి
విలువయిచ్చెదమని వేఁడినఁ బలిజున్నుఁ గమ్మపసిండియు నమ్మగలిగి
ఏ వస్తువైన ప్రౌద్దెందఱు జనుదెంచి యెంతటి కడిగిన నెదురుగలిగి
తనయింటలేని యర్థము లర్థపతియింట నైన వెదకిన లేవనుటగలిగి

గీ. తమ కులాచారచారు వర్తనము కొఱకు
నంగడుల యొప్పునకును బేహారమాట
గాని లాభంబునకు నాటగాదనంగ
వరలుదురు పురవరంబున వైశ్యవరులు.

## ఏనుగులు

100 సీ. ఉన్నచో గతిమాలి యునికి యిష్టంబని గ్రుమ్మఱనేర్చిన కొండలనఁగ
గాలిచేఁ దూలెడు కష్టంబు వోవఁగ ఘనమైన నీలమేఘంబు లనఁగ
వినురూపమై యున్కి వెల్లదనంబని కడు నల్లనైన దిగ్గజములనఁగ
తిమిరారి యట యని ద్యుమణితో మార్కొని నిలిచిన యిరుల
మస్నీలనంగ

ఆ. వె దానవారిసాభిదమ్ము మై వీథుల
నేఱులట్లపొంగి పాఱుచుండఁ
బవసిఁ బోయివచ్చు ప్రథమకేళీ జయ
సారణములు పురము వారణములు.

## మలయానిలము

144. సీ. ఘనసారకస్తూరికాగంధములనన్య గంధబంధంబుల గలపి గలపి
కుసుమితవల్లికాలసిత వీథులఁజొచ్చి
చనిసరోగృహములమునిఁగి మునిఁగి
సమధికాహార్యాంగ సంగీతములతోడ కన్నెతీగల కాట గఱపి గఱపి
కుముదకుట్మలకుటీకోరకంబులుదూఱి
యలిదంపతుల నిద్ర తెలిపి తెలిపి

ఆ. వె. అనుదినంబునప్పురాంతికమ్మనగట్టి
వాలువోలె విప్రవరుఁడు వోలె
నట్టువొజ్జవోలె నచ్చిన చెలివోలె
మలయుచుండు మందమారుతంబు.

పైవివరణవలన తిక్కన విజయసేనములో 16 పద్యములు. ఒక సీస పద్యమున రెండు పాదములు దొరికినవని గ్రహింపవలెను.

## కే త న

ఇతఁడు తిక్కన పెదతండ్రి. ఈతఁడు కాదంబరిని పద్యకావ్యముగా వ్రాసెను. అందుండి రెండుపద్యము లుదాహృతములైనవి. (96-97). ఒకటి శార్దూలము ; రెండవది సీసము.

కేతన కాదంబరినుండి మఱి రెండు పద్యములను కవిగా రుదాహరించినారు.

## వేసవివర్ణన

సీ. కడువేడి పెల్లెండ పుడమిపేల్చిన ప్రౌద్దు లాకాశగతియ మేలని తలంప
వాత్యాభిహతిలగ్గవాడి వియచ్చరు లవనిపై జనుటమేలని తలంప
వడవడగా నీళు ఁఁడికిన జలచరుల్ వనచరవృత్తిమేలని తలంప
వనముల గార్చిచ్చు దనరిన వనచరు లంబు సంచరణమేలని తలంప

ఆ.వె. వాఁడి యెండ గాసె వడగొనె సురగాడ్పు
లెసగి వడయగాలి నెగడి వీచె
దావవహనమడరె జీవుల కధిక సం
తాపకారి యగునిదాఘవేళ

## కవి స్తుతి

సీ. ఆనక యమృతంబు దానిట్టి చవియని జనులకేర్పఱుపగా జాలువారు
చూడక మన్మథు సుందరాకారంబు గరిమ చూపగ జాలుకడకవారు
వినక యిపరతత్త్వ విపుల నినాదంబు వినిపింప జాలెడు వెరవువారు
అంటక మెఱుగులయందంబు వ్రేగును గణుతింపజాలు ప్రఖ్యాతివారు

గీ. కంపుగొనకయ కల్పవృక్షముల పుష్ప
సౌరభంబిట్టిదని చెప్పఁ జాలువారు
ఎందుజూచినధాత్రిలో హృదయదృష్టి
కవులుగానని మర్మంబుగలదె జగతి.

కేతన కాదంబరినుండి మఱియొక సీసపద్యము మూడు పాదములు మాత్రమే కవిగా రుదహరించినారు.

సీ. దీనిలోపల గొన్ని దినములూనిన నుష్ణకరుఁడైన నటు శీతకరుఁడుగాడె
దీని లోఁతెఱిఁగిన దానంబురాశిలోఁ గాదని జలశాయి కాపురాఁడె
దీని తియ్యనినీరు దివిజులు త్రావిన దమ యమృతంబుచేఁ డనుచుననరె

## అన్నయ (షోడశకుమార చరిత్ర)

వెన్నెలకంటి అన్నయకృతమగు షోడశకుమారచరిత్రయం దుదాహరింపబడినది. (చూడుడు పుట 753)

## అన్నదానమహాత్త్వము 514-515

గీ ఆదిమూర్తి మహాలక్ష్మి యప్పురంబు
సొచ్చి నిల్చిన వారాశి చూడవచ్చి
కోటసౌరరాక కూతుపైఁగూర్మిఁ జుట్టు
పారియున్నటు లొప్పారి పరిఖమెఱయు.

గీ. మహిత సన్మార్గవర్తనమాన్యులనఁగ
బొలుచు నినరాజగురుకవి బుధులనైనఁ
దగులఁబడఁజేయుఁ బెంపునఁ దనరు వీటి
కొమ్మలకు సాటియై కోటకొమ్మలమరు.

షోడశకుమార చరిత్ర- ఆంధ్రసాహిత్య పరిషన్ముద్రితము 1934

గీ ఆది.........ప్పురమునఁ
గాపురంబుండగాఁ జూడఁగడలివచ్చి
కోట సొరరాక కూతుపై కూర్మిఁ జుట్టు
పారియున్నట్టు లొప్పార పరిఖ మెఱయు

పరిషత్తుకు దొరకిన తాళపత్రప్రతిలో మొదటిపాదసుమధ్య లోపించినది. అది

''ఆదిమూర్తి మహాలక్ష్మి యప్పురఁబు" అని యీ గ్రంథమునుబట్టి పూరింపవచ్చును.

రెండవ పాదమున పాఠభేదమున్నది
"కాపురంబుండఁగాఁజూడఁగడలి"-ముద్రితప్రతి
సొచ్చినిల్చిన వారాశిచూడ-ప్ర ర. పాఠము

మహిత సన్మార్గవర్తనమాన్య లనఁగఁ
బొలుచు నినరాజకవిగురుబుధుల నైనఁ
దగులువడఁ జేయు పెంపునఁదనరు వీటి
కోట కొమ్మలు తారకాస్ఫోటనములు 4 ప

కొమ్మలకు సాటియై కొటకోమ్మలమరు ప్ర ర. పాఠము

## శివదేవయ్య (పురుషార్థసారము)

జైతరాజు ముమ్మయ విష్ణుకథా విధానములోనిదిగా

సీ. ఊకరల్ గొట్టక యుబ్బసంబందక
వెఱవక దేహంబు విఱుచుకొనక

ఈ పద్యమునందచ్చట చుక్కలున్నవి-
అసలుపద్యమిది

సీ. ఊరక మురియక యుబ్బుసంబందక వెఱవక దేహంబు విఱిచికొనక
నిడుసునఁబెట్టక ని ప్పోటమునఁబోక తరవాయి దప్పక తడవికొనక
అక్షరస్పష్టతయన గీతనష్టత గాకుండ నర్థంబు గానఁబడఁగ
నయ్యైరసంబుల కనురూపముగఁ బెక్కు రాగముల్ ఫణితుల బాగుపుట్ట

గీ. చెఱకు కొననుండి నమలిన చెలువు దోప
నంతకంతకు వేడుక యతిశయిల్లఁ
జదువుచున్నారు వీరల చదువుబోల
జదువులేదని పొగడిరి సభికవరులు

సకలనీతి సమ్మతము, పురుషార్థసారము 308 ప.

## ఎఱ్ఱన

### నృసింహపురాణము.

గ్రంథనామము కర్తనామము తెలియరానివి -

1. 524 సీ. అఖిలలోకాధార...
సారమహనీయ — నృసింహపురాణము
మహిమకాధారమగుచు — 1-26.

2. 537. కడలుఁ జేతులార్చుచు ఫేనఘనతరాట్ట
హాసరుచితోఁ బ్రవాళజటాలివిచ్చి
... ... ...
... ... ... 1-34.

ఇందు రెండుపాదములులేవు. ఆ రెండుపాదములివి.
యౌర్వశిఖిఫాలలోచనంబనఁగ సింధు
వమరుఁ దాండవమాడెడు హరునివోలె

3. 540. మహాస్రగ్ధర.

కనిరుగ్రగ్రాహనక్రగ్రహణఘుమ ఘుమాకారకల్లోలడోలా — 3-3.
స్వనసప్రపట్యోత కేశిసరభసపణభృ చ్చారుజూటాగ్రజాగ్రత్
ఘనరత్నోద్దంచితోద్యత్కటుకుటిలమ యూఖచ్ఛటా టోపమిథ్యా
జనితౌర్వారంభ శుంభత్సలిలనివహని స్తంద్రురత్నాకరేంద్రున్.

ముద్రితపాఠము

1. క్రమణ
2. 'ప్రత్యూష' అయియుండును
3. కట-

4. 557. సీ. తిమిర భూతముసోఁకుఁదెలియ
... ... ... ...
చంద్రుఁడుదయించెఁ గాంతి నిస్తంద్రుఁడగుచు 3-84

5. 577. ఉ. రాజితతేజుఁడైన దినరాజు. 3-81.

ఈ పద్యములను గ్రంథములో జేర్చుకొనుడు.

6. గీ. పొదలియొండొంట దివియును భువియుదెసలు
బొదివికొనియెడిచీకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁగాటుక గ్రుక్కినట్టి
కరవటంబనజగదండఖండమమరు 3-80.

## చెన్నమల్లు శ్రీగిరన్న

ఈతని శ్రీరంగమహాత్మ్యమునుండి నాలుగు పద్యము లుదాహృతము లైనవి.

ఈ శ్రీ గిరన్నకవి-ప్రోలయవేముని మోగల్లు శాసనము (క్రీ. శ. 1315)న పేర్కొనబడిన "ప్రమథకవి శ్రీగిరి" అని వాఙ్మయచరిత్రకారుల యభిప్రాయము. ఈతడు శ్రీరంగమాహాత్మ్యమే గాక "నవనాథచరిత్ర" అను పద్య కావ్యమును రచించినట్లును, దానిని తాను ద్విపదగా చేసినట్లును గౌరన తన నవ నాథ చరిత్రలో తెలిపినాడు-మడికి సింగన సకలనీతి సమ్మతమున నుదాహరించిన శ్రీగిరీశ శతకము (చిరతరప్రకాశ - శ్రీగిరీశ - అనుమకుటము) శ్రీగిరిదే నని కొందరి యభిప్రాయము.

ఈతడు శైవుడగుట స్పష్టము. అయితే శైవుడు వైష్ణవ క్షేత్రమై, వైష్ణవమత సంబంధమైన శ్రీరంగమాహాత్మ్యము వ్రాయునా అని మనకు సందేహము కలుగవచ్చును కాని అట్టి సందేహమున కవకాశము లేదు-శైవుడనని స్పష్టముగా చెప్పుకొన్న పోతన, వైష్ణవ గ్రంథమగు భాగవతమును రచించెను.

పోతనకు ముందే శంభుదాసుడగు ఎఱ్ఱన రామాయణ హరివంశములను వైష్ణవ సంబంధగ్రంథములు రచించెను.

## నాచన సోమన

సోముని యుత్తరహరివంశమునుండి ఒక పద్యమిందుదాహృతమైనది-

386 జయనారాయణ పుండరీకనయనా శార్ఙ్గీ జగన్నాయకా
జయపీతాంబర భక్తవత్సల విరించ స్తోత్రపాత్రక్రియా
జయ జంభారి విరోధి విక్రమకళాశ్లాఘావిఘాతక్రియా
జయ గోవింద ముకుంద మంధరధరా శౌరీ మురారీ హరీ-

ఇది జైతరాజు ముమ్మయ విష్ణుకథానిధానములోనిదిగా నున్నది. కాని ఉత్తర హరివంశమున (6-2) నిది గలదు-

## చిమ్మపూడి అమరేశ్వరుడు

ఈతని కృతియగు విక్రమసేనమునుండి (10-63) 53 పద్యము లుదాహరింపబడినవి- ఈ సంకలన గ్రంథమున-పెమ్మన అనిరుద్ధచరిత్రనుండి 63 పద్యములు గ్రహింపబడినవి కనుక పద్యగ్రహణమున నిది రెండవది. అమరేశ్వరుడను కవియున్నట్లు లక్షణగ్రంథమూలమున మనకు తెలిసినను, అతని పూర్వకవులు చాలగా ప్రశంసించినను, ఆతని కవితా వైశిష్ట్యమును తొలుత లోకమున కెఱుకపఱచినది ప్రభాకర శాస్త్రిగారే-ప్రబంధ రత్నావళిలో నుదాహరింపబడిన 53 పద్యములలో నాలుగుపద్యము లమరేశ్వరునికావు. కాబట్టి యందున్నవి 49 పద్యములని మనము గ్రహింపవలెను.

క్రీ. శ. 1656 సంవత్సరముననున్న అప్పకవి సమకాలికుడగు అహోబలపతి తన అహోబలపండితీయమున అమరేశ్వరుని విక్రమసేనమునుండి యొక పద్యపాద మదాహరించినాడు.

అజంతపరిచ్ఛేదము- "అర్థవిశేషమున సమహత్తులకు మహదాకారము వచ్చును" అను అథర్వణకారిక నుదాహరించుచు-

"మాకెల్లం గలహాలంబుకూడ దిక నీ మర్యాద జెల్లింపవే"

అని యమరేశ్వరుని ప్రయోగము. (ఇందు మాకనుచోట బహువచనము.
(పుట 362)

క్రీ. శ. 1740లో కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసారసంగ్రహ మున విక్రమసేనమునుండి యీ క్రింది పద్యము నుదాహరించినాడు-

ఆ. వె. నీరసగ్నియునికి మారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కదలి యప్పు
రంబు జొచ్చెనొక్కొ రత్నాకరము మణు
లనగ జెలువమమరు నాపణములు.

ఇందువలన 1740 ప్రాంతమున నీ కావ్యము ప్రచారమున నుండెను.

క్రీ. శ 1908తో కవిగారు తమ కుమారసంభవ లఘుటీకలో విక్రమ సేనమునుండి పద్యములుదాహరించుటచేత నిది యీ శతాబ్దిలోగూడ పరిశోధకు లకు పరిచితమని తెలియవలెను.

విక్రమసేనమున ప్రబంధరత్నావళిలో లేని పద్యములు-

ప్రబంధమణిభూషణము నుండి.

137. మ. శరధిప్రఖ్యము వేదమూర్తులు కుభృత్సంకాశముల్ మారుతో
ద్ధురవేగంబులు కిన్నరేశధను లుద్ధూతారు లభ్రంకష
స్ఫురణౌన్నత్యము లభ్రగేహసిభముల్ పుణ్యాస్త్రముల్ తత్పురీ
పరిఖావిప్రగజాశ్వవైశ్యసుభట ప్రాకారసౌధోన్నతుల్.

147. సీ. వికచారవింద దీర్ఘికలలో విహరించి నలిఁగమ్మదావులననఁగి పెనఁగి
కుసుమితనవలతా విసరంబుగదలించి యలదేసియల సోననలము కొనుచు
సహకారపాదపచ్ఛాయలకై యేగి శశికాంతవేదులను చరించి
సురతకేళీశ్రాంతి సొగియు ముద్దియలపై చిట్టాడు తనువుల చెమటలార్చి

గీ. చంచరీకంబురీతి పర్జన్యుభాతి
విరహపరితాపహరుమాడ్కి సురటిరీతి
సప్పురంబున సకల జనానుమోద
కరణదక్షుడు దక్షిణగంధవహుఁడు.

492. గీ. రత్నసుందరి వక్రేంచు రమ్యలీలఁ
గాంచి విలసిల్లెనృప నేత్రకైరవములు
పొంగె రాగాంబుధులు నిట్టఁబుష్పధన్వు
నగ్గమగువారిచేష్టల నభినుతింతు.

493. క. కప్పురపుధూళి యొక్కఁడు
గుప్పం బ్రస్వేదమొడలఁగూడక యున్నన్
మెప్పువడఁగుండలద్వయి
నొప్పుగ పీడ్వడఁగఁదాల్చునొక్కొండొరిమన్.

494 క. మంచాంతరంబు దన పా
దాంచలమున మెట్టిగర్వహాస వికాసా
భ్యంచిత వదనుండై యా
డించున్ కరవాలమలపుడిగ్గం ద్రోచున్.

అమరేశ్వరుని విక్రమసేనమునపైపద్యములతో గలిపిన- (ప్రబంధరత్నావళి 49 + 5)- 54 పద్యములు మనకు లభించుచున్నవి.

ఇంకను అముద్రితమైన సంకలన గ్రంథముల యందెన్నియున్నవో తెలియరాదు

ఇందలి పద్యము (34) నన్నెచోడని పద్యమున కనుకరణము

శా. దానానేకపబృంహితస్వనము గంధర్వావళీహేషిత
ధ్వానంబున్ మృదువేదనాదమును గాంతానూపురారావమున్
గానాపూనరసంబుఁ దూర్యమహాశంఖస్ఫారరావంబు బె
ల్లైనీరాకరఘోషమోయనఁగ నిత్యంబుం జెలంగున్ బురిన్.

నన్నెచోడని పద్యము

మ. సమదానేకపబృంహితంబు హయహేషాఘోషముఁగా గీతనా
ద్యమృదుధ్వానము వేదరావము భటోద్దండోక్తులున్ భూరిపం
చమహాశబ్దరవంబుఁగూడి సుమహత్సంక్షోభితాంబోధినా
దమునాదిగ్బధిరీకృతంబగుచు నిత్యంబుం జెలంగుం బురిన్.

(కు. సం. 7 176)

35- విక్రమసేనము - ఈ సీసపద్యమున 3, 4 చరణములు ఎత్తుగీతి, ఎఱ్ఱన నృసింహపురాణములోని 3-84 పద్యముతో సరిపోవు చున్నది. ఈ పద్యము 557 గా అజ్ఞాతకర్తృత్వముగా నున్నది.

## శ్రీనాథయుగము (1400—1500)

### శ్రీ నాథుడు (వల్లభాభ్యుదయము)

శ్రీనాథుడు వల్లభాభ్యుదయము అను కృతిని రచించినట్లీ గ్రంథమూలము ననే లోకమునకు తెలిసినది (ప. 461). దీనిని గూర్చి ప్రభాకర శాస్త్రిగారు పీఠికలో చర్చించియున్నారు. (పుట. 25-26)

శ్రీనాథ కృతులనుండి యీక్రింది పద్యము లిందుగలవు.

| | | |
|---|---|---|
| 269. | భావన పెమ్మన అనిరుద్ధ చరిత్ర<br>వేలుపు గిడ్డియుం బరుసవేది | భీమేశ్వర పురాణము 2-14 |
| 272. | విష్ణుకథానిధానము<br>శా ఆడెందాండవమార్భటి | ,, 4-143 |
| 547. | క్షయకాలంబున | కాశీఖండము 5-83 |

### తాళ్లపాక అన్నమయ్య

అన్నమయ్య వేంకటేశ్వర శతకమునుండి యొక పద్య ము(7)దాహ రింపబడినది. ఈ శతకమునుగూర్చి కీ. శే. వంగూరు సుబ్బారావుగారు శతక కవుల చరిత్ర (1924) లో వ్రాసిరి. 1953 లో వావిళ్లవారు నా పీఠికతో గూడ దీనిని ముద్రించిరి.

### జైతరాజు ముమ్మయ్య

ఈతని విష్ణుకథానిధానము నుండి 42 పద్యము లు (364-406) దాహ రింపబడినవి. ఇందు ఆఱు పద్యము లీతనివిగావు. కావున యిందున్న పద్య ములు-36. ఇది ప్రశస్తకావ్యము కావుననే యిన్ని పద్యము లుదాహరింపబడినవి.

ముమ్మకవి శ్రీనాథుని సమకాలికుడు. శ్రీనాథుడు ప్రౌఢ దేవరాయని ఆస్థానమునకు వెడలినప్పుడు తొలుత ఆస్థానమున నున్న ముమ్మకవిని దర్శించి యిట్లు చెప్పినాడు.

సీ. పంపా విరూపాక్ష బహు జటాజూటికా రగ్వధప్రసవసౌరభ్యములకు
తుంగాభద్రాసముత్తుంగ వీచీఘటా గంభీరఘుమఘుమారంభములకు
కళసాపుర ప్రాంతక దళవనాంతర ద్రాక్షాలతా ఫల స్తబకములకు
కర్ణాట కామినీ కర్ణహాటకరత్న తాటంక యుగధాళధళ్యములకు

గీ. నిర్ణిబంధ నిబంధమైనెనయుకవిత
తెలుగునను సంస్కృతంబున బలుకనేర్తు
ప్రౌఢదేవేంద్రరాయ భూపాలవరుని
సమ్ముఖమున దయజూడు ముమ్మసుకవి. (చాటుపద్య మణిమంజరి,
ఈముమ్మకవియే-జైతరాజు ముమ్మయ 2భా. పుట 23)

## మడికి సింగన

మడికి సింగన పేరిందులేదు. కాని యాతని పద్మపురాణము నుండి రెండు పద్యము లుదాహరింపబడినవి.

ప. 532, శా ఆరాజాస్యలు-గాంచి రయ్యోడ- పద్మపురాణము 3-110

ప. 562. చ. పరమ వివేకసాగరుడు ,, 4-188

## ప్రౌఢకవి మల్లన

ఈతని పేరిందులేదు కాని యీతని రుక్మంగద చరిత్రము నుండి యొక పద్య ముదాహరింవబడినది.

ప. 586. వెలువెలబాఱెఁ దూర్పు - రుక్మాంగదచరిత్ర 3-187.

## పోతన

పోతనపేరిందులేదు కాని యాతని భాగవతము దశమ స్కంధము నుండి 4 పద్యములున్నవి.

| | | |
|---|---|---|
| ప. 30. తరుణుండగుశీతల కరు | భాగవతము దశ. | 1238 |
| 53. భూమినిండె మిగుల | ,, | 1291 |
| 244. ధన్యవిభూతి | ,, | 1276 |
| 580. విటసేన | ,, | 965 |

## కుంటముక్కల తిమ్మయ
## శైవాచార సంగ్రహము

ఈతని గ్రంథమునుండి ఒక పద్య ముదాహరింపబడినది. అది 167 పద్యము విభూతి వర్ణన — ఈ గ్రంథము ముద్రితమైనది (మదరాసు ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారము వారు 1951లో ప్రకటించిరి) ఇందు 167 పద్యము ''కపిలవర్ణము గోవు" అనునది. 1-26 పద్యముగా నున్నది.

## నూతన కవి సూరన్న
## ధనాభిరామము

ఇందుండి ఒక పద్య ముదాహరింపబడినది.

482. "ఇరువది యాఱు పీక్షణము లెన్నగ" ఈ కావ్యము వావిళ్లవారిచే క్రీ. శ. 1950లో ప్రకటితము. అందు 482 పద్యము 2ఆ. 45 పద్యముగా నున్నది.

ఈకావ్యము తెలుగు విమర్శకులు చదివినట్లు కానరాదు. సాంఘికేతివృత్తమునకు సంబంధించినది. రూపము ధనము వీని రెండింటిలో నేది గొప్పది అని మన్మథుడును కుబేరుడును వాదించుకొని, ఒకరునొకరు గెలువ లేక పోయిరి. అప్పుడు శివుడు ప్రత్యక్షమై రెండును మానవ జీవితమున కావశ్యకములే యని వెల్లడించును. కథ దాక్షారామమునకు సంబంధించినది.

## అన్నయ – సాముద్రికము

ఈ గ్రంథమున 143-144 పద్యము లిట్లున్నవి
చౌడయ్య గంగరాజు సాముద్రిక శాస్త్రము

క. ఉదరంబు దర్దురోదర
సదృశంబై జఘనమతి విశాలంబైనన్
సుదతీరత్నంబున క
భ్యుదయంబుగ ధరణి యేలు పుత్రుఁడు పుట్టున్. 143

క. కడునిడుదయుఁ గడుకుఱుచయుఁ
గడువలుదయుఁ గడుకృశంబుఁ గడునల్లనిదిన్
గడు నెఱ్ఱని దగు మెయిగల
పడతింగీడనిరి మునులు వరమునిచరితా . 144

ఈ రెండు పద్యములు అన్నయ సాముద్రికము లోనివి (చూడుడు. ముద్రితప్రతి వావిళ్ల 1951 )

ఈ అన్నయ సాముద్రికము నుండి శ్రీనాథుడు కాశీ ఖండమున పద్యము లను గ్రహించినాడు. (423-33)
చూ. సాహితి - శొక్కనాథయ్య - (శివసుందరేశ్వరరావు వ్యాసము - 1955)

## కృష్ణరాయ యుగము

### హరిభట్టు

ఈతని యుత్తర నారసింహ పురాణమునుండి యొక పద్యము (513) దాహరింపబడినది. ఈ కావ్యము నాంధ్ర సాహిత్యపరిషత్తువారు - 1925 లో ముద్రించిరి అందు పై పద్యము 1-227 లో నున్నది.

### ఎడపాటి ఎఱ్ఱన

కుమారనైషధము మల్హణచరిత్ర - అను రెండు కృతు లీతనివిందుదా హృతములైనవి.

కుమారనైషధము - అను కృతి ఎడపాటి ఎఱ్ఱన వ్రాసినట్లుగా నీ ప్రబంధ రత్నావళి నుండియే తొలుత లోకమునకు తెలిసినది ఇందుండి (72-89) 17 పద్యములు గలవు. శ్రీనాథుని నైషధచ్ఛాయ లిందుగలవు

"నైషధమందలిదిగా నీ పద్యము నాం. సా. గ్రంథసంధాత యుదాహ రించినాడు నైషధమున గానరాదు "

సీ. మించికన్నులఁ గోరగించు రాజాన్నంబు లొలుపయించుకలేని యొలుపుబప్పు
నభినవసంతప్తమై యంగలీనంబుఁ బరువంపు రుచినొప్పు పాయసములు
నేతను మిరియాల నెనసిన కూరలు ఖండశర్కరతోడ పిండివంట
గ్రొజ్జుగా గాచిన గోక్షీరపూరంబు పనస రంభాచూతఫలచయంబు

గీ. ద్రాక్షపండులు ఖర్జూర మాక్షికములు
బహు సుగంధిరసావళుల్ పానకములు
పెక్కువిధముల పచ్చళ్లు పెరుగు మజ్జి
గలును వడ్డించిరెంతయుఁ గ్రమముతోడ. (పుట 182-83)

శ్రీనాథుని శృంగారనైషధమున నీ సందర్భమున నిట్టి పద్యము లేదు. అందాఱవ యాశ్వాసమున భోజన వర్ణనమున నీ క్రింది పద్యములు గలవు. (119-125 మొదళ్ళు)

6 - 120 సీ. గోధూమ సేవికానుచ్ఛంబు లల్లార్చి ఖండశర్కరలతో గలిపిగలిపి
121 చ తరుణులు చంచలాలతలు
122 గీ. పచ్చరామానికంబులఁ బళ్ళెరముల
123 క. ఇరుదుగనపుడొక్కొక్క యెడ
124 సీ. అమృత రసోపమంబైన కమ్మనియాన
125 ఉ. ఆదరణంబుతో నభినవోజ్య

వీనిని బట్టి నైషధమున అనునది శ్రీనాథ నైషధమున లేక పోవుటచేత ఎడపాటి యెట్టిన కుమార నైషధములోని దనియే మనము గ్రహింపవచ్చును.

ఈ "మించి కన్నులఁగోరగించు'' అన్న పద్యము కొలది మార్పులతో జక్కన విక్రమార్క చరిత్ర 4-188లో నున్నది.

ఇట్టిదే యింకొకటి
ఇందు 553 పద్యము.

ఉ చుక్కల నెయ్యపుందగవు సూచిన యామిని కూర్మి చూచినన్
జక్కప నాథుదీనతకు జాలక మున్కడునస్తమించె య
మ్మక్క ఏలా విశేషము గదా శశి యశ్రము సీలరోచిగా
దొక్క కలంక నొల్లనని యోర్చెదదీయ వియోగ దుఃఖమున్

శృంగార నైషధమున 8వ ఆశ్వాసమున 656 పుటలో నీపద్యముదాహరింప బడినది. సంస్కృత మూలమునకు సరియైన పద్యము - "తటుకున నస్తమించె" అను దాని తరువాత-

చుక్కల నెయ్యపుందగవు సూచిన అను పద్యము ముద్రింపబడినది దీనికి ముందు

'' ఒక వ్రాత ప్రతిలో దీనికి పద్యాంతరము" అని వ్రాయబడినది. ఇందు వలన శృంగార నైషధ వ్రాత ప్రతులలో నిదిలేదని యర్థము మూలమునకు

సరిగా పద్యమున్నప్పుడు తిరిగి యదేయర్థముగల పద్యము శ్రీనాథుడు వ్రాయడు. కావున నిదియును కుమార నైషధము నందలిదే యనిగ్రహింపవలెను.

ఇందు వలన కుమారనైషధమున పద్యములు 19.

## మల్హాణ చరిత్ర

కుమార నైషధమునుండి 19 పద్యములను గ్రహించిన జగ్గన-మల్హాణ చరిత్రనుండి మూడు పద్యములను మాత్రమే యుదాహరించుటచేత ఎట్టిన కుమార నైషధము మంచి రచనగల గ్రంథమని మనమంగీకరింపవచ్చును. మల్హాణ చరిత్రపద్యములు (90-92). ఇది రెండు పరియాయములు ముద్రితమైనది.

1930 శృంగార గ్రంథమాల మదరాసు.
1940 శృంగార కావ్య గ్రంథమండలి బందరు.
ఇందలి పద్యము,

క. కురువింద వజ్రమయ గో
పుర కాంతులవలనఁ బ్రొద్దుపోకలు రాకల్
పరికింప నరిదియయ్యెను
సరసిజ కైరవ వికాససంపద తెలియన్ (1-12)

అనునది కుమారనైషధమునగలదు-79 పద్యము.

ఇందుదాహరింపబడినవానికి ముద్రణ ప్రతి సంఖ్యలు.

| | | | |
|---|---|---|---|
| 90 సీ. కువలయ కమలాభినవ | ... | ... | 1-33 |
| 91 చ. గములగు పద్మరాగము | ... | ... | 1-35 |
| 92 సీ. పగడపుఁ గంబాల | | | |

పెదపాటి సోమయ అరుణాచలపురాణములో నీ క్రింది పద్యము గలదు. (488)

సీ. అంగయుక్తంబుగా నామ్నాయములు నాల్గు చదువంగనేరని సద్విజాతి
బ్రహ్మపాద్మాది పురాణాగమేతిహాసము లెఱుంగని బ్రహ్మసంభవుండు
భాట్టవైశేషిక ప్రాభాకరాది శాస్త్రములాఱు చూడని ధరణిసురుడు
స్వకులోచితములైన సప్తతంతువులెల్లఁ బారమెయ్యింపని బాడబుండు

గీ. కావ్యనాటకలసదలంకారముఖ్య
విద్యలన్నియు నెఱుఁగని విప్రవరుడు
పంచయజ్ఞములును లేని బ్రాహ్మణుండు
వెదకిచూచిన బొడమండు వీటిలోన.

ఈ పద్యమే కొలది మార్పుతో మల్హణ చరిత్రలో నిట్లున్నది.

సీ. అంగయుక్తంబుగా నామ్నాయములు రెండు బల్లిపాఠంబుగాఁ బరిచయించె
బ్రహ్మాండ శైవాది బహుపురాణంబులు కరతలామలకంబుగా నెఱింగె
భాట్ట వైశేషిక ప్రముఖ శాస్త్రంబులు నవగతంబులుగాగ నభ్యసించె
శుకుల వ్యాసాది దేశికుల తత్త్వార్థముల్ శోధించె నామూలచూడముగను
గీ వాదవహ్నిజలస్తంభవాదులరసి
నంజనాకర్షణక్రియ లలమిఁ గనియె
సరస సంగీత సాహిత్య సరణి దెలిసె
నఖిల విద్యావిశారదుండయ్యె నంత. (1-6)

## తెనాలి రామలింగయ్య

ఈతని కందర్పకేతు విలాసమునుండి నాలుగు పద్యము లుదాహరింపబడినవి (425-428).

ఈ కందర్పకేతు విలాసమునుండి యొక పద్యము కవిగారిట్లుహదారించినారు.

"లలితాస్యాంబురుహంబు నీలకచరోలంబంబు నేత్రాసితో
త్పలముచ్చైస్స్తనకోకమోష్ఠ విలసద్బంధూకముద్యత్కటీ
పులినం బుద్ధతచిత్తజాతరసవాఃపూరంబు ప్రాణేశ్వరీ
జలజావాసముఁజొచ్చియాడక మనోజాతానలంబారునే."

(కుమారసంభవము ప్రథమ భాగము పుట 107)

## తెనాలి రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యము

తెనాలి రామలింగకవి హరి లీలావిలాసములోనిదిగా నీ క్రింది పద్యముదాహరింపబడినది.

చ. తెలతెలవాఱ నొయ్యనరుదెంచు నిశాంత రతాంతతాంతలౌ
చెలువలకింపుగా మెలఁగుఁజెక్కుల(గూరిన చూర్ణకుంతలా
వళిసరసంబుగా జడియువాలిన సెజ్జలమీది ప్రావిరుల్
దొలఁగఁగఁజేయు నూడిగపు తొయ్యలులంబలె
వేగుదెమ్మెరల్ (437)

ఈ పద్యము పాండురంగ మాహాత్మ్యములోనిది 1-119.

తెనాలి రామలింగకవి -ఉద్భటారాధ్య చరిత్ర-

కాకమాని గంగాధరుడు బాలభారతము (132)

శా. సంసారార్ణవ పారగున్ పరమహంసవ్రాత చూడా పదో
త్తంసంబున్ శ్రుతి సంకరోద్ధళన పాథఃక్షీర భేదక్రియా
హంసంబున్ జగదేకవంద్యు జలదశ్యామున్ మహాపాతక
ధ్వంసాభారతు భారతామృతనిధిన్ వ్యాసున్ బ్రశంసించెదన్.

ఈ పద్యము రామలింగకవి ఉద్భటారాధ్య చరిత్రమునగల యీ క్రింది పద్యము ననుసరించినది.

శా. సంసారాహ్వయాసింధు పోతము జగత్సంబోధ దీపాంకురున్
కంసారాతి పదాబ్జబంభరము సాక్షాత్పద్మ గర్భున్ బుధో
త్తంసంబున్ శ్రుతి సంకరోద్ధళనపాథః క్షీరభేదక్రియా
హంసంబున్ బరిశీలిత స్మృతిరసున్ వ్యాసుంబ్రశంసించెదన్ (1-9)

నందితిమ్మన (పారిజాతాపహరణము)

గ్రంథనామము కర్తనామము తెలియరానిది

గీ. అమరులమృతాబ్ధిలో పలి యమృతరసము
నిండి చేరులపటికంపుఁ గుండగట్టి
చేఁదుకొనియెదరో నాగ శీతరోచి
మెల్ల మెల్లన రుచులతో మిన్నుప్రాఁకె.

ఇది తిమ్మన పారిజాతాపహరణము 2-39 వ పద్యము.

ఆంధ్ర వాఙ్మయచరిత్రకారుల కత్యంతోపయుక్తమైన యీ గ్రంథమును పునర్ముద్రణము చేసినందులకు డాక్టరు వేటూరి ఆనందమూర్తిగారిని యత్యంతము నభినందించుచున్నాను.

ప్రభాకరశాస్త్రిగారి గ్రంథముల నన్నింటిని పునర్ముద్రించుటకు వారు చేసిన ప్రణాళిక పూర్తియై ఆంధ్ర సాహిత్యవీథి నలంకరించుగాత.

మానవల్లి కవిగారి సంకలన గ్రంథములు - ప్రబంధమణిభూషణము, సకలనీతిసమ్మతముతోపాటు నీ ప్రబంధరత్నావళికి పీఠిక వ్రాయు నవకాశము నా కొసగిన-డాక్టరు ఆనందమూర్తిగారికి - ఈ పీఠికారచనమున నాకు చేదోడు వాదోడుగానున్న నా పెద్దకుమారుడు చి॥ శివసుందరేశ్వరరావునకు నా యాశీస్సులు.

ఇతి శివమ్

13-5-76
2-2-1137/5
లక్ష్మీకాంతనిలయము
హైదరాబాదు - 44.

నిడుదవోలు వేంకటరావు

## ప్రబంధరత్నావళి

పద్యములు – ఇతర కవి కృతములుగా తెలియుచున్నవి.

పద్యము 24 కొలదికిమీఱబెద్దయగు. కుమారసంభవము (7–10)
,, 30. తరుణుండగు శీతల కరు భాగవతము దశ, 1358
,, 48. పొడవుగనెల్ల యంగళుల జక్కన విక్రమార్క చరిత్ర 1–74
,, 53. గీ. భూమినిండెమింటఁ బూర్ణమై భాగవతము – దశ. 1291

95. ఆంధ్ర భాషాభూషణము మెచ్చుఁడు మెచ్చ వచ్చునెర

ఇది కేతన దశకుమార చరిత్ర లోనిది. చూ. ప్రబంధమణి భూషణము వ్రాత ప్రతి. ప. 867

218. గీ. ఇగముచేనంబరం బెల్ల

భైరవుని శ్రీ రంగమహత్త్వము (2–241)

244. ఉ. ధన్యవిభూతి శోభితుడు భాగవతము దశ.

269. ఉ. వేలుపుగిడ్డియుం బరుసవేది – భీమేశ్వరపురాణము (2–14)

గీ ఆత్రిముని కంటె పసిబిడ్డ – తపతీసంవరణోపాఖ్యానము (3-105)

శా ఆడెందాండప మార్బటిన్ – భీమేశ్వర పురాణము (4–148)

301. సీ. ఒనరంగఁగపాలంబు నుపహారసంధియు

సకలనీతిసమ్మతము...512

303. శా. నానా శాస్త్రవిశారదుండు ,, 339
305. క. పతిచీరలట్టిచీరలు ,, 485
306. సీ. బలుగాపు వాకిళ్ల ,, 60

పై వానిలో పర్వతపురాణమునగల

"సీ. ఒనరంగఁగమలంబు నుపహార సంధియు"

అన్నది పంచతంత్రములో నున్నది. ప్రబంధరత్నావళిలో పద్యము సరిగాలేదు,

రెండవపాదము

జాలసుపన్యాస సంధియు సంధియు యోగసంధికమును-అనునది.

"జాలనుపన్యాస సంధియుఁ బ్రతికార సంధియు సంయోగ సంధికంబు" అనియుండవలెను— సకలనీతి సమ్మతము 512

303. శా. నానాశాస్త్రవిశారదుండు-అనునది పంచతంత్రములోనిది.
సకలనీతిసమ్మకము 339

305. క. పతిచీరలట్టిచీరలు నీతిసారము 485

306. సీ. బలుగాపు వాకిళ్ల నీతిసారము 60

304 పద్యము బద్దెన నీతిశాస్త్ర ముక్తావళి లోనిది.

376. సీ ఊకరల్ గొట్టక యుబ్బసంబందక...ఇది పురుషార్థసారములోనిది
సకలనీతిసమ్మతము 307

381. మ కరథక్కారవ...ఇది యథావాక్కుల అన్నమయ్య
సర్వేశ్వర శతకములోనిది

398. చ వెనుకకుఁబోక... పురుషార్థసారము
(సకలనీతిసమ్మతము) 306

517. క అరుణుండు కిరణములు... సకలనీతిసమ్మతము 382

518. ఆ. వె. అన్యదేశమెల్ల... సకలనీతిసమ్మతము

519 చ. చెలువుగ మప్కరంపుబని... 435

520. బలుకొలడువోలె 470

521. జానుగఁ బతిబనిచిన 438

## గ్రంథనామము—కర్తనామము తెలియనివి

524. సీ అఖిలలోకానందుడగు చంద్రుడు...
నృసింహపురాణము - 1-26

532 శా ఆ రాజాస్యలు గాంచిరయ్యెడ... పద్మపురాణము - 3-110

537 గీ. కడలుఁజేతులార్చుచు... నృసింహపురాణము - 1-34

540. మహాస్రగ్ధర. కనిరుగ్రగ్రాహనక్ర... నృసింహపురాణము - 3-3

547. మ క్షయకాలంబున... కాశీఖండము - 5-83

557. సీ. తిమిరభూతముసోకు... నృసింహపురాణము - 3-84

577. రాజితతేజుడైన ,, - 3-81

580. సీ. ఏట సేనపై దండువెడలిన...

భాగవతము. దశ పూ భా. - 965

| ప్రబంధ రత్నావళి- | ప్రబంధమణిభూషణము |
|---|---|
| 47. పూవులప్రోవులై | 13 ప |
| 49. ప్రత్యగ్రరచనా | 41 ప |
| 207. లలితలతాంత | 113 ప. |
| 245. సీ. ధూర్జటి కోపాగ్ని | 742 ప. |
| 333. సీ. సంతతిలేని | 167 ప. |
| 494. ఉ. రాజులు | 73 ప. |
| 522. క. చీటికిమాటికి | 57 ప. |



శ్రీ ర స్తు

# ప్రబంధరత్నావళి

## అథర్వణాచార్యులు — [భారతము] (ఆం.)

**తృ**ష్ణాతంతునిబద్ధబుద్ధు లగురాధేయాదులం గూడి శ్రీ
కృష్ణుం గేవలమర్త్యుఁగాఁ దలఁచి మర్దింపంగ నుత్సాహవ
ర్ధిష్ణుం డయ్యె సుయోధనుం డకట ధాత్రీనాథ ! యూహింపుమా
యుష్ణీషంబుసఁ గట్టవచ్చునె మదవ్యాఘోగ్ర శుండాలమున్. (ఆం) 1

మ. నతనానావనినాథయూథమకుటన్యస్తాబ్జరాగోజ్జ్వల
ద్ద్యుతివిభ్రాజితపాదపీఠు లలనాదోశ్చామరోద్ధూతమా
రుతలోలాలివినీలకుంతలుఁ బ్రభారుగ్ధాముఁ గేయూరశో
భితబాహాపరిఘున్ సువర్ణధరణీభృద్ధైర్యు దుర్యోధనున్. (ఆం) 2

మ. ప్రణతాశేషవసుంధరాధిపశిరస్స్రగ్గంధలుబ్ధభ్రమ
[1]త్క్వణదభ్రభ్రమకృద్ద్విరేఫగణ ఝుంకారప్రదాబద్ధసం
(?) ప్రణవత్యుత్ప్రథిత ప్రవర్ధిత సమస్త క్షత్త్రసూయాధ్వర
క్షణసింహాసనభాసితున్ దృఢధనుశ్శ్లాఘానుజున్ ధర్మజున్. (ఆం) 3

సీ. రాజమండలపూర్ణరాజమండలవీథి రత్నగర్భామలరత్నగర్భ,
గంధర్వగంధర్వగంధర్వనగరంబు నాగపున్నాగపున్నాగవసము,
మార్గణమార్గణమార్గణపీఠ ముత్తుంగభుజంగభుజంగభూమి,
కాంతకాంతారాతి కాంతకుంతస్థలి వీరకుమారకుమారసరసి,

ఆ.వె. యనఁ బొగడ్త కెక్కు నలకాపురంబు దే
వేంద్రుపురము దానవేంద్రుపురముఁ
గ్రేణిసేయు లలితశోణాంశుమణిబద్ధ
గోపురంబు హస్తినాపురంబు.

---

1. ఇందలి 2, 3 చరణముల యర్థము కుదురలేదు. మేము మార్పలేదు.

## అన్నమరాజు—కానుకోలను. [అమరుకము] (ఆం)

చ. చులుకనఁ జాపముం దిగుచుచోఁ గటకాముఖపాణిమీఁదఁ బె
ల్లొలయు నఖాంశులం గదిసి యొప్పెడు కెంజిగురాకుగుత్తిచే
నలవడి కర్ణపూరమున నంటిన తుమ్మెదవోనిపార్వతీ
లలన కటాక్షదృష్టి మనలం జరితార్థులఁ జేయుఁ గావుతన్. (ఆం) 5

సీ. తివిరి రాశికినెక్కి తిరుగు చక్రంబులు మెట్టులఁ బదిలమై మెఱయుతేరు,
బహుముఖంబుల నేర్పు పచరించుసారథి వ్రాసిచూపఁగరాని వారువములు,
గట్టియై పీఁక నక్కఱఁ దీర్చువిలుగమ్మి శ్రుతిరహితంబుగ మ్రోఁత చూపునారి,
విజయానుకూలమై విలసిల్లుబాణంబు సరిలేనికోటులసంఖ్యబలము,

గీ. దనకు నబ్బుటయునుఁ బురత్రయము గెలిచి
పృథులవిఖ్యాతిఁ గైకొన్న రథికవరుఁడు
జయముఁ దేజంబు భూతియుఁ బ్రియ మెలర్ప
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁ గాత. (ఆం) 6

## అన్నమయ్య-తాళ్ల పాక [తిరువేంకటేశ్వరశతకము](ఆం)

చ. అరిసెలు నూనెబూరెలును నౌఁగులుఁ జక్కెరమండెఁగల్ వడల్
బురుడలు పాలమండెఁగ లపూపము లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందువెట్టెఁ బరమాన్నశతంబుల సూపకోట్లతో
నిరతవినిర్మలాన్నముల నేతులసోనల వేంకటేశ్వరా! (ఆం).. 7

## అప్పన్న—[చారుచర్య] (జ)

సీ. కఠినమై దొడ్డచిక్కణము నై వత్సరార్థప్రమాణము ప్రాఁతఁదనము గలిగి
యుజ్జ్వలచ్ఛాయ మై యొత్తినతరవాయి శశమాంసఖండంబుచంచ మగుచు
నొగ రించుకయు లేక మిగులంగఁ దీపైన క్రముకంబు; నొప్పునై కమ్మవలచి
దళ మెక్కి పండినతాంబూలదళములు; కాలోపలంబులు గాల్చి వడియ

గీ. నూని కట్టిచ్చి చూర్ణంబుగా నొనర్చి
భుక్తి గొనకముందట నాల్గు భోజనోత్త
రమున రెండును నటమీఁద రాత్రి యాఱు
మార్లు తమ్ముల మొప్పారు మంత్రియప్ప! (జ) 8

సీ. లఘుకారి క్రిమిదోషవిఘటనసంధాయి దీపననిర్దోషదీప్తికరము,
పాషాణచూర్ణంబు; పైత్యవాతఘ్నంబు శంఖచూర్ణము పైత్యశైత్యహరము;
చిప్పలసున్నంబు శ్లేష్మంబు సడఁగించు గుల్లసున్నము వాతగుణముఁ జెఱచు,
తనివిచ్చుఁ జాల ముత్యంపుఁజూర్ణము చూర్ణ పర్ణ మాయువునకు బాధకంబు,
గీ. పత్రమూలంబునను రోగ పటల ముండు
నగ్ర మది పాపముల కెల్ల నాలయంబు
నడిమియీనియ బుద్ధివినాశకరము
వీని వర్జించి తగఁ జేయు వీడియంబు. (జ) 9

చ. వదనవికాససౌరభవివర్ధనకారి లసన్మదావహం
బుదరవిశేషసౌఖ్యకర ముద్గతదోషబలప్రహారి స
మ్మదజనకంబు తమ్ములము మానవతీపరిభోగవేళలన్
మదనపునర్భవీకరణమంత్రము తుల్యమె దీని కెద్దియున్. (జ) 10

## అమరేశ్వరుఁడు-చిమ్మపూఁడి [విక్రమసేనము] (ఇ)

మ. అదె కైలాసము దృగ్విలాసము విహాయశ్చారిణీసమ్మద
ప్రదవిన్యాస ముదగ్రభాసము మరుద్భానూసదాభ్యాస మ
భ్యుదయన్యాస మసన్నిరాసము మయూరోదారనిధ్వానబి
భ్యదహివ్రాతకృతప్రవాసము త్రినేత్రావాస మురీశ్వరా! (అం) 11

సీ. అరుణపుష్పావలి యగ్నిగా సంధించి యళులనుల్కలుగాఁగ నావహించి,
దందడి వీతెంచుదక్షిణపవనంబు భస్త్రానిలంబుగాఁ బరిఢవించి,
చిలుకలు పికములు చేదోడు సేయంగ మాధవుం దనుకనుమరి గడంగి,
యంగజుం డనుపతియానతిఁ బనివూని మొగడ లన్మలుకులమొనలు చఱచు
గీ. కొలిమియొక్కొ యనఁగఁ గురియు పరాగంబు
విస్ఫులింగములుగ విరహు లులుక
నేచి పూచియున్న యీ యశోకమహీరు
హంబుఁ గంటి మాళవాధినాథ! (అం) 12

చ. అలకలు తేఁటిదాఁటులును, హస్తతలంబులు పల్లవంబులుం,
బలుకులు గీరపోతములభాషలు, మేనులు బువ్వుఁదీగెలున్,
లలిఁ దపలోఁ దడంబడ విలాసవతుల్మదనాధిరాజ్యల
క్ష్ములగతి నెల్లచో విటులు గోయుట చెన్నెసలారెఁ దోఁటలన్ (అం) 13

చ. అలరులపాన్పులం దలిరుటాకులసెజ్జల హర్మ్యవేదికా
తలములఁ దీవయిండ్ల సికతా శయనంబుల మున్వియుక్తి మై
నలఁదురి వందుకందువుల నప్పటి కప్పటి కింపుఁ బెంపఁ గో
ర్కులు తనివారి వేడ్కపడఁ గూడిరి వేడుకతోడ దంపతుల్. (ఆం) 14

గీ. అలికలితపంకజము నొక్కయతివ దెచ్చి
చుట్ట మగునట్టి వనితకుఁ జూపుటయును
తనకురులు మోము నెదుట నద్దంబులేక
తోఁచె ననుచు నమ్ముగ్ధ యద్భుతముఁ బొందె. (అం) 15

చ. ఇఱియుకుచంబులం దొకటి యించుక వీడ్వడ నొక్కకేల లేఁ
బొఱఁ గబళించి నిక్కుచును బూవున కెత్తినచేతిచంక క్రొ
మ్మెఱుఁగులు హస్తముం గడచి మీఁదికిఁ బ్రాఁకఁగ మున్ను గన్నయా
గుఱుతులు డాసి కోసెఁ దుది కొమ్మల పూవులు కొమ్మ నెమ్మితోన్(ఆ) 16

గీ. ఇట్టి పాపఁడు ల్కూఁరదేలు మట్టి యనుచు
జనులు కనుకని పలికెడు చందమామ
నడిమిమచ్చకు నెఱిఁగి పే రిడఁగ నేర్తు
రప్పురమున మేడలపయి నాడుసతులు. (అం) 17

సీ. ఏపునఁ జెలరేఁగి యేయుమనోజన్ము చెఱకువిల్ రెండుగా విఱిచివైతుఁ
బలువలై పలుకుచిల్కలనాలుకల ముల్లు పెఱిచి యీరములలో వెడల సడఁతు,
మదమున మ్రోయుతుమ్మెదలఁ జంపకలతాంతములలో మునుఁగంగ
నిమురింతుఁ (?),
దగులమై వీతెంచుదక్షిణాశాగంధవహు మహోహీంద్రునివాతఁ ద్రోతు,

గీ. నేటి కులికెదు నాయట్టిబోటి కలుగ
వెలఁది ! నీ మదిలోపల వెఱవ కుండు
మమ్మ ! ధైర్యంబు వదలకు మమ్మ యెందుఁ
గత్తలము గల్గుమేనికిఁ గలదె బాధ ? (జ) 18

చ. కటి వడఁకాడ నీళ్ల నసికొను కరంబున నక్కలించి పి
న్నటతరళంబుతోడ నయనద్యుతి భ్రూలతలం దెలర్ప నుం
గుటములు మోపి నిక్కుచును గ్రొవ్విరిచన్నులచాయ మోముచ
క్కటి కెసఁగంగఁ జొచ్చె నొకకామిని తోయజషండ మిమ్ములన్. (ఆం) 19

గీ. కమలినీకాంత యెంతయుఁ గంది వంద
వారుణీసక్తుఁ డై వసువ్యయము చేసి
యరిగినట్లు సరాగి యై యంబరంబుఁ
దొలఁగి పశ్చిమజలధిలో నుఱికెఁ దరణి. (ఆం) 20

సీ. కలయంగ నలఁదినకస్తూరి పెల్లున జలముల దెల్లను గలఁగఁజేసి,
కుచమండలంబులకుంకుమచర్చల నీ రెల్ల జేవురునీరుచేసి,
తనులిప్తసురభిచందన కర్దమంబున వారినెల్లఁ బులకవండు (?) సేసి,
మూలల నవపుష్పమాలికావితతుల వన మెల్లఁ దెట్టువ గొనఁగఁ జేసి,

ఆ.వె. యలక లలికవీథి నంటఁ గన్గవలఁ గెం
పెలయఁ గామచిహ్నా లెల్ల బెరయ
నలరువాతు లమర జలకేలి 'సాలించి
కొలనువెడలి రింతు లలసగతుల. (ఆం) 21

మ. కులశైలంబులలో సువర్ణగిరి దిక్కుంభీంద్రవర్గంబులో
బలభిన్నాగము లోకపాలకులలోఁ బర్జన్యుఁ డుగ్రోరగం
బులలో శేషుఁడు పెంపుఁ గన్నకరణిం బూజ్యాధిపశ్రేణిలో
వెలసెన్ విక్రమసేనభూవిభుఁడు దోర్వీర్యప్రతాపంబునన్. (ఇ) 22

సీ. కేలిఁదెప్పము సేసి క్రాలి లీలావతి నీఁదించుచును నొక్కయింతి దాసి,
చే యిచ్చి యిందు విచ్చేయు మంచును దన్వి నడిపించుచును నొక్క పడఁతి నూఁది
ముదితచేకూడను ముద్దులాడుచు నొక్క తరుణికి నిమ్మలఁ దమ్మ యొసఁగి,
రమణిపాపటఁ బుష్పరజముఁబోయుచు నిదెమిగిలెఁగొమ్మని యొక్క మగువ కిచ్చి

గీ. కదలఁ బడినట్టు లొక్కతెఁ గౌఁగిలించి
ముంపు మునిఁగిన ట్లొక్కతె మోవి యాని
లలితనాయకకేలీవిలాస మమర
లీల జలకేలి సలిపె భూపాలసుతుఁడు. (ఆం) 23

చ. కొలఁదికి మీఱఁ బెద్ద యగుకోటతనర్పున వస్తుసంతతో
జ్జ్వలతరసత్ప్రభాతిరవిచంద్రరుచుల్ సొరనేర కున్న సం
ధ్యలు దివసత్రియామలును దత్పురిపౌరజనం బెఱుంగుఁ ద
మ్మలముచవిన్ విహంగగతిఁ బూవులతావి రతిప్రసంగతిన్. [1] (ఆం) 24

---

1. చూ. నన్నిచోడని కుమారసంభవము- (7-105)

గీ. క్రాలుఁగన్నులు ముద్దు మొగములు దమకు
నసదృశ ప్రభావమునఁ జెల్వగుటఁ జేసి
మునిఁగి మీలను దలలెత్తి వనరుహములఁ
దూలపఱచిరి వనకేళివేళ సతులు. (అం) 25

చ. గొనయము తమ్మినూల్ చెఱకుఁగోల ధనుర్లత పూవు లమ్ము లే
టును నొకమాటు తా నతనుఁడున్ మును నుగ్రు జయించె జీవరా
శి నొడుచు టేమి చెప్పనని చేయునుతుల్ తగు మోహనప్రవ
ర్తనగలకాముఁ డీవుత ముదంబున మీ కిలఁ గామసౌఖ్యముల్.[1] (జ) 26

చ. చనవున రెండు వక్త్రములు చన్నులపా ల్గుడువంగ నొక్క మో
ము నగఁగ నొక్క యాననము ముద్దు నటింపఁగ నొక్క యాస్యము
న్గనఁగ నిదేమి పల్కు దని యాలపనంబునఁ బెక్కులించు [?] ను
బ్బున నగుషణ్ముఖుం డెలమిఁ బొంది త్రిశక్తులు మాకు నీవుతన్ (అం) 27

సీ. చూపులకట్టు పూఁదూపులఁ జేపట్టు నబలలచూడ్కుల యాయుధములు,
తాయంబునకు గండుఁగోయిలఁ గూయించు బాలలపలుకుల మూలమంత్ర,
మెదిరికిఁ దేఁటుల నెదయాట లాడించు నబలలయలకల యాప్తబలము,
సవరణకుం జంద్రుఁ జాలించుమగువల మొగముల సేనకుఁ దగిన మొగము

గీ. భావభవునకు; నటుగాక బలమె బలము
గాఁగఁ దిరిగెనే వీరిచేఁ గాసిఁబడఁడె ?
యనఁగ సౌందర్యసంపద లభినవముగ
వఱలుదురు దత్పురంబున వారసతులు. (అం) 28

క. తరుణవయస్కుల యౌవన
పరిపాకుల వృద్ధజనుల భటులను నిజసో
దరులను గురులనుగాఁ జూ
తురు పురము పతివ్రతాసతులు పుణ్యవతుల్. (అం) 29

క. తరుణుం డగుశీతలకరు
మరగి వియల్లక్ష్మి తన్ను మాని ముదుకఁడున్
ఖరకరుఁడును నని ద్రొబ్బిన
కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా ! (అం) 30

---

1. "ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ ...క్రియాసిద్ధిః సత్త్వే వసతి మహతాం నోపకరణే" సుభాషితరత్న భాండాగారం (2-252.)

గీ. తఱులు వడి యుత్తరాయణ దక్షిణాయ
సముల రవితేర విడిలిననఱువ లట్లు
మెఱయుఁ గనుఁగొనఁ గొమ్మలు మింటి కిడిన
కుదురువిధమునఁ దనరారుకోటమీఁద. (ఆం) 31

సీ. దక్షిణపవనంబు తనుగంధమున నూని మలయాచలముమీఁదిమరులు మానఁ,
దివిచి పట్టినలేఁతచివుళులచాయకుఁ గరతలంబులకాంతి వరము లొసఁగఁ,
గుసుమముల్గోయుచో గోళ్ళమెఱుంగులు తనిమొగ్గలకు గవుసెనియ లొసఁగఁ,
బలువగఁ జెలఁగెడుపలుకులు రాజకీరనులకు నొజ్జతనములు సేయఁ,

ఆ.వె. గురులు నలులపిండు బెరయఁగ వనమయూ
రములగతులువేఁడ గమనలీల
ననఁగి పెనఁగి ప్రీతి వనకేలి సలిపిరి
వనజముఖులు వేడ్కఁ బనుపు సేయ. (ఆం) 32

సీ. దళమైనచీఁకటి గుళియలు సేసి పద్మాసనుం డాయువు వోసె ననఁగఁ,
దొలుకారుమెఱుఁగులు కొలఁదికి నఱికి విరించి వాల్గనుల నూరించె ననఁగఁ,
జంద్రికాసార మబ్జజుఁడు గట్టిగఁ బదనిడి యాణిపాణియుఁబడ సె[?]ననఁగఁ,
బాటించి విధి రాగపరమాణువులఁ బల్లవితమూర్తి గాఁగ నిర్మించె ననఁగఁ,

గీ. బొలుచునలులను మదనునమ్ములను ముత్తి
యముల విద్రుమవల్లిక నపహసించి
తరుణి యలకలుఁ జూడ్కులు దశనములును
నధరమును బ్రస్తుతింప నాయలవి యెట్లు ? (ఆం) 33

శా. దానానేకపబృంహితస్వనము గంధర్వావలీహేషిత
ధ్వానంబున్ మృదువేదనాదమును గాంతానూపురారావమున్
గానానూనరవంబుఁ దూర్యబహుశంఖస్ఫారరావంబుఁ బె
ల్లై నీరాకరఘోషమో యనఁగ నిత్యంబుం జెలంగుం బురిన్. (ఆం) 34

సీ. ధర వియోగులనెల్లఁ బరిమార్పఁ బూని హృద్భవుఁడు గట్టినవీరపట్ట మనఁగ,
విరహులపై దండు వెడలుచో మదనున కెత్తినకెంజిపురెల్లి యనఁగఁ.
దోయధి వెడఁ గ్రుంకఁ దోఁచుపురందర కుంభిసిందూరితకుంభ మనఁగఁ,
గులిశాయుధుని పెద్దకొలువునఁ జెన్నొంద దీపించుమాణిక్యదీప మనఁగఁ,

గీ. గుముదినీరాగరససిద్ధఘుటిక యనఁగఁ
గాముజనరంజనౌషధీకబళ మనఁగఁ
బొడుపుఁగెంపున బింబంబు పొలుపు మిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతిని స్తంద్రుఁ డగుచు. (అం) 35

సీ. ధమ్మిల్లభారముల్ కమ్మపూవులతోడఁ బొదిగొని వెన్నులఁ బొలసి వ్రేల,
నలికతలంబులఁ బొలచుకుంతలములు ఘర్మజలంబులఁ గలసి యంటఁ;
గహ్లారదళములకాంతి మిన్నక కొన్న చెన్నునఁ గనుఁగవ జేగురింప,
సోలెడువల్లులఁ బోలెడుమేనులఁ బయ్యఁట గాలిచేఁ బ్రస్ఫురింప,

ఆ. వె. ఘనపయోధరములఁ గాశ్మీరచర్చలు
గలఁగ నలసగతులు చెలువ మొందఁ
బువ్వుఁబోఁడు లంతఁ బుష్పాపచయకేలి
సోలి వచ్చి రానృపాలుకడకు. (అం) 36

సీ. ధరణీశ ! లవణాబ్ధిపరివేష్టితక్షితి వలలినవేరెడుగలితికొలఁది
నొక్కొక్కదిక్కున కొక్కొక్కలక్షయోజనములు దన్మధ్యమున సువర్ణ
సార మైయున్నది చతురుత్తరాశీతి సాహస్రయోజనసంఖ్య మొదలి
వలము పదాఱువే ల్గలిగి వెడల్పు ముప్పదిరెండువేలుగాఁ బాఁతు లోఁతు

గీ. మొదలివలమునయంత యై తుదిఁ బదాఱు
నేసివేలుగా మేరువన్ శిఖరి యొప్పు
దానిపై బ్రహ్మపురి చతుర్దశసహస్ర
యోజనస్థితిఁ గనుఁగొనఁ దేజరిల్లు. (అం) 37

చ. నలువగురక్తి మించినమనంబున నుబ్బును లావు పుట్టి చెం
గలువవికాసవేళ మురుకంబు [?] నటింపఁగఁ బువ్వుఁబోఁడి మొ
క్కలమునఁ బేర్చి నాథునధికారముఁ గై కొని కేలి సల్పె న
చ్చలమున సిగ్గు చాలమియుఁ జన్గవహారము లోలిఁ జెప్పఁగన్. (అం) 38

ఆ. వె. నీర నగ్ని యునికి యారయ విస్మయం
బనుచు బాడబాగ్ని కడలి యప్పు
రంబుఁ జొచ్చె నొక్క రత్నాకరము మఱు
లనఁగఁ జెలువ మమరు నాపణములు. (అం) 39

గీ. నూఱు క్రతువులు సేయని పాఱు టిల్లు
కోటిపడగలు లేని కిరాటగృహము
జాతిరత్నంబు గాని పాషాణకులము
వెదకి చూపిన వీటఁ బన్నిదము గలదు. (ఆం) 40

సీ. నెఱవుగా విరియక నెగడునెత్తావి తుమ్మెదలచే మునుమును మీఁదు వోక,
యకరువు నెఱయక మకరంద మొలుకక నెఱిదప్ప నొరగక కఱకు లేక,
బింకంబు లొక్కింత ప్రిదులక జిగిసొంపు చెదరక తేకులు చిక్కువడక,
పొరటతో రాయక పొలుపుసొం పెడలక సుడియు క్రీగాలిచే సూరగిలక,

గీ. కరము శోభిల్లురుచిరమంజరులు గోసి
వనిత యొక్కర్తు తనచు లావణ్యరసము
నెలమి నుద్యాన మొక క్రొత్తచెలువు దాల్ప
లతలలో నాడు జంగమలతికవోలె. (ఆం) 41

మ. పర పై యొ ప్పెసలారుమానికపుసోపానంబులం బ్రజ్వల
ద్వరవజ్రోపలసైకతంబులను సౌవర్ణారవిందంబులన్
హరినీలాసితవారిజంబులను జక్రాంగాదివాఃపక్షివి
స్ఫురణం గల్గుసరోవరంబుఁ గనియెన్ భూవల్లభుం డయ్యెడన్. (ఆం) 42

చ. పరముఁడు కంధరస్థలముపై నిడి వేడుక ముద్దులాడఁగాఁ
గరమున మౌళిగంగయుదకంబులు మెల్పనఁ దీల్చి యాఁది శీ
కరములు భూషచేందునకు కారవ [?] తారకలీలఁ జేయుత
త్కరివదనుంతు మత్కృతికిఁ దా సుముఖస్థితితోడఁ దోడగున్. (జ) 43

సీ. పరిణత ఫణిలతాపత్రంబుఁ గదిసిన చివురునాఁ జెక్కునఁ జేయి చేర్చి
కందర్పమదకరికరముపై జక్కవ లెఱఁగెనాఁ దొడఁ గుచ మిఱియ మోపి,
దవనంబుపొరకలఁ గవిసినమంచునాఁ బలుచనిచెమట మైఁ గలసి మెఱయఁ
గలువరేకులు మాక్తికముల నీనెడి ననాఁ గన్నుల బాష్పంపుఁగణములురలఁ,

గీ. వేఁడి నిట్టూర్పుగాడ్పులు విరహవహ్ని
శిఖలు ప్రబలఁగ వలవంతచింత నొగిలి
యేకతం బున్నదాని రాజేంద్రతనయఁ
గనిరి లతికాగృహంబులో వనజముఖులు— (జ) 44

చ. పలుచని చంద్రికారసము ప్రన్ననినున్ననితేటక్రొమ్మెఱుం
గులతుదలు న్విదిర్చు నెలకొమ్ములకాంతి పసిండినిగ్గుతోఁ
గలిపి యలంతి వన్నె యిడి కాయజునిల్పిన రత్నపుత్రిక
న్నలువ సజీవిఁ జేసె నొకొ నాఁదగు నాతివిభాతి చూడ్కికిన్. (అం) 45

సీ. పాంథులహృదయముల్ పల్లటంబులు సేయ దర్పకుపనిచినదం డనంగ,
విరహిమృగంబుల సురిఁగింపఁ దివిరెడు కాయసంభవుని మొక్కల మనంగఁ
గడు నల్గి జైత్రునాగారంబు ముద్రింప మనసిజుపనిచినయనుఁగు లనఁగ,
సహచరుం డగుగంధవహుఁ గానఁగా మీనకేతనుపంచినదూత లనఁగ,

గీ. నభినవాకారసౌందర్యసుభగలీల
లతిశయంబుగ మెలఁగుచు నసమబాణు
పుష్పలావికాజనములపోలె నెఱసి
కోమలాంగులు పువ్వులు గోసి రెలమి. (అం) 46

ఉ. పూవులప్రోవులై చిలుకబోదలు కోయిలపిండు మందలై
తావుల క్రోవులై యలివితానముగానము తానకంబు నై
కావను బండఁజాలుటఁ ద్రికాలముఁ గల్గ వరంబుఁ గన్నయ
ట్లై వనరాజి పొల్పగుఁ బురాంతికభూముల నెల్లఁ జూడఁగన్. (అం) 47

చ. పొడవుగ నెల్లయంగళులఁ ద్రోవులు వోసిననూత్నరత్నముల్
కడఁక ననేకవేషములు గైకొని వచ్చిన యర్థికోటికిన్
బిడికెఁడు లాదిగాఁగ బలి వెట్టుదు రప్పురివైశ్యభామిను
లక్కడపక హస్తకంకణఝుళధ్వను లొప్పఁగ నెల్లయప్పుడున్. (అం) 48

సీ. ప్రత్యగ్రరచనాతి భాసురప్రాసాద నిర్జిత గోత్రావనీధరంబు,
ప్రాకారశిఖరాగ్రబంధురమణిగణ ద్విగుణితతారకావిభ్రమంబు,
పరిఖాజలాంతర ప్రతిబింబితద్రుమ స్మారితపాతాళభూరుహంబు,
వరపుష్పసౌరభావర్జితమధుపహూ న్యీకృతాశావారణేంద్రగండ,

గీ. మప్సరస్సంగ్రహణీయలీలాతిశయవి
లాసినీజన నేత్రవిలాసజనిత
కుసుమశరబాణవైహృత్య మసదృశార్థ
నిర్జితాలక ముజ్జయినీపురంబు. (అం) 49

సీ. ప్రాణంబు లెడల నభ్యాసంబు సేయుమా ర్గం బన నిట్టూర్పుగాడ్పు లెసఁగ
గవ్యశాలను నేయి గ్రమ్ముకై వడిఁ గామశిఖిఁ గ్రాఁగి మైదీగె చెమటవొడమ
మదనునమ్ములు సీరుపదను పెట్టినక్రియ వాలుఁగన్నులు బాష్పవారి మునుఁగఁ
బగ లేదుటయు నెడఁబడురథాంగముచందమునఁ జన్నులుముఖోద్గముగ
వడంక.

ఆ.వె. ప్రాణ మెడలి నెఱపువడియొడలు [?]
భూషణములతోడిపొత్తు విడిచి
లాఁతు లైరి సఖులు లలఁతులు వాయని
ప్రాఁత లైరి నిషధరాజసుతకు. (జ) 50

గీ బలిమి రాహు సుధాంశుబింబఁబు వెఱచి
పాఱఁ గడు డాసి వెనుకొనుపగిది నొక్క
యెడ సఖులు గూడి చెలరేఁగి యీఁదుచోట
నీలవేణియు మొగమును నెలఁత కొప్పె. (ఆం) 51

సీ. భట్టనారాయణ భాషారమాదేవి లబ్ధవర్ణుల కర్థలబ్ధిఁ జేయు,
బాణవాగ్స్వామినీప్రసవమంజరి విశారదుల కలంకారరమణఁ జేయు,
రాజశేఖరభారతీజహ్నుకన్యక సుకవీంద్రులకు భావశుద్ధిఁ జేయు,
మాఘవాణీశీతమారుతగతి సారమతులకు రోమోద్గమంబుఁ జేయు,

ఆ.వె. నని యెఱింగి వారియడుగులు దలఁచి న
మస్కరించి దండి మఱిమురారి
వామనుని గుణాఢ్యు క్షేమేంద్రు నిల నలం
కారవిదులఁ దలఁచి గారవమున. (ఆం) 52

గీ. భూమి నిండె మింటఁ బూర్ణమై కర్కట
మకరమీనరాశిమహిత మైన
హరియశస్సుధాబ్ధియందులతుంపురు
లనఁగ జుక్క లొప్పె నాకసమున. (ఆం) 53

సీ. మకరధ్వజునివిల్లు మనము వాయిని నిడి నమ లింపుగాఁ జేయు నల్లఁజెఱకు'
మదనుబాణావళి మనము క్రుమ్మళ్లపైఁ బొలుపారఁ దుఱిమెడుపుష్పచయము'
మనసిజాతునియెల్లి మనము వినోదార్థ మై వచ్చి యాడెడుమావిచిగురు,
మరుతేరిహయములు మనయిండ్లలోఁ బంజరంబులఁ బొరలుకీరవ్రజంబు,

గీ. తా ననంగుఁ దట్టివానియలంచుట
యేమి ? యతనికడిమి యేమి ? యతని
బీర మేమి ? ధరణిఁ బిచ్చుక* యలుకేమి
వాలఁగ......నేమి వాలుఁగంటి [?] (జ) 54

సీ. మదవతీగండూషమదిరాభిషేచన వడి నంకురించినవకుళములను,
నతివలమృదుపాద హతినూత్నకోరక స్ఫురణఁ గైకొన్నయశోకములను,
సుదతులక్రేగంటి చూడ్కిపైఁబాఱినఁ దిలకించి యలరినతిలకములను
నన్నుల నెవ్వీఁగు జన్నుల సోఁకునఁ గొమరొంది ననిచిన కురవకముల,

ఆ. వె. నెరగఁ జరణములను నెఱకలు విరిసిన
మొగడలందునుండి మొఱయుతేఁటి
కొదమ లెలమిఁ బొంది ఘూర్ణిల్ల నధికవి
భూతిఁ దనరు చూతపోతములను. (అం) 55

చ. మరలఁగఁబోదు రిండ్లకును మా పవునంతకుఁ జేలలోపలం
దిరిగి యొకింత లేఁతవడదేరెడు మోములఁ జెన్ను సేయుచున్
బిరిగొని క్రాలుదృగ్రుచులపెల్లునఁ జీఁకటి నెల్లఁ బాచినం
దెరువరు లర్థిఁ గూడఁ బఱతేరఁగఁ బామరభామినీజనుల్. (అం) 56

శా. ముత్తా కేశుజము ల్సడల్చె ? మొగడ ల్మక్కె న్మహీజంబులం
దొత్తెం ? బువ్వులు నిండఁగాఁ బెరిగె నేయుర్వీజముల్ ? పూఁపలన్
మొత్తం బై విలసిల్లె నేధరణిజంబుల్ ? కాయలం బండులం
జిత్తానందముఁజేర్చె నేక్షితిజముల్ చెల్వొందఁగాఁ జెప్పుమా! (అం) 57

క. మొగములు విరిదమ్ములఁ గుచ
యుగములు గోకములఁ జూడ్కు లుత్పలముల మం
దగతులు హంసలఁ దోల న
రుగుగతిఁ జొచ్చిరి సతు ల్సరోవర మెలమిన్. (అం) 58

గీ. వామనానేకపము చక్రవాళకుధర
ధాతుతటము గోరాడుచోఁ దరులు విఱిగి
కూలుటయు మింటి కెగసెడు ధూళివోలెఁ
బర్వె నెఱపంజ పడుమఱ పట్టుకొనుచు. (అం) 59

---

* పా. యులుమేమి.

గీ. సతులు చల్లఁబోరాడుచో జలకణములు
నెఱికురులమీఁద నిండి క్రిక్కిఱిసి చెలువ
మమరెఁ గనుఁగొన నింద్రనీలములతోడఁ
గలయఁ గ్రుచ్చినఁ మౌక్తికంబులును బోలె. (ఆం) 60

సీ. సారథిశతవృద్ధు చక్రంబు లొనగూడి జరగవు రథమున సంఘటించి,
యుదకంబుసోఁకున కోర్వనియరదంబు చేతికి బిరుసైనజాటివిల్లు
గఱితాఁకు కోర్వక గడగడ వడఁకుచు మువ్వంకఁ బోయెడివివ్వ నారి,
మేవు నీరును లేక మెదలాడ నోపక వర్ణహీనం బైనవారువములు,

గీ. నిట్టిసాధనములు నీకు నెట్టు లొదవెఁ
ద్రిపురముల నెట్లు గెలిచితి దేవదేవ !
యనుచు నగజాతచెలు లాడ నలరుశివుఁడు
చిత్త మిగురొత్త మనల రక్షించుఁ గాత. (ఆం) 61

సీ. సుదతులు దస్సినచో నలంతలు వోవ సౌబగుఁ దై చలిమిరి చూపి చూపి,
యువిదలు తిలకించియున్నచో వేడుకఁగొలంది మీఱఁగ నొజ్జఁ గుదిసి కుదిసి,
సౌబగులపెనఁకువచోఁ దాన వలఁతి యై యెఱుకువ వాసన కెక్కి యెక్కి,
వెలఁదులు ముదమున విహరించుచో సోయగంబున వీథులఁ గ్రాలి క్రాలి,

గీ. యతులితం బైనశృంగారరతుల నిజవి
భూతిపొం దాస సేసి తత్పురములోనఁ
బవలు రేయును నుడుగక తవిలి తిరుగు
మిండఁడును బోలె మందానిలుండు లీల. (ఆం) 62

క. హరగిరి సురగిరి రోహణ
గిరు లీనినకొదమ లనఁగ గృహములు పురిన
చ్చెరు వగును గుడ్యరత్న
స్ఫురణను విలసిల్లి తగినపొడవుల తోడన్ (ఇ) 63

## ఎఱ్ఱయ-కూచిరాజు. [కొక్కోకము.] (జ)

సీ. ఒంట మోహమునఁ గన్గొంట చక్షుః ప్రీతి, పలుమాఱు నది దలంపంగఁ జింత,
యుడివోనికోర్కిచే నుండుట సంకల్ప, మొగి గుణస్తుతి నిద్రయుడిగి పొగడ,

విరహతాపంబున వెగ డొందుటయె కార్శ్య, మరచి యేమిటిమీఁదియాశ
లుడుగు,
ఔంద ఉండియు వారి నెఱుఁగమి నిర్లజ్జ, గమనంబు తనయిల్లుఁగదలి చనుట,

గీ. వలపు తల కెక్కి మది తన వశము గాక
పరవశత్వంబుచే డిల్లఁబడుట మూర్ఛ,
పొందు లేకున్నఁ బ్రాణంబు పోవు ననుట
మృతియు, నని దశావస్థలగతులు నొప్పు. (జ) 64

క. చూచుట తలఁచుట కోరుట
కాచుట కృశ మౌట రుచులు గానమి సిగ్గున్
ద్రోచుట నడచుట మూర్ఛా
ప్రాచుర్యము మరణ మనఁగఁ బదియు నవస్థల్. (జ) 65

సీ. పట్టెకంకటి దూదిపఱుపు ముక్కాలిపీఁట యగరుధూపము వెలు వైనదివ్వె,
పూలు గంధము గందవొడి పున్గుబరణియ జాలవల్లిక వన్నెమేలుకట్టు,
తమ్మపడిగ పాన్పు తలగడ చిటిచాఁప సానజా యడపంపుసంచి గిండి,
గొడుగు పావలు గాజుగుడిగి సున్నపుఁ గ్రోవి గందపుఁజిప్ప బాగాలబరణి,

గీ. గిండిచెంబును చిరుతేరగిన్నె బోన (?)
నిలువుటద్దము వీణియ చిలుక సురఁటి
మిద్దెయిల్లును ముంజూరు మిగిలినట్టి
పంచటోవరి గలకేళిభవనమునను (జ) 66

సీ. పర్వతతరునదీపక్షినామంబుల నేకన్నెఁ బిలిచెద రింటివారు ?
పొడవు కొంచెము వక్రమును బొందు నే కన్నె ......వక్రములు లొడలు ?
పెదవియు నధికంబు పింగళ మై గుంట కన్నులు గల్గి యేకన్నె మెలఁగుఁ ?
గలకంఠమును బాదకమలంబులును గడుఁ గఠినంబులగుచు నేకన్నె కమరు ?

గీ. నిదురవోవంగ నవ్వుచు నిడుదయూర్పు
లడర నేకన్నె లేడుతు రశనవేళ ?
మీసములు గల్గి చనుదోయిమీఁద రోమ
ములును గల్గును నేకన్నె బొసఁగ దదియు. (జ) 67

సీ. పొగకంపు గలుగక మిగులు వెచ్చన గాక తెలి వైననీటను జలకమాడి,
కరము పల్చన నున్నఁ గాక పిప్పియుఁ గాక మృదు వైనగంధంబు
మేన నలఁది,
గడితంబు జిలుఁగు గా కరవడు సైన(?) పంచపై వలిపదుప్పటముఁ గట్టి,
చెమ్మ వల్వాక వన్నె చెదరక వాసనఁ గులుకుపువ్వులు దోఁపి
కొప్పు ముడిచి,

గీ. మదనరతికోవిదులు పీఠమర్దకాది
విటులు సల్లాపములు చేసి వేడ్క సేయ
మోహనాకారుఁడై మరుమూర్తి వోలెఁ
బల్లవుఁడు కేళిమందిరాభ్యంతరమున. (జ) 68

సీ. వనరుహానన మనోవాక్కాయకర్మల ధవుని దైవముఁ గాఁగఁ
దలఁపవలఁ,
బ్రత్యుత్తరము లీక పని యేమి చెప్పినఁ జెవిఁ జేర్చి వేగంబె చేయవలయు,
నత్తమామలచోట నా ప్తభృత్యులయెడ మాయాప్రచారము లూనవలయుఁ,
బ్రతివాసరంబు శోభితవృత్తిచే నిలయంబు గోమయముచే నలుకవలయు,

... ... ... ...
... ... ... ...
... ... ... ...
... ... ... ... (జ) 69

సీ. వలిపపయ్యెదలోన నిలువక వలిగుబ్బ చనుదోయి మెఱుఁగులు చౌకళింపఁ,
బగడంపువాతెఱపై నొకించుక డాఁగి మొగమునఁ జిఱునవ్వు మొలకలెత్తఁ,
గొలుకుల నునుగెంపుఁ జిలికించి క్రొవ్వాఁడి దిట్ట చూపులు దలచుట్టుఁ దిరుగ,
నునుగొప్పులోపల నునిచిన పువ్వుల తావి పైకొని తుమ్మెదలను బిలువఁ,

గీ దొడవులకు నెల్ల దొడ వైనపొడవుతోడ
వలపులకు నెల్లఁ దనమేను వలపుఁ దెలుపఁ
బరఁగు కామిని తనవామపార్శ్వమునను
గదియఁగా వేడ్క లెంతయుఁ గడలుకొనఁగ. (జ) 70

సీ. హేమవర్ణం బైన నిందీవరద్యుతి యైనను దనుకాంతిఁ బూనవలయుఁ
జరణంబులును హస్తసరసిజంబులు గోళ్ళుఁ గనుఁగొనలును నెఱ్ఱ గలుగ
వలయు,
సరముల్ మృదువులై చక్రాబ్జము ల్చిహ్నకము లైనవరపాదకరయుగములు,
సమము బింకమునైన చనుదోయి, నల్లనై కడ లొక్కకొలఁదైనకచభరంబు,

గీ భోజనము నిద్రయును గొంచెమును మొగంబు
నుదరమును జాలఁ బలుచ నై మృదులతనువు
నధికశీలంబుఁ గలకన్య యర్హ్యఁగాఁగ
జాటి చెప్పిరి పరిణయశాస్త్రవిదులు (జ)71

## ఎఱ్ఱయ—కూచిరాజు. [సకలపురాణసారము.] (జ)

ఉ. నీరజనేత్ర కృష్ణమృగనేత్రనవారుణ నేత్ర దృష్టివ (?)
న్నీరదగాత్రు వేదగణనిర్మలసూత్రుఁ బురాణభారత
స్ఫారకథాచరిత్రు ఘనపాపనికుంజలతాలవిత్రు దు
ష్పారతపస్సమాధిజితశత్రుఁ బరాశరపుత్త్రుఁ గొల్చెదన్. (జ) 72

## ఎఱ్ఱాప్రెగడ—పెదపాటి. [కుమారనైషధము.] (జ)

సీ. అడియాసలే కొల్పి యఱవిసమును నీక యాడుచుండును చేతి కందినట్ల,
మొనసి పద్దులఁ బ్రోఁకలను (?) వెంటబెట్టుక మమ్మరించును తనయెమ్మెలెల్లఁ
గప్పువెట్టినపండ్లు గానరాఁ బల్కుచు నెఱవుసొమ్ములు చూపి ముఱియునులుక
యెన్ని లే పకట తా నీడేర్చినవి యిండ్లు మాటికిఁ జెప్పుకో నేటి కనుచు,

గీ. రాగిపైఁ బూఁతపూసినరవణములును
* నెఱయలచ్చరిపండ్లకట్టులును జమిరి
నట్టిప్రాఁతల చుట్టలు పెట్టిపెట్టి
తగిన వల దన్న మానక దాఁచఁబెట్టుఁ
జెప్ప రోఁతలువో వీనిసేఁత లెల్ల. (జ) 73

సీ. అలరెడు జెప్ప లల్లార్చినయం దాఁక ననిమిషకన్యఁ గా దనఁగ వశమె?
యమృతంబు చిలుక మాటాడినయందాఁకఁ గనకంపుఁ బ్రతిమ గా
దనఁగ వశమె ?

---

* సరిగాలేదు.

నడుఁగక యడు గెత్తి నడచినయందాఁక గొనబుపూఁదీగె గా దనఁగ వశమె?
కలికి తనూరేఖఁ గదిసి కన్గొనుదాఁక ఘనవనలక్ష్మి గా దనఁగ వశమె?

గీ. యువిద సఖిమీఁద వెడ వ్రాలి యున్నదాఁక
నొనరు తొలుకారు మెఱుఁగు గా దనఁగ వశమె?
వెలఁదిగుణములు సఖులచే వినినదాఁక
నఁగసంభవుమాయ గా దనఁగ వశమె? (జ) 74

చ. అలికుల మెల్ల వేణియును హంసములెల్లను మందయానముల్
జలజము లెల్ల నెమ్మొగము జక్కవలెల్లను జన్నుదోయి యా
పులినము లెల్లఁ బెన్పిఱుఁదు పుష్పములెల్లను మేనివాసనల్
పొలఁతుక నాక్రమించుకొనిపోయె నవన్నియు నన్నివంకలన్. (జ)75

సీ. ఈశుచేఁ గాంచి సాహిత్యవిద్య ధరిత్రి నిల్పినయట్టి పాణిని భజించి,
శ్లోకార్ధమునఁ జంద్రజూటు మెప్పించి యిష్టార్థము ల్గొన్నమల్హణు నుతించి,
గద్యఁబుచెప్పి శంకరునిచేఁ గరములు ప్రతిభతోఁ బడసినబాణుఁ దలఁచి,
శతకంబుఁ జెప్పి భాస్కరుని మెచ్చఁగఁ జేసి యురు దేహుఁ డైనమయూరుఁ
గొలిచి,

గీ. భవుని మెప్పించి కన్నులు పడసి తెచ్చి
వనిత కిచ్చినకాళిదాసునకు మ్రొక్కి
హరుని వినుతులచే బాస లాడఁజేసి
నట్టిభట్టుని నన్నయభట్టుఁ బొగడి. (జ)76

క. ఉడురాజు కొలువు దీరిన
నుడుగణపరివారసమిత నొఱపుగ ననుపన్
వడి వచ్చుకటికవాఁ డనఁ
బొడచూపెన్ వేగుఁజుక్క పురుహూతుదెసన్. (జ)77

చ. కలసి యొకళ్లొకళ్లు కసుగందనివేడ్కలఁ జూచువేళ జె
ప్పలు మఱువయ్యెనే నవియ పాయుట, తత్సుఖపారవశ్యులై
పలుకకయుండుటే యలిగి పైకొనకుండుట, యంతె కాని తొ
య్యలియు విభుండుఁబాయుటయునల్గుట నాఁగ నెఱుంగ రెన్నఁడున్.(జ)78

క. కురువిందవజ్రమయ గో
పురకాంతులవలనఁ బ్రొద్దు వోకలురాకల్
పరికింప నరిది యయ్యును
సరసిజకైరవ వికాససంపద దెలియున్. (జ) 79

సీ. కొమరువెన్నెలమోసు నమలిప్రాణేశ్వరు కొసఁగి యింపొనరించు నొకచకోరి,
పరపువెన్నెల గుజ్జు బంతెనగూళ్లాడు నోలి నెచ్చెలులతో నొకచకోరి,
పాలైనవెన్నెలతేటకేళాకూళి నోలలాడుచు నుండు నొకచకోరి,
గట్టివెన్నెల చల్దిగాఁ గట్టి వల్లభు నుడురాజుకడకంపు నొకచకోరి,
గీ. చేగవెన్నెలక్రొవ్వు భుజించి విందు
లొనరఁ జేయును జుట్టాల కొకచకోరి,
పండువెన్నెలపేస మేర్పఱిచి పతికి
నుబ్బుగా నిచ్చు వేకువ నొకచకోరి. (జ) 80

సీ. తంగేడు జెముడుకుఁ దామ రుమ్మెత్తకు గన్నేరువేళ్లకుఁ గరకకాయ,
ముసిఁడికి శుంఠియుఁ బసుపు సున్నమునకుఁ దెలఁగొప్పఁ బొగడకుఁ జెల్ల
యుప్పి,
వట్టివేళ్లకుఁ బత్తి వావిలి కొడిసెకు నేయి పాలకును వెన్నెళ్లు చలఁప
జీడికి సెనఁగ మించినవసచాభికి జిట్టివేళ్లును నల్ల జీలకఱ్ఱ,
గీ. తైలశుల కు జిల్లేడుపూలనీళ్లు
పనసపంటికి నూనె యావడకు ముస్తి
మిరియ మరఁటికిఁ దెగడకు నరయఁదుమ్మ
లడరువెలితుమ్మ నేలతంగెడుకు వైరి. (జ) 81

సీ. తొలిదలి గోసినతోరంపుఁ గ్రొవ్విరు లించువిల్తునకు మీఁ దెత్తి మ్రొక్కి
పద్మపరాగంబుభసితంబు మంత్రించి పువ్వారుఁబోఁడికిఁ బొట్టువెట్టి,
సంపంగిఱేకుల సర్వంబు లిఖియించి రాజాస్యకరమున రక్ష గట్టి,
నెఱిఁ బచ్చనివి యెఱ్ఱనివి యైన వానగూర్చి (?) బడసిపుష్పంబుల బడిమి
పోసి,
గీ. మదచకోరంపుమఱక నేమఱక ద్రిప్పి
పడఁతికిని దమ్మికప్పెర వెడలఁజేసి
చెలఁగి పూఁదేనియలఁ దేఁటిసిద్ధులకును
వెలఁది యెదుటను జాఱ గావించె నవుడు. (జ) 82

సీ. పులుసొల్లుచేఁదు నుప్పును దీపు నొగరును గణుతింపఁ భాగాధికములు గాక,
చిముడంగఁబాఱక చిక్కనై యిగురక కాటువోవక మఱి కలఁత వడక
యడికియు నుడుకక యుండిసి క్కమ్మక(?) పసరువేయక పరిపాటిచెడక,
సంబారములతోడిసంబంధ మెడలక పొగుపువాసన విరిపోటుగాక,

గీ. వింతలై జిహ్వకును రుచి ల్విస్తరిల్లఁ
దగుపదార్థంబు లెడనెడఁ దాము తామ
భోక్తలకు భోజనాసక్తిఁ బొడమఁ జేయ
నిండువేడుకఁ గూరలు వండ నేర్తు. (జ)83

సీ. మన్మథదివ్యాగమమున కోంకారంబు భూతేశునొదల పువ్వుదండ,
యల్పశృంగారరేఖార్గళకుంచిక యధికతమోదంతి కంకుశంబు,
విరహిణీజనమర్మవిచ్ఛేదకర్తరి యంబరక్రోడదంష్ట్రాంకురంబు,
తారకామౌక్తికతతికి నంచితశుక్తి దగునంబునిధికి ముత్యాలజోగు,

గీ. మారుపట్టాభిషేకార్థవారికుంభి
చిత్తజుని కోటలగ్గదంచెనపుగుండు
నాఁగ నానాఁటి కభివృద్ధి నారుకొనిన
చంద్రుఁడుదయించెఁ గాంతిని స్తంద్రుఁ డగుచు. (జ) 84

సీ. లావణ్యరేఖావిలాసలీలాకళా శాసితసూనశరాసనుండు,
కుంభినీవహనవిజృంభదోస్స్తంభసం భావితాశాంతదంతావళుండు,
* దారాక్ష దానాంబుధౌతయాచక జాల దుర్దమదుర్యభాకర్దముండు,
నీహారసురవాహినీహారనారద శారదనీరదస్వచ్ఛయశుఁడు,

గీ. వినుతిసేయంగఁ దనుజదిగ్విజయలటహ
పటహనిర్గుణనిర్ఘాతపటలచటుల
ఘోరనిర్ఘోషవినమితకుమతవిమత
కులకరన్యస్తవిస్తృత నలుఁడు నలుఁడు. (జ) 85

సీ. విరిదమ్మిసురఁటుల విసరకే యెలనాఁగ ! యుష్ణాంశుచెలు లవి యుడుకుచల్లు,
వెలఁదిముక్తాహారములు వైవకే సఖి ! యౌర్వాగ్నితోఁబుట్టు లవి యలంచు,
... ... ... ...

* ధారాక్త ?

గీ. చెలఁగి పన్నీరు చల్లకే కలువకంటి!
రాహుదంష్ట్రిలు సోఁకినరాజుమేని
కసటుచేఁ బ్రోదియగునది కాదు మిగులఁ
గాన యవియెల్ల నబల నీగతికిఁ దెచ్చె. (జ) 86

సీ. శాత్రవభుజగభుజంగమశాత్రవ శాత్రవనృపబలసంగరముల,
రిపుపద్మవనపద్మరిపురిపుప్రళయ ధాత్రీనాథపురవరత్రిపురములను,
విద్విష్టగిరిగిరివిద్విష్టవిద్విష్ట మండలాధీశభూమండలముల,
వైరికైరవవనకైరవవనవైరి వైరిభూపాలకాంతారములను,

ఆ.వె. బొం గడంపఁ ద్రుంపఁ బొగిమార్పఁ గాల్ప నౌ
ర్వానలుండు [?] వృషాంకబాణ
పటుతరానలుండు ప్రళయానలుండు ద
వానలుండు ధరణి నానలుండు. (జ) 87

సీ. శ్రీ బయల్పడకుండఁ జికురము ల్ధమకప్పఁ గుచచూచుకములపఁ గొంత
యిచ్చెఁ,
లేమి దోఁపకయుండ లెస్సఁగా నడిమికిఁ గుచములు తమకల్మిఁ గొంత యిచ్చెఁ,
దనువల్లికిని దృష్టి దాఁక కుండఁగ సాధు దంతముల్ తమకాంతిఁ గొంత
యిచ్చెఁ,
[?]దరబసిరింత లై దాఁటకుండఁగఁ దమ యలసత చూడ్కుల
కంఘ్రు లిచ్చె,

గీ. నంగకము లొక్కమై నున్న సొంగములను [?]
కలిమిలేములు దమలోన సలకరించె
సరయఁ బుత్రోత్సవమున కాయ త్తపడనౌ
యనఁగ సతిమేన గర్భచిహ్నములు దోఁచె. (జ) 88

సీ. శ్రీ సిద్ధి రస్తు శాసితవైరిమండల! విజయోఽస్తు భువనైకవీరపద్మ!
అభ్యుదయోఽస్తు సాహసబలసామగ్ర్య! కల్యాణ మస్తు నిష్కలుషహృదయ!
శుభమస్తు కారుణ్యవిభవసముజ్జ్వల! బ్రహ్మోయురస్తు భూపాలతిలక!
అభివృద్ధిరస్తు మహౌదార్యభూషణ! చిరకీర్తిరస్తు భాసురగణాఢ్య!

గీ. తుష్టిరస్తు నిజాంకనిర్ధూతకలుష!
పుష్టిరస్తు జగత్త్రియీపూతచరిత!

భద్రమస్తు మహీభారభరణః నీకు
నధికతేజోఽస్తు తే నిషధాధిరాజః (జ) 89

## ఎఱ్ఱాప్రెగడ - పెద్దపాటి. [మల్లణచరిత్ర] (జ)

సీ. కువలయకమలాభినవమనోజ్ఞం బయ్యుఁ బంకజీవనపరిప్లవము గాక,
ఘనసారపున్నాగకమనీయ మయ్యును గితవదుష్కృశి (?) సంయుతము గాక,
సాధుదాన ప్రౌఢియూథపం బయ్యును విశ్రుతఖరసమన్వితము గాక,
రాజితోత్తమజాతిరత్నాంకితం బయ్యు శృంగారవిటవిదూషితము గాక,
గీ. వరసరోవరచయమును వనచయంబు
నృపచయంబును దివ్యమంటపచయంబు
నెలమిఁ దనుఁ బోలె ననఁబొగడ్తలు వహించె
భువనసారంబు కల్యాణపురవరంబు. (జ) 90

చ. గము లగుపద్మరాగములఁ గ్రమ్ముమరీచులు చౌకళింపఁగా
గమలవనంబు లెన్నఁడు వికాసము గుందవు వజ్రమౌక్తికా
సమరుచిచంద్రికం గుముదసంఘములుం గసుగందకుండునాఁ
గౌమ రగుదివ్యరత్నమయగోపురవైభవ మెన్న నేటికిన్. (జ) 91

సీ. పగడపుఁగంబాలపచ్చటోవరియును నపరంజికాళంజి యలఁరుబాన్పు,
బంగారుసకినెలపట్టెమంచంబును వజ్రపునునుజాలవల్లికయును,
గుంకుమతలగడ ల్గొజ్జంగిపూఁదెరల్ దరమైనచంద్రకాంతంపుగిండి,
చౌసీతిరతముల సవరనిమేల్కట్టు దీపించుమాణిక్యదీపకళిక,
గీ పొసఁగఁ గర్పూరవేది కప్పురపుసురఁటి
నిలువుటద్దంబు రతనంపునెత్తపలుక
తళుకుదంతపు బాగాలు కలికిచిలుక
గలిగి యొప్పారుచవికెలోపలికి నెపుడు. (జ) 92

## కవసరాజు—తేళ్ళపూఁడి. [కళావతీశతకము] (ఇ)

క. ఆకంజానన యుపరతి
కాకాళము వడఁకెఁ దార లటునిటుపడియెన్
బోకైన (గి)కులు గదలెను
భీకర మగుతమము చంద్రబింబముఁ గప్పెన్. (జ) 93

చ. గురుకుచకుంభము ల్గదలఁ గ్రుమ్మరిడి పీడఁగ రాలఁగ్రొవ్విరుల్
కరమణికంకణక్వణనకాచనగధ్వను (?) లుల్లసిల్లఁగా
భరతపుఁబిట్టకై వడిని బాదికిఁ జేరెకివెల్చెలాగునన్ (?)
బరిపరిరీతులం జెలఁగు భంగులు మెత్తుఁగదే కళావతీ! (ఆం) 94

చ. ప్రకటితలీలఁ గీ లెడలి పాపటము త్తెపుఁజేరు మోము పైఁ
దకపికలాడఁ గ్రక్కదలుదంతపుఁ గమ్మలకాంతి ముత్త మై
వికచకపోలభాగముల వెన్నెల గాయుచునుండ నీవునన్
... ... లాగులు మెత్తుఁగదే కళావతీ! (ఇ) 95

## కేతన—మూలఘటిక. [ఆంధ్రభాషాభూషణము] (జ)

ఉ. మెచ్చుఁడు మెచ్చవచ్చునెడ, మెచ్చకుఁ డిచ్చకు మెచ్చు రానిచో,
మెచ్చియు మెచ్చు మ్రింగకుఁడు, మెచ్చక మెచ్చితి మంచుఁ గ్రుచ్చలై
మెచ్చకుఁ, డిచ్చ మెచ్చు గని మెచ్చుఁడు, మె చ్చొకమానమైనచో
మెచ్చియు మెచ్చకుండకయు మెచ్చుఁడు, సత్కవులార! మ్రొక్కెదన్[1] (జ) 96

## కేతనప్రెగడ — భాస్కరుని. [కాదంబరి.] (ఇ)

శా. గంధర్వాత్మజ రాజుఁ జూచెఁ బతియుం గాదంబరిం జూచెఁ ద
ర్వాంధీభూతమనస్కుఁ డై మరుఁడు విల్లందెన్ బ్రసూనోల్లస
ద్గంధం బొప్పఁగ నెక్కువెట్టి గుణనాదం బాని పుష్పాస్త్రముల్
సంధించెన్ దెగఁబాపి యేయఁ దొడఁగెన్ సవ్యాపసవ్యంబుగన్. (జ) 97

సీ. దీనిలోపలఁ గొన్నిదినము లుండిన నుష్ణకరుఁడైన నట శీతకరుఁడు గాఁడె?
దీనిలోఁ దెటిఁగినఁ దా నంబురాశిలోఁ గా దని జలశాయి గాఁపురాఁడె ?
దీనితీయనినీరు దివిజులు త్రావి చూచినఁ దమయమృతంబు చేఁదు నారె ?
దీనితోయమ్ములఁ దీర్థమాడిన నెంత పాపాత్ములును మోక్షపదవిఁ గనరె ?
ఆ.వె. యనుచుఁ గొలనినీటియతిశీతలత్వంబుఁ
బఱపు పెంపుఁ దీపుఁ బావనతయు
మనుజనాయకుండు గొనియాడి పడివాగె
త్రాట హయముఁ దిగిచి తటియఁజొచ్చె. (ఇ) 98

1. ఈ పద్యము ముద్రిత మగునాంధ్రభాషాభూషణమునఁ గానరాదు. తాళపత్ర ప్రతులందును గానరాలేదు.

## కేతన — [కువలయాశ్వచరిత్ర] (ఆం)

ఉ. కోటతనర్పు చూడ్కులకగోచరమయ్యెను తేరు మీఁదఁ బ
లాత్మటును నేఁగుచోటఁ దగులంబడమిన్ రవిమండలంబు నీ
పాటిద యన్తలంపునకుఁ బట్టగుచున్నదిగాక దీనికిం
బాటి యనంగ గు జ్జనఁగఁ బట్టులె యయ్యెనయా స్తశైలముల్. (ఆం) 99

## కొండయ — బొడ్డపాటి. [చాటువు] (జ)

సీ. కడఁగి యెక్కుడనైనఁ గదలనియరదంబు నరచంబు పై నిల్చునట్టివిల్లు,
వింటికిఁ గాఁపుగా విహరించు చక్రముల్ చక్రములను బ్రొద్దుజరపుశరము,
శరమునఁ బొడమిన చక్కనిసారథి సారథిమొగమునఁ జాఁగుహరులు,
హరులసామర్థ్యంబు నరసినశింజిని శింజినిఁ దరిత్రాడు సేయుబలముఁ,
గీ. బొందువడఁ జేసి దైత్యులపురము లేసి
యఖిలజగములు రక్షించునట్టిజోద
వనుచుఁ గొనియాడుదురు నిన్ను ననుదినంబు
నంగభవభంగ ! తిరుకాళహస్తిలింగ ! (జ) 100

సీ. తొమ్మిదితునుకల నెమ్మిఁ గూర్చినతేరు సరిజోకఁ గూడని చక్రయుగము,
నొకముఖంబున గడ్ప నోపనిసారథి రూపింప రానివారువపుసమితి,
బెడిదంపు దెగలకుఁ బెలు చైనవిలుకమ్మి గాలిచేఁ బ్రొద్దులు గడపునారి,
పదివంక లై చాయఁ బాఱనిబాణంబు పడిబత్తెములు లేనిభటగణంబుఁ.
గీ. బొందువడఁ జేసి దైత్యులపురము లేసి
యఖిలజగములు రక్షించునట్టిజోద
వనుచుఁ గొనియాడుదురు నిన్ను ననుదినంబు
నంగభవభంగ ! తిరుకాళహస్తిలింగ ! (జ) 101

సీ. దేహంబు మిక్కిలి తిర మైనరథము గా ఘననేత్రయుగము చక్రములుగాఁగ,
నూర్పులశ్వంబు లై యొప్పారుచుండఁగఁ(?) దొరయు పళ్ళెరము సూతుండు గాఁగ,
సర్వాంగ మతిఘోరసాయకం బది గాఁగ సొరిదిఁ గుంతలములు జోడు గాఁగ,
చల మైనవిహరణస్థలము కార్ముకము గా నలు వైనహారంబు నారి గాఁగ,

గీ. నన్నియును నీ మహత్త్వంబ యగుటఁజేసి
లీలఁ ద్రిపురంబు లేసి గెల్చితివి గాక
నీకు నొరులు సహాయు లై నిలువఁగలరె ?
యంగభవభంగ ! తిరుకాళహస్తిలింగ ! (జ) 102

## కొమ్మయ-నిశ్శంకుని. [వీరమాహేశ్వరము] (ఆం.)

సీ. ఎనిమిదిరూపంబు లేక మై కనుపట్టి దీపించు నెవ్వాని దివ్యమూర్తి ?
గణుతింపఁ దగుదేవగణములయాఁకలి వెసఁ దీర్చు నెవ్వాని నొసలికన్ను ?
రాజసంబునఁ జొరరానిచోటులు సొచ్చి వడి మేయు నెవ్వానివాహనంబు ?
నాణె మై యఱువదినాల్గుపీఠములందు రాణించు నెవ్వానిరాణివాస ?
గీ. మదిఁ గనుంగొనఁ బాయ రానట్టి మోహ
మిచ్చు నొదవించు నెవ్వాని యిల్లు విల్లు ?
బెరయు నెవ్వానిపలుకులు బేసి యగుచు ?
నెందు నెవ్వాని సేవింతు రెల్లసురులు ? (ఆం) 103

సీ. కడిఁదియుద్ధంబులఁ గదిసి యాఁకలిదీఱ మించుఁజూపుల నారగించువాఁడు,
గడియసేపైన నొక్కెడ నూరకుండక త్రిభువనంబుల సంచరించువాఁడు,
నూఱుతంత్రులవీణె నూతనం బగుక్రియా హేవాక మొప్ప వాయించువాఁడు,
గోర్లు దాఁటించి నిర్నిమిత్తంబు (?) వీఁకునఁ బోరు గావించువాఁడు,
గీ మునివరేణ్యుఁడు పద్మగర్భునికి నింపు
కొనలు సాఁగంగఁ బుట్టినకొడుకుఁగుఱ్ఱ
చనియె శర్వాణిఁ గొలువంగఁ దనువిలాస
శారదాంబుదవర్ణుండు నారదుండు. (ఆం) 104

మహాస్రగ్ధర.
కని రాబ్రహ్మచ్యుతాదు ల్ఘనకనకలతాగ్రంథిసంబంధిజూటా
వనిఖేలద్బాలచంద్ర స్వయిముపచయకృద్వర్ణనీయప్రభాసం
జనిభాస్వత్ఫాలభాగస్థలసితభసితస్థాసకశ్రీసమగ్రా
ననపద్మున్ బుణ్యసద్మున్ జరణనతవిపన్నాళు నానందికేశున్. (ఆం) 105

సీ. కమలజాండంబులు కందుకంబులు సేసి యొండొండఁ బాటింప నోపువారు,
విలయవహ్నులఁబట్టి వెసదండలుగ గ్రుచ్చి యురమున ధరియింప నోపువారు,
తివిరి సంహారభైరవు నైనఁ బొరివోవ నొకమాత్ర ససిమాల్ప నోపువారు,
కాలచక్రక్రియాఘటనంబుఁ ద్రిప్పి యొం డొకలాగు గావింప నోపువారు,

గీ. ప్రమథవీరులు వివిధరూపములతోడ
హాసన లనుఘనతాపనాద్యలఘుగతులు[?]
వెలయఁ గోటానకోటులు కొలిచి వచ్చి
రతఁడు హరుఁ గొల్వ నేతెంచునవసరమున. (అం) 106

సీ. కఱకుఁ జీఁకటులమూఁకలు నుగ్గునూచగా మఱిచి నూఱక త్రాగునెఱతనంబు
పొట్టేటిరాయని బొళయంబుఁ గదలించి వాహ్యాళిఁ గదలెడువైభవంబు,
క్రతుభాగనులు దెచ్చి కైతప్పు గాకుండ వేల్పుల కందిచ్చువెరవుసొంపు,
మూఁడుమూర్తులు దాల్చి మురువుతో జన్నంపు వేదిపైఁ గొలువుండు
విభ్రమంబు,

ఆ. వె. నీకుఁ జెల్లు నొరుల నీతోడిసాటికిఁ
బేరు గ్రుచ్చి యెన్న లేరు జగతి
వశమె నిన్నుఁ బొగడ స్వాహావధూకుచా
భ్యున్నతప్రకాశ! యోహుతాశ! (అం) 107

సీ. కల్పాంతవార్ధి మోఁకాలిబంటిగ నేయతీశ్వరుఁ డొంటిమైఁ దిరిగినాఁడు?
వటపత్రివీథి నెక్కటియున్నబాలు నే తాపసాధిపుఁడు ము ద్దాడినాఁడు?
తనపేర నేతపోధనమౌళి సుస్థిర స్థితిఁ బురాణంబు సంధించినాఁడు?
హరుని మెప్పించి సంహారకాలుని జయోన్మాద మేమునిరాజ మాన్చినాఁడు?

గీ. కనియె నటువంటిసంయమీంద్రుని మహాత్ముఁ
దనయుఁ డనఁగ నమ్మృకండునిధర్మపత్ని
సహజశివభక్తిరతుని విశ్వప్రసిద్ధు
ననఘకీర్తి మార్కండేయుఁ డనెడువాని. (అం) 108

సీ. జడి వట్టుపడగలు, పడగలమీఁదిచోఁ గదలెడికండ్లును, గండ్ల నడుపు
సూత్రించుజోడును, జోడుపైఁ జరియించు బంట్లును, బంట్లకుఁ బాయరాని
ధనువును, ధనువుతోఁ దగిలినయరదంబు, నరదంబుక్రిందికి నరుగునారి,
నారి నిద్రించుబాణము, బాణ మొదవించు సూతుండు, సూతసంజాతహరులు,

ఆ.వె. గాఁగ నద్భుతార్థకర పదార్థావళి
యుల్లసిల్ల నొప్పుచున్న దిపుడు
త్రిపురహరణకరణవృథదత్తధీరమ
నోరథంబు దేవ! నీరథంబు. (అం) 109

సీ. తల్లిదండ్రులతోడి తగు లొల్ల కుండియుఁ దల్లిదండ్రులతోడితగులు వలచి,
కందర్పుమీఁదియక్కటికంబు సెల్లియుఁ గందర్పుమీఁదియక్కటిక మొదవి,
సంసారకేళి ప్రసక్తిఁ బోఁదట్టియు సంసారకేళిప్రసక్తి గలిగి,
సగుణవిశేషయోజనము ఖ్ఫిటించియు సగుణవిశేషయోజనము మరఁగి,

గీ. సగము పురుషుండు కంజాక్షి సగము గాఁగ
నర్ధనారీశ్వరాకృతి ననువుపఱచి
హరుఁడు తల్లింగమధ్యంబునందు నుండి
హరివిరించుల కంతఁ బ్రత్యక్ష మయ్యె. (ఆం) 110

సీ. దైతేయకాంతల తళుకుఁగెమ్మోవుల వీటికాశ్రీలకు వీడుకోలు,
వేల్పుటిల్లాండ్రక్రొవ్విదపుఁ జన్నులమీఁది యలువుఁబయ్యెదలకు నిలువ నీడ,
విశ్వజగత్త్రియీ విజయలక్ష్మీగాఢ బిరుదోత్సవములకుఁ బెండ్లివిందు,
పరిపంథివాహినీపరిచితపరిభవ ప్రాప్తిసంకటములపాయుత్రోవ,

గీ. సేసి యెయ్యది విలసిల్లుఁ జిత్రమహిమ?
నది ప్రయోగింప నెత్తె నయ్యచ్యుతుండు
విలయసమయసముద్భూతవిపులదహన
దారుణస్ఫూర్తినంబు సుదర్శనంబు. (ఆం) 111

ఉ. నన్నయభట్టుఁ గావ్యరచనావిధిఁ, దిక్కనసోమయాజి న
చ్ఛిన్నమహత్త్వసంవిహితశేముషి, నెఱ్ఱయప్రెగ్గడన్ సము
త్పన్ననవప్రబంధరసభావన, నింపునఁ బ్రార్థనాంజలుల్
మున్నుగ నాత్మలోఁదలఁతు మువ్వుర మువ్వురఁబోలుపుణ్యులన్.[1] (ఆం) 112

సీ. పులినంబుతొలుచూలు పుండరీకాక్షుని యవతారభేదంబు కవులరాజు
బహుపురాణగ్రంథభారతసంహితా పరిగుంభనక్రియాపండితుండు,
కట్టివన్నియవాఁడు కౌరవాన్వయకర్త శ్రుతు లేర్పఱించినసూత్రధారి,
సిద్ధనీవారముష్టింపచాధ్యక్షుండు షకునికూరిమితండ్రి సకలవేది,

గీ. కాళికేయుండు యోజనగంధిపట్టి
తత్త్వనిర్ణేత ఘనతపోధర్మరాశి
నైమిశారణ్యమునిసభాభూమి కెలమి
నేఁగె నొకనాఁడు వ్యాసమునీశ్వరుండు. (ఆం) 113

---

1. నిశ్శంకుని కొమ్మయ శివలీలావిలాసములోనిది.

సీ. పులుఁగురాయఁడు తమ్మికొలఁకులచెలికాని బండిబోయనితోడిపాలివాఁడు,
పన్నగస్త్రీలకు బాలింత్లపసుపావ మగిడింప నోపినమగలమగఁడు,
దంభోళి కొకయాకతాఁకుఁ గానిక సేసి యమృతంబుఁ దెచ్చినయవఘళుండు,
వినతముద్దులపట్టి వనధిచెంగట బోయ పల్లె నాఁకలి గొన్నభవ్యబలుఁడు,
గీ. పక్షములు దాల్చి వచ్చినపసిఁడికొండ
యట్టు విలసిల్లు మేటి వాహనము గాఁగ
నడచె హతశేషదేవసైన్యములు దాను
నసురకులమర్దనుండు జనార్దనుండు. (అం) 114

సీ. పైఁడిచాయలతోడిపక్షసంపుటముల మెలఁగుతేజులతేరు గలుగునతని,
మొకరితుమ్మెదలకు మకరందరసధార లొసఁగుపీఠమునఁ గూర్చుండునతని,
సత్కవీంద్రుల మానసములలో విహరించు కొమరాలి కింపులు గులుకునతని,
దిక్కులు నాల్గింట లెక్క దప్పక యొప్పు నాననంబుల మాటలాడునతనిఁ,
గీ. గనిరి యింద్రానలాంతకదనుజవరుణ
పవనధపసఖేశానపూర్వకము గాఁగ
నమరు లందఱు మధుకైటభాసురేంద్ర
మదవిమర్దకనాభిపద్మజుని నజుని. (అం) 115

సీ. ప్రణవపీఠిక నెక్కి భాసిల్లు నేదేవి యామ్నాయహేమహర్మ్యాగ్రవీథిఁ ?
జరియించు నేదేవి సహజారుణజ్యోతి రానందమూర్తి యై బ్రహ్మనాడి ?
నేదేవి తవణిల్లు నిచ్ఛాక్రియాజ్ఞాన శక్తిభేదమున విశ్వంబు నిండి ?
తోడునీడయుఁ బోలెఁ దులకించు నేదేవి యెల్లకాలంబు విశ్వేశుఁ గూడి ?
గీ. యట్టిదేవి జగన్మాత యఖిలవంద్య
నిఖిలవిద్యాకళేశ్వరి నిత్యమహిమ
నొకటియును శ్రీగళునిక్రేవ నుల్లసిల్లు
నలఘుకల్యాణశుభగాత్రి యద్రిపుత్రి. (అం) 116

## గంగరాజు-చిరుమూరి. [కుశలవోపాఖ్యానము] (ఇ)

క. హరిదాసుని వనవాసునిఁ - బరిచితపరమోపవాసు భాసురహాసున్
సురుచిరనిగమాఖ్యాసున్ - విరచితకాశినివాసు వేదవ్యాసున్. (అం) 117

సీ. పదపద్మరజమునఁ బాషాణపుత్రికఁ బూఁబోఁడిఁ జేసినపుణ్యుఁ డితఁడు,
బాలుఁడై హరధనుర్భంగంబు సీతకు నుంకువ సేయు నిశ్శంకుఁ డితఁడు,
మణిమయంబై యున్న మాయాకురంగంబుఁ గడఁగి చంపినవేఁటకాఁ డితండు,
కట్టాణిముత్యంబుకై వడి మున్నీరు బాణాగ్రమున నిల్పుప్రౌఢుఁ డితఁడు,
గీ. ప్రబలదశకంఠపటుకంఠనిబిడవిపిన
దహనకీలాయమానదోర్దండచండ
చటులకోదండనిర్ముక్తశరనికాయుఁ
డితఁడు గాకుత్స్థవంశాబ్ధిహిమకరుండు. (జ) 118

## గంగాధరుఁడు-కాకమాని. [బాలభారతము] (ఆం)

గీ. అట యుధిష్ఠిరుఁ డప్పంకజాక్షితోడ
ధౌమ్యహితవహ్ని షూమకందళితశిఖలు (?)
మగువఁ గూడిన రాయంచ మధుపశబల
నలినములఁ బోలెను బ్రదక్షిణంబు సేసె. (ఆం) 119

ఉ. ఆంధ్రకవిత్వతత్త్వ సముదంచితకీర్తినిఁ దిక్కయజ్వ నీ
రంధ్రతరప్రభావనిధిఁ బ్రస్తుతిసేయుదు (?) నుల్లస
త్కంధగభీరమంజుతరగర్జితవిభ్రమభవ్యభంగి నై
రంధ్రిక యైనచాటుమధురస్ఫుటబంధురవాగ్విజృంభిగన్. (ఆం) 120

శా. ఆ లజ్జావతి ధౌమ్యుపంపున శిఖివ్యాలోలకీలాలిపై
నోలి న్వేల్చిన లాజరాజి పవనప్రోద్ధూతవారాశివీ
చీలోలోత్థితవిద్రుమాటవి నధిక్షేపించు కట్టాణిము
త్యాలో నాఁ గనుపట్టు నట్టియెడ నందద్రాజహంసంబుగాన్. (ఆం) 121

క. ఇంద్రప్రస్థం బనుపురి - సాంద్రమహేంద్రాశ్మకాంతిసంతతులను ని
స్తంద్రం బై విలసిల్లెను-జంద్రాతపధవళచంద్రశాలాయుత మై. (ఆం) 122

గీ. ఇంద్రమణిజాలకములందుఁ జంద్రముఖుల
వాలుఁగన్నులు యమునయాపత్రములను
మెలఁగి యాడెడువాలికమీ లనంగ
......కనుపట్టు నీపట్టణంబునందు. (ఆం) 123

సీ. కైవార మొనరింతు గంభీరసాహిత్య ఘంటాపథోద్భాసుఁ గాళిదాసు,
వర్ణింతు నుద్వేలవాణీసుధాపూర పాథోధిపరిమాణు భట్టబాణుఁ,
బ్రణుతింతు నుద్దండభాషాసమాక్షిప్త హారబాహుకేయూరుఁ డగుమయూరు,
సన్నుతిఁగావింతుఁ జాటుధారాప్రౌఢి కోమలతాయత్తు సోమదత్తు,

గీ. భక్తినంజలి రచియింతుఁ బ్రవరసేన
భాస శివభద్ర భవభూతి భట్టహర్ష
భారవి మురారి హేరంబ చోరులకును
మఱియుఁ దక్కినసుకవుల మదిఁ దలంతు. (ఆం) 124

శా. క్రీడాలోలత దంతకోరకశిఖం గీలించి భూచక్రమున్
గ్రోడగ్రామణి మించి యెత్తి ఫణు లత్యుగ్రానుమోదంబునన్
జూడాభోగము లెత్తి చూడఁగ దిశాశుండాలరాణ్మండలిన్
వ్రీడం బొందఁగఁ జేయుదంతిముఖు నిర్విఘ్నార్థమై కొల్చెదన్. (ఆం) 125

శా. చంచత్కేళిసర స్తటీమరకతచ్ఛాయాకదంబంబు గ్రో
మ్మించుల్ సోఁకినఁ దమ్మి లిమ్ములను గిమ్మీరంబు లై యుంట సం
ధించున్ వాసనఁ జంచరీకములు మందీభూతసందేహతన్
సంచారించుచు నల్లకల్వవిరులన్ ఝుంకారళంకారులై. (ఆం) 126

శా. ధారాపాతవిభాతిశీతకరకాంతస్ఫారగేహంబు లీ
యూరం జంద్రిక మీఁదఁ బర్వ నురువున్ [?] వ్యూఢాంబుధారాతతిన్
జేరున్ జాతకపంక్తి చిత్తములు రంజిల్లన్ మయూరంబులున్
సారస్యంబుల లాస్యము ల్మెఱయు నుత్సాహించి భూపాలకా! (ఆం) 127

సీ. పురుహూతవిస్ఫూర్తి భూమండలం బెల్ల భుజవిటంకంబునఁ బూనినాఁడు,
గీర్వాణదుర్వారుఁ గేళిదానవుఁ గొట్టి విజయలక్ష్మియుక్తి వెలసినాఁడు,
లచ్చినెచ్చెలికాని లలితోరుపీఠికఁ బొడమినపూఁబోఁడిఁ బొందినాఁడు,
నవయుగద్వీపభూనాథచూడారత్న మిత్రశాసనలీల మెఱసినాఁడు.

గీ. విమలకీర్తిమందాకినీవీచినికర
పూరపాతాళమర్త్యవిబుధనివాసుఁ
డై కరం బొప్పు సోమాన్వయప్రభుండు
చారుకీర్తి పురూరవశ్చక్రవర్తి. (ఆం) 128

శా. మత్తారాతిమహాంధకారపటలీమార్తాండుఁ డుద్ధాటికా
దత్తోద్యత్తురగావళీఖురపుటోత్పన్నక్ష్మాధూళికా
యత్తాంభోధి యయాతిఁ జెప్పఁ దగు నుద్యద్వజ్రధారాప్రభా
జిత్తేజున్ సితకీర్తికైతకదళశ్రీనూతనాంభోదమున్ (ఆం) 129

గీ. వరుఁడు కెంగేల నక్కన్యచరణపుటము
సన్నెకంటిపై నిడ నొప్పె శత్రుయువతి
చూడమాణిక్యములమీఁదఁ గూడఁ జేయు
లీలఁ బ్రకటింపఁ బూనినకేళి మెఱయ. (ఆం) 130

క. శబ్దార్థరసవిశారదు
శాబ్దికమూర్ధన్యు శబ్దశాసనబిరుదున్
శబ్దాయమానవిస్ఫుర
దబ్దఘటారభటి నన్నపార్యునిఁ దలఁతున్. (ఆం) 131

శా. శ్రీరామాయణకావ్యకల్పనవిరించిన్ వేదఘంటాపథో
ద్ధార ప్రౌఢమనీషిసర్గమునిమార్తాండున్ దపఃకీర్తిల
క్ష్మీరమ్యున్ భువనైకవంద్యుఁ డగువాల్మీకిం గవిగ్రామణిన్
ధారాళస్థిరభక్తియుక్తిఁ దలఁతున్ దత్త్వజ్ఞచూడామణిన్. (ఆం) 132

శా. సంసారార్ణవపారగుం బరమహంసవ్రాతచూడాపదో
త్తంసంబున్ శ్రుతిసంకరోద్ధళనపాథఃక్షీరభేదక్రియా
హంసంబున్ జగదేకవంద్యు జలదశ్యాము న్మహాపాతక
ధ్వంసాభారతు భారతామృతనిధిన్ వ్యాసున్ బ్రశంసించెదన్. (ఆం) 133

## గణపయ-రాయసం. [సౌగంధికాహరణము] (ఆం)

శా. అంతంతం గబళింపఁగాఁ గడఁగె బాలార్కున్ ఫలభ్రాంతి, వే
శంతోల్లంఘనకేళి దాఁటెను సరస్వంతున్, మహాదానవా
క్రాంతారామమహీరుహంబుల నుదగ్రక్రీడఁ ద్రుంచెన్, హనూ
మంతుండున్ గపియు న్నవిం గపులె సామాన్యాటవీచారముల్ ? (ఆం) 134

## గౌరనకవి - [నవగ్రహస్తవము] (జ)

ఉ. మ్రొక్కులయిక్క కాంతిగలముప్వురు వేల్పులమూర్తి చీఁకటిన్
మెక్కెడిమిత్తి పద్మములమేలు నవగ్రహరాజు మింటిపై

నెక్కుడుమానికంబు దినమేలిక సింహవిభుండు ముక్తిపెన్
జక్కర యిందుమిత్రుఁడు ప్రసన్నత మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్ (జ)135

చ. హరుతలపూ చకోరములయామని పాల్కడలుబ్బుమందు శ్రీ
వరునిమఱంది తారకలవల్లభుఁ డిందిరతోడఁబుట్టు వం
బురుహముదాయ కల్పలతప్రోది యనంగునిమామ జీవిభుం
డరయఁగఁగర్కటేశుఁడమృతాంశుఁడుమాకుఁబ్రసన్నుఁడయ్యెడున్.(జ)136

## చంద్రమౌళి — [హరిశ్చంద్రకథ] (జ)

చ. అలసత టొంకు నాస్తికత యాయతచింత యయుక్తికారితా
కలనము దీర్ఘసూత్రము వికాసముఁ బొందమి దుర్వ్యయంబు పె
ల్లలుక నిరర్థకార్యరుచి యర్థమతచ్యుతి మంత్రహాని ప్రా
జ్ఞులవెలి శాంతసౌమ్యకృతిశూన్యత నా నివి రాజదోషముల్. (జ) 137

## చిక్కయ — చందలూరి [నాసికేతోపాఖ్యానము] (ఆం)

సీ. అమృతోపమానంబు లగునన్నములతోడ బహువిధశాకసూపములతోడఁ,
బాయసాపూపజాంబాలి కంబులతోడ విమలహయ్యంగవీనములతోడ,
షాడబంబులతో రసావళ్ళతోడను ఘనశర్కరాపానకములతోడఁ,
గదళికాద్రాక్షాది మృదుఫలంబులతోడ వడియాలతోడఁ బచ్చడులతోడఁ,

గీ. బ్రకటముగ దుగ్ధమథితతక్రములతోడఁ
బ్రియము దళుకొత్త షడ్రసోపేతముగను
భాసురంబుగ నారగింపంగఁ జేసె
నారఘుక్షోణివిభుఁడు బ్రాహ్మణుల నెల్ల. (ఆం) 138

సీ. ప్రాలేయకిరణబింబస్ఫూర్తిఁ దలఁపించు విశదంపుఁదనుకాంతి దిశలు ప్రాఁక,
జిగి నిండఁ దొలఁకెడుచిగురుటాకులసొంపు వాటించుఘనజటాభరము
మెఱయఁ,
గాంచనమౌంజీవికాసంబు గెడగూడి చెఱవు సూపుచు మృగాజినము దనరఁ,
గమనీయకోమలకరపయోరుహమునఁ బ్రకటితం బగువిపంచిక దలిర్ప,

గీ. హరికథాలాపశోభిత మైనయట్టి
యాననమ్మ ప్రసన్నత నలరుచుండ

గగనముననుండి సమవర్తి కడకు వచ్చె
నమరసంయమివరుఁడు విద్యాగురుండు. (ఆం) 139

సీ. బహువిధపరిమళభరితోదకంబులఁ జెలువంబు శోభిల్ల జలకమార్చి,
నిండారుపండువెన్నెలసోయగము నవ్వు పసిఁడికమ్మిలవెల్లపట్టుఁ గట్టి,
కబరిభారంబునఁ గన్నెచెంగలువలు పసమీఱఁ గొనలు దోఁపంగఁ జెరివి,
తీండ్రించు పసిఁడిదీధితులచే నమరెడు నవరత్నమయభూషణములు దొడిగి,
గీ. మృగమదము గుంకుమంబును మేళవించి
గంధసారంబు మైదీగెఁ గలయ నలఁది
శ్రీలు మెఱయంగఁ బరిణయోచితము గాఁగ
సఖులు కై సేసి తెచ్చిరి చంద్రముఖిని. (ఆం) 140

సీ. రాజితరత్నదర్పణతోరణంబులఁ గడుశోభితము లై నకలువదముల,
మానితకనకరంభాస్తంభపంక్తుల భాసురోజ్జ్వల పతాకాసమృద్ధి,
నిర్మలస్ఫురితమాణిక్యకుంభంబుల మెం డై నచిత్రంపుమేలుకట్లఁ,
బ్రకటిననూత్నమౌక్తిక రంగవల్లుల రమణీయపరిమళద్రవ్యసమితిఁ,
గీ దనరు నగరంబు నుతనిరంతరవిభూతి
నతిశయంబుగఁ దగ నలంకృతు లొనర్చి
బహుపదార్థంబు లొడఁగూర్చి పరిణయమున
కాయితము సేసి రంత వా రనుపమముగ. (ఆం) 141

సీ. లక్ష్మిఁ గొల్లాపురి లంక శాంకరి విశాలాక్షిఁ గాశికను వింధ్యమున దుర్గఁ,
గన్యఁ గన్యాకుబ్జఁ గామరూపంబునఁ గామాక్షిఁ గాంచిని గామకోటి
మండలిఁ బుంద్రక మాణిక్య దక్షవాటమున నార్యావర్తకమునఁ ద్రిపుర,
జాలంధరంబున జ్వాల హేమచ్ఛత్రపురి మహాయోగ శ్రీగిరిని భ్రమర,
గీ. విరజవిరజహుంకృతిపీఠ(?) సింహ
ళమున నరసింహికను గాశ్మిరమున వాణి
నుజ్జయిని మహాకాళిని నున్నతముగఁ
జూచువారలు జముపురిఁ జూడ రెందు. (ఆం) 142

సీ. వర్ణితప్రాకారవప్రరత్నప్రభావ్యూహకిమ్మీరితవ్యోమతలము,
వివిధవాదిత్ర భైరవరావపూరిత ప్రవిమానతరదిశాభాగసమితి,

బహుళదంతావళప్రాలంబఘంటికాటంకృతోల్లాసిఘంటాపథంబు,
కమనీయరూపరేఖాకళావిభ్రమప్రకటితాజ్ఞానారత్నపేటి,
గీ. సహజధర్మార్థకామమోక్షప్రసిద్ధి
సన్నుతౌదార్యఖేలనాజన్మభూమి
సకలసంపద్విలాసవిస్తారహసిత
రాజరాజపురంబు వారణపురంబు. (ఆం) 143

## చౌడయ్య-గంగరాజు. [సాముద్రికశాస్త్రము] (జ)

క. ఉదరంబు దర్దురోదర
సదృశం బై జఘన మతివిశాలం బైనన్
సుదతీరత్నంబున క
భ్యుదయంబుగ ధరణి యేలుపుత్త్రుఁడు పుట్టున్. (జ) 144

క. కడు నిడుదయుఁ గడుఁ గుఱుచయుఁ
గడు పలుదయుఁ గడుఁ గృశంబుఁ గడు నల్లనిదిన్
గడు నెఱ్ఱని దగుమెయి గల
పడతిఁని గీ డనిరి మునులు వరమునిచతితా! (జ) 145

## చౌడయ్య-గంగరాజు. [నందనచరిత్ర] (ఇ)

సీ. కురులు వ్రాయుటయు గొదమతుమ్మెద లయ్యెఁ గన్నులు వ్రాయంగఁ
గలువ లయ్యె,
నధరంబు వ్రాసిన మధురబింబంబయ్యె గళమువ్రాయుటయును గంబువయ్యెఁ,
జనుగవ వ్రాసినఁ జక్రవాకము లయ్యెఁ జేతులు వ్రాసినఁ జివురు లయ్యె,
నడుము వ్రాయుటయును నవలత యై యొప్పెఁ బొలుపాతఁ గటి
వ్రాయఁ బులిన మయ్యెఁ.
గీ. దరుణితొడలు పాదతలములు వ్రాసినఁ
గరికరములు హల్లకములు నయ్యె
నేమి వ్రాయఁ దలఁచి యేమి వ్రాసితి నని
మదనవిభ్రమమున మనుజవిభుఁడు. (జ)146

1. "ఒకటి కొకటి యాస నుండ" - చూ. అన్నమాచార్యుని శృంగారసంకీర్తనము (15-70)

క. కులమున బలమునఁ జలమునఁ
నలవునఁ గార్యమున సదృశు లగువారలతో
బలమి యుడిగి సామముగాఁ
దలకొని చేయునది నీతితత్త్వజ్ఞులకున్. (జ) 147

గీ. దొడ్డము త్తియంబు తోరంపుఁబటికంబు
వెండిగుండు మొల్లవిరులచెండు
రసముగుళిక కప్పురంబునకరుడు నా
సొంపు మిగిలి వేగుఁజుక్క వొడిచె. (ఆం) 148

సీ. బచ్చెనయోవరి బంధాలమేల్కట్టు సకినలమంచంబు జమిళిపఱుపు,
నిలువుటద్దము హరినీలపుగద్దియు పటికంపుగిండి పొంబట్టుసురఁటి,
పసిఁడిపావలు వెండిపడిగంబు ముత్యంపు జాలవల్లిక కెంపుసానతాయి,
పగడంపుదివియకంబము వజ్రములతట్ట మరకతమయ మసుమధువుకుడుక
ఆ.వె. గరిగె పోఁకయొత్తు బరణి సున్నపుఁగ్రోవి
కప్పురంపుఁబెట్టె గాజుకోర
తనువు నునుపు గలుగుతడి యొత్తుమడుఁగులు
నాది యైనవాని నలవరించి. (ఆం) 149

చ. ముదిమికి మందు వాక్కలిమి (?) ముంగలిజిహ్వ తపఃఫలంబు స
మ్మదమునివాస మింపుగని పూరవికారముప్రోది కామినీ
వదనవిభూషణంబు జనవశ్యము హాస్యరసాబ్ధి లాస్యసం
పదయుదరస్థలంబు మధుపానసుఖంబు జగత్త్రియంబునన్. (ఆం) 150

గీ. వికసితం బైనమోమున వెండికోరఁ
గదిసి మధు వొక్కయెత్తున సుదతి కొనిన
మగువమొగ మచ్చునను శశిమండలంబు
చెలువముగఁ జేయఁ బెట్టింపఁ జేర్చినట్లు. (ఆం) 151

ఉ. వెన్నెలరూపుకప్పురపువేలుపువజ్రపుబొమ్మలెల్లఁ దాఁ
బన్నిన నొప్పులెప్ప మనఁ బంకజమధ్యమునందుఁ బొల్చి క్రేఁ
గన్నుల బ్రహ్మఁ జూచి చిబుకం బలికించు నున్నవాణి యు
ద్యన్నవశబ్దభావరసతత్త్వము మత్కృతి కిచ్చు నెప్పుడున్. (?) (ఆం) 152

శా. సారాచారవిచారు నుత్తమకులున్ సౌజన్యధన్యున్ కృపా
పారున్ శూరు వికారదూరు ననఘున్ గంభీరు ధీరున్ మహో
దారున్ భవ్యు సమస్తకార్యవిదు నాప్తప్రాప్తు సర్వేంగితా
కారజ్ఞున్ హితు మంత్రిఁ జేసి పతి సౌఖ్యం బందుచుండం దగున్. 153

## తిక్కన—[విజయసేనము] (ఇ)

సీ. అరిమానసమ్ములు దరికొని యేర్చు నెవ్వనియుజ్జ్వలాకారవైభవంబు?
బుధుల లజ్జానతిఁ బొందునట్లుగఁ జేయు నెవ్వనిపాండిత్య మెసక మెసఁగ?
నేవదాన్యుల నైన నెవ్వని వితరణంబులు వంది (జనుల) చాపల మొనర్చు?
వనితాజనముమానధనముఁగోల్పుచ్చు విచ్చలవిడి నెవ్వానివిలసనంబు
గీ. అట్టివిజయసేను నభిరామమూర్తి వి
ద్యానిరూఢమతి వదాన్యవరుఁడు
మధురవిభ్రమైకనిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణసమగ్రుఁ డగుట. (జ) 154

ఉ. అల్లనఁ దొండ మెత్తి శివునౌదలయేటిజలంబు వుచ్చి సం
పుల్లతఁ బాదపీఠకముపొంతన యున్నసహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోక్షణ సేయునట్లు శో
భిల్లుగజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్. (అం) 155

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల నజేయుండై పరీక్షించినన్
దిత్సావ్యగ్రుఁడు గాక విగ్రహముచో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యము దెసన్ బ్రారంభియై భూప్రజా
నాత్సల్యార్ద్రమనస్కుఁడైన (పతి) శశ్వద్వృద్ధిసమేతుం డగున్. (జ) 156

క. కిసలయకదళీబిసబిం
బసుధాంశుప్రాయవస్తుబహువిధరూపో
ల్లసము మద ముడుప నజుఁ డొక
యసమాకృతిఁ దార్చె ననఁగ నంగనయొప్పెన్. (జ) 157

చ. కొనియెద మన్న బందరులు కోటుల కమ్మ్రదు; రమ్మఁ బూని తె
చ్చినసర కెంతపెద్దవెల చెప్పినఁ గొంద్రు తగంగ నిచ్చి; న
చ్చినవెలతీర్చి లక్ష్మి తమచెప్పినయట్టులచేయుసొంపు పే
ర్కొన గణుతింపరాదు:పురికోమటులం బ్రణుతింప నొప్పదే? (జ) 158

శా. గీర్వాణాచలసాను వాత్మరదన క్రీడాహతం బైన న
య్యుర్వీరంధ్రమునం దనంతఫణరత్నోద్యత్ప్రభ ల్పర్వి దృ
క్పర్వం బై పొది గట్టి పేర్చిన మదిం గంజంబ యంచున్ కన
ద్గర్వోన్మీలితనేత్రుఁడై మెఱయు వేదండాననుం గొల్చెదన్. (ఆం) 159

చ. తరుణుల వీఁగుఁజన్నుఁగవతాఁకున మన్మథచక్రవాకబం
ధురగతిలీలఁ గామినుల తోరపుటూరుల ఘట్టనంబులన్
కరివరహస్తకాండపటుఘట్టనలన్ బరిఖాతరంగముల్
దిరుగడువడ్డతీరములఁ దెట్టువుగట్టు సరోజరేణువుల్[1]. (జ) 160

సీ. పద్మంబులును వప్రపద్మరాగప్రతి బింబములునుతగ బెరసి మెఱయఁ,
గల్లోలములును రంగన్మకరాయిత తుండములును నటు తొట్రుపడఁగ,
బిసములు విహరణరససమాగతరసాతల నాగశిశువులు చెలిమి సేయఁ
జక్రయుగ్మంబులు జలకేళిలోలనితంబినీ స్తనములు తడఁబడంగ,

ఆ. వె. సొంపుమీఱినట్టి పెంపును గంభీర
తయును బరపు (బోవు) వేడ్కఁ దగిలి జనులు
సంస్తుతింప నఖిల సన్నివేశస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు. (జ) 161

క. పరధనపరాంగనాజన – పరిహారము పరమధర్మపథ మందురు స
త్పురుషులు మఱవక వీనిం – బరికింపుము వినకు మెపుడు పైశున్యంబుల్
(జ) 162

సీ. మదనవశీకారమంత్ర దేవత దృష్టి గోచరమూర్తిఁ గై కొనియె నొక్కొ?
సితకరబింబనిస్సృతసుధాధార ని తంబినీరూపంబుఁ దాల్చె నొక్కొ?
విధికామినీసృష్టివిజ్ఞానపరసీమ భాసురతనులీలఁ బడసె నొక్కొ?
శృంగారనవరసశ్రీవిలాసోన్నతి సుందరాకారంబు నొందె నొక్కొ?

ఆ. వె. కాక యొకవధూటికడుపునఁ బుట్టిన
భామ కేల యిట్టిరామణీయ
కంబు గలుగు ననుచుఁ గన్నియపై మహీ
పాలసుతుఁడు దృష్టి పఱపె నర్థి. (జ) 163

---

1. చూ. నిర్వచనోత్తర రామాయణము.

ఆ. వె. మహిమ చెడదు స్వామ్యమాత్య సుహృత్కోశ
రాష్ట్ర దుర్గ బలపరాయణులకు
నీవు నిదియు నెఱిఁగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రనిపుణ ! (జ) 164

## తిప్పరాజు—కుడిచెర్ల. [కాంచీమాహాత్మ్యము] (అం)

గీ. అరుణమణిదీప్తు లంతంత నతిశయిల్ల
విమలశశికాంతరోచులు విస్తరిల్లఁ
గావ్యబుధగురుసంగతి గలిగి పురము
సూర్యసోమవీథులు కడు సొంపు మిగిలె. (అం) 165

గీ. కనకభూధరశిఖరానుకారు లగుచు
నా పురంబున నొప్పారు గోపురములు
సంతతాధ్వగమనపరిశ్రాంతు లైన
చంద్రసూర్యులవిశ్రమస్థలము లట్లు. (అం) 166

మ. జలదగ్నిప్రథమానతేజుని భరద్వాజున్ వినిర్ధౌతవ
ల్కల భాస్వత్పరిధానుఁ బింగళజటాలంకారుఁ గృష్ణాజినో
జ్జ్వలసంవ్యానుఁ దపఃకృశీకృతతనున్ శాంతాత్ము బ్రహ్మైకని
శ్చలచిత్తున్ విజితేంద్రియున్ బ్రముదితస్వాంతున్ గృపావంతునిన్.(అం)167

సీ. పద్మరాగప్రభాభాసురపటల మకాలసంధ్యారాగలీలఁ బెనుపఁ,
గాశ్మీరకనకనిర్గతదీప్తి యసమయ బాలాతపస్ఫూర్తిఁ బరిఢవింప,
హరినీలరుచులు గస్తురిప్రోవులును ననారంభనీలాభ్రవిభ్రమముఁ జేయ,
వజ్రమౌక్తికహిమవాలుకాదీప్తులు నిర్నిశాచంద్రిక నిర్వహింపఁ,
గీ. జతురబహువర్ణపట్టువస్త్రప్రభాతి
నిర్జలదజాలసముదీర్ణనిర్జరేంద్ర
చాపలక్ష్మి రచింపఁ బ్రశస్త (దీప్తి)
(వి)తతి నొప్పారు నప్పురి విపణివీథి. (అం) 168

సీ. మహనీయతరయాజమానమంత్రంబులు జపియించుముఖచతుష్టయము దనరఁ,
బావననవనీత పరిలేపనంబున మెఱుఁగెక్కియున్న క్రుమ్మెనను వెలుఁగ
బహుచిత్రమృదుసూక్ష్మపక్ష్మశోభితమైన హరిణాజినోత్తరీయంబు మెఱయ,
శ్రీవత్సలాంఛనశ్రీమూర్తిచింతన సంభృతానందబాష్పములు దొరుగ,

గీ. శారదాదేవి, సావిత్రి, శ్రద్ధ, తుష్టి,
మతియుఁ, గుణసూత్రకాంచిదామములు వెట్ట
నెమ్మిఁ గొలువంగ దర్భాసనమ్ముమీఁదఁ
జూడ నొప్పెఁ బితామహసోమయాజి. (అం) 169

ఉ. సహ్యముఁ గాంచె వాణి వనసైరిభ సామజ సింహ గండకా
సహ్యము సిద్ధసాధ్యసురచారణకిన్నరసన్మునీశ్వర
గ్రాహ్యము శృంగసంశ్రితకిరాతవధూశ్రుతదివ్యయోషిదై
తిహ్యము నగ్రభూసుఖితతిగ్మమయూఖరథౌపవాహ్యమున్. (అం) 170

## తిమ్మయ–కుంటుముక్కల. [శైవాచారసంగ్రహము] (ఆం)

సీ. కపిలవర్ణముగోవు కడు నొప్పు నంద నా జనియించెఁ దద్గర్భమున విభూతి,
నల్లనిమొదవు వర్ణన కెక్కు భద్ర నాఁ దద్గర్భమున భసితంబు పుట్టె,
నెఱ్ఱనిధేనువు నేపారు సురభి నాఁ గలిగె భస్మంబు తద్గర్భమునను,
పొగ(డ)చాయ గలయావు పొలుచు సుశీల నా క్షారంబు గలిగెఁ దద్గర్భసరణిఁ
గీ. చిత్రతరవర్ణరుచులు ప్రసిద్ధిఁ దాల్చు
గిడ్డి సుమనోభిధాన మంగీకరించుఁ
బ్రభవ మొందెఁ దదీయగర్భమున రక్ష
పంచ ముఖముల నిట్లుద్భవించె భూతి. (అం) 171

## త్రిపురాంతకుఁడు – రావిపాటి. [అంబికాశతకము] (ఇ)

ఉ. ఆదిమశక్తి యీతరుణి యాద్యకుటుంబిని యీకుమారి ము
త్తైదువ యీతలోదరి చిదాత్మిక యీసతి విశ్వమాత యీ
పైదలి సర్వలోకగురుభామిని యీచపలాక్షి యంచు బ్ర
హ్మాదులు వచ్చి నిచ్చలు హిమాద్రికినిన్నెఱిఁగింతు రంబికా ! (అం) 172

ఉ. కూడెడు వెంద్రుకల్ నిడుదకూఁకటఁ బ్రోవుగ బొడ్డుపై వళుల్
జాడగఁ దోఁపఁ గ్రొమ్మొలకచన్నులు మించ దలిర్ప సిగ్గునన్
జూడఁగ నేరముల్ మెఱుఁగు జూపుల నీన హిమాద్రి యింట నీ
వాడుటశాలికిన్ మనమువాడుటగాదె తలంప నంబికా ! (అం) 173

ఉ. భారతి వై సరోజభవుపాల వసించి రమావధూటి వై
నీరజనాభుఁ జెంది ధరణీధరనందన వై మహేశ్వరుం
గోరి వరించి తమ్మ ! నినుఁ గొల్వక యూరక యేల కల్గు సం
సారసుఖంబు లీమనుజసంతతికిం దలపోయ నంబికా ! (జ) 174

## త్రిపురాంతకుఁడు — [ఉదాహరణము] (ఇ)

ఉ. పాములు హారముల్ నెలయుఁ బాపటసేసయు నేలు మల్లికా
దామము తోలు దువ్వలువు దట్టపుబూదియుఁ జందనంబు మై
సామునఁ జాల నందముగ సన్నిధి సేసినజాడఁ గంటి నే
నామదిలోఁ గుమారగిరినాథుని శైలసుతాసనాథునిన్. (ఇ) 175

## త్రిపురాంతకుఁడు — [తారావళి] (జ)

మ. అమితధ్వాంతతమాలపల్లిలవనవ్యాపారపారీణదా
త్రమొ సౌగంధికషండకుట్మలకుటీరాజీసముద్ఘాటన
క్రమనిర్వాహధురీణకుంచికయొ నాఁగం బెంపున స్నికళా
రమణీయత్వము చూడ నొప్పెసఁగుఁ జంద్రా ! రోహిణీవల్లభా ! (జ) 176

మ. చరమక్ష్మాధరచారుసింహముఖదంష్ట్రాకోటియో నాఁగ నం
బరశార్దూలనఖంబు నాఁగఁ దిమిరేభప్రస్ఫురద్గర్వసం
హరణక్రూరతరాంకుశం బనఁగ నుద్యల్లీల మీరేఖ ని
త్యరుచిన్ బోల్పఁగఁ బెంపగున్ విదియచంద్రా ! రోహిణీవల్లభా! (జ) 177

మ. పొలకయ్యంబులఁ గల్గుముద్దుటలుకన్ బుష్పాయుధారాతి క్రొ
మ్ముక్కాలఁ దీర్పన్ దలమీఁదఁ గాన నగునీ క్రుమ్మేన పుణ్యాంగనా
తిలకం బైనభవానిపాదినఖపంక్తిం జెంద డెందంబులోఁ
దలఁతా చుక్కలతోడిమక్కువలు చంద్రా ! రోహిణీవల్లభా ! (జ) 178

మ. రతినాథుం డనుమాయజోగి చదలం బ్రైలోక్యవశ్యాంజనం
బతియత్నంబునఁ గూర్చి మౌక్తికమయం బైయున్న పాత్రంబునన్
మతకం బేర్పడఁ బెట్టి దాఁచెనన నీ మధ్యంబునన్ మచ్చ సం
తతమున్ గన్నులపండు వై వెలయుఁ జంద్రా ! రోహిణీవల్లభా ! (జ) 179

## దుగ్గన — దగ్గుఁబల్లి. [నాసికేతోపాఖ్యానము] (జ)

సీ. పాండ్యకేకయచోళబర్బరపాంచాలబంగాళలాటనేపాళగౌళ,
గాంధారసౌవీరకాంభోజకాశ్మీరహేహయాభీరబాహ్లీకవిదేహ,
మగధమద్రవిదర్భమాళవకేరళాశ్మంతకకుంతలమత్స్యవత్స,
కరహాటవరహాట కర్ణాట శకలాట కుకురకోసలకళకురుకరూశ,
గీ. సుహ్మసౌరాష్ట్ర ఘూర్జరశూరసేన
చేదిసింధుయుగంధరచేకితాన
యవనబహుధానమలయాలకాంగవంగ
తెంకణాంధ్ర కళింగాది దేశములకు. (జ) 180

## దుగ్గన—దగ్గుఁబల్లి. [శివకాంచీమాహాత్మ్యము] (ఆం)

సీ. క్షోణీ నఖంబులు సూత్రించిన ట్లింద్రచాపంబు చాప మై సంఘటింప
బ్రహ్మాండకాంతంబు పగిలించుగర్జలు సింహనాదస్ఫూర్తిఁ జేయుచుండ,
సౌదామనీదామజాలము ల్దిక్కుల స్వప్రతాపానలజ్వాలలుగను,
నాహార్యహరణోద్యతశనిసంఘంబులు దివ్యాస్త్రవితతులై తేజరిల్ల,
గీ. నాశుశరవృష్టిశరవృష్టి నఖిలలోక
బాధకోద్గ్రీష్మభీష్మసంతప్తతాప
మార్చె నర్జునాయుత శిఖండ్యధికబద్ధ (?)
నాఖ్యవర్షర్తు నారాయణాఖ్యమూర్తి. (ఆం) 181

సీ. బంధూక మెఱమించెఁ బరపయ్యె గేదంగి కడిమి పుష్పితమయ్యె గ్రంథి పూచె,
నర్జునం బలరారె నరవిందములు కేరె భూస్థలి నేఱులు పుక్కిలించె,
గండూపదములుబ్బెఁ గలఁగె హంసచయంబు నటియించెఁ గప్పలు నమిలి చెలఁగెఁ,
జాతకంబులు మించె సాగరం బెదయించె హరిగోపములతోడ నాడె లేళ్ళు,
గీ. మత్తభృంగంబులకుఁ దేనె తిత్త యయ్యె
గండుఁగోయిల కూఁతలు గట్టుకొనియె
చూలుకొన స్వాతి చూటిఁబొదువ(?)
విష్ణునకు నిద్రపోయెడువేళ యయ్యె. (ఆం) 182

## దేచిరాజు-రాపరది. [గ్రంథమేదో?] [ఆం]

మ. ఘనవప్రోపరిభాగకేతుకషణన్ గంజారిబింబంబు కం
దిన దంచున్ బురిముగ్ధభామినులు ప్రీతిన్గంటు వోఁ దోమఁ జం
దన మర్థింగొని లీల నీలరుచిమత్కాంతోరుహర్మ్యంబు లె
క్కిన నంభోదతటిల్లతావితతిమాణిక్కం బొల్తు రుద్యద్గతిన్. (ఆం) 183

## దేవరాజభట్టు-[హరిశ్చంద్రకథ.] (ఆం)

ఉ. అంబుధు లాలవాలము దిగంతము లాకులు కూర్మశేషవ
క్ష శృంబులు కందమూలములు చక్రపుఁగొండలు కోట నాఁగ హ
ర్షంబున విష్ణువిగ్రహకుజంబునఁ జుట్టి పెనంగి మిన్ను పు
ష్పంబుగ నబ్జజాండ మనుపండును బండు ధరిత్రి వల్లియై. (ఆం) 184

చ. సురనిచయంబు ద్రోచి నహుషుం డటు తేలకయున్న రాక్షసు
ల్వారుసల వచ్చి చూఱకొని వాసవు పెట్టికిఁ బట్టుకున్న శ
ర్వరిఁ గనుమూయఁ గన్నఁ ద్రిదివం బనునాఱడి సల్పుజీవ మై
యరుగక భూమి నున్న నమరావతి యీ దగు నయ్యయోధ్యకున్. (ఆం) 185

## నరసింహభట్టు - ఆమదూరి. [షోడశరాజచరిత్ర] (జ)

శా. జంఘాలప్రతిభాను లార్షకవితాసంఘాతు లాశుక్రియా
సంఘస్రష్టలు సంఘశఃకలశజుల్ సాహిత్యసర్వంకషుల్
సంఘర్షార్హులు కాక కాకవులు లక్ష్యంబే హాతిగ్రామఘా
ణంఘస్త్యైకశరణ్యబల్బజ[?]నిబంధల్ మత్కటాక్షేక్షకున్[?] (జ) 186

## నాగనాథుఁడు-పశుపతి. [శ్రీవిష్ణుపురాణము] (ఆం)

ఉ. మాసర మయ్యె నంత మధుమాసము పాంథవిలాసినీజన
త్రాసము పుష్పబాణనవరాజ్యవిలాసము వల్లరీవధూ
హాసము మత్తకోకిలసమంచితపంచమనాదమంజిమ
వ్యాసము జీవలోకహృదయంగమసౌఖ్యవికాస మెంతయున్. (ఆం) 187

## నన్నిచోడఁడు - [కళావిలాసము] (జ)

క. తలపోయఁగ రుచు లాఱును
గలుగును వాతంబుఁ గ్రిమియుఁ గఫముం జెడు నాఁ

కలి పుట్టు దగయుఁ జెడుఁ ద
మ్ములము పదార్థంబు రాగమూలము ధరణిన్. (జ) 188

చ. తొడవులు పెట్టి సంభ్రమముతోఁ దిలకించు మడుంగు గట్టుఁ బై
పడఁ దడ వోప దిం పెఱిఁగి పట్టను నేర్పులు గట్టిపెట్టుఁ బ
ల్కఁడునెడఁ దొట్రుపా టొదవుఁ గింకకుఁ జెంగిలు, మేన్ సెమర్పఁగాఁ
జిడిముడిఁ బొందుఁ గాంత పతిఁ జేరినఁ గూరిమి గల్గె నేనియున్. (జ) 189

సీ. పృథులవిశ్వంభరారథమున కెదురుగాఁ బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు?
కాంచనాచలకార్ముకమునకు సాటిగాఁ జేపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు ?
నవిహతపాశుపతాస్త్రమ్మునకు వాఁడి మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు ?
నతులితామరదానవాదిబలంబుల గెలిపించె నెవ్వఁ డయ్యళిబలంబు ?

గీ. నట్టిజగజెట్టి మన్మథుం డఖిలలోక
ములకు వెఱగొంగ జీవులమూలకంద
మతనియిలు సొచ్చి వెడలనియతఁడుఁ గలఁడె ?
యతనియమ్ములనుఁ బడకున్న యతఁడుఁ గలఁడె ? (జ) 190

క. శ్రీమంతుఁడు గుణవంతుఁడు
ధీమంతుఁడు రూపయుతుఁడు ధీరుండు కళా
ధాముండును గావలయును
దా మహిఁ గాముండు కామతంత్రవివేకి ! (జ) 191

## పద్మకవి - [జినేంద్రపురాణము] (అం)

సీ. హరినిలయంబును హరినిలయంబును విషధరాఢ్యంబును విషధరాఢ్య,
మప్సరోమయమును నప్సరోమయమును వనవిలాసమును బావనవిలాస,
మున్నతకరిశృంగ మున్నతకరిశృంగ మిందుకాంతస్రవ మిందుకాంత,
మురుకలనకులంబు నురుకలనకులంబు నంశుకాంతద్యోతితాంశుకాంత,

గీ. మొనర నవశతసాహస్రయోజనోన్న
తమును బదివేలుయోజనా లమరువలము
గలిగి కనకాద్రి కిన్మూటఁ గలిగి తనరి
ప్రథిత మై యొప్పు మందరపర్వతంబు. (అం) 192

## పెద్దిరాజు — పొన్నాడ. [ప్రద్యుమ్నచరిత్ర] (ఇ)

సీ. అమృతంబులోనికందంతయుఁ బోఁదోమి కౌన పూర్ణచంద్రుండు దనరెనేని,
విధుమండలంబున విధిచేత దళవంబు [?] గని పూవుఁదూపులు గ్రాలెనేని
శృంగారరససరసీజాతు లైనకో మలమృణాళంబులు పొలిచెనేని
పసిఁడికుంభములకుఁ బ్రభవించి మించు జక్కవకవ బోదలు గలిగెనేని, '

గీ. మెలఁతనెమ్మోము చెన్నున మించువచ్చుఁ
బొలఁతిచూడ్కుల పొలపంబుఁ బోలవచ్చు
నింతిమృదుబాహువుల దొరయింపవచ్చుఁ
జెలువచనుఁగవ జిగి సరిసేయవచ్చు. (జ) 193

శా. అవ్యాయామపురారు లక్షుభితపారావారు లక్షీణపు
ణ్యవ్యాపారసురే లగ్రహణచంద్రాదిత్యు లస్థావర
ప్రవ్యక్తామరభూరుహంబు లచతుర్భావానన బ్రహ్మలా
దివ్యద్వారవతీపురిం గలుగు ధాత్రీపాలు రెల్లప్పుడున్ (జ) 194

చ. ఇతవులయందు నెల్లతన మేపును సొంపును మవ్వమున్. జిర
స్థితిఁ జెలువొందనోఁచిమరుసేనలకున్ బెనుప్రాపుగా సమా
తతముగఁ బెక్కు నిల్కడలు దాల్చినమాధవలక్ష్మియో యనన్
సతతము నొప్పెఁ జూడఁ బురనందనసుందర పాదపావళుల్. (జ) 195

చ. ఇలకు నుపేంద్రుతోఁ దగిలి యీశుఁడు వేల్పులపిండు వెండిగు
బ్బలికిని బైఁడికొండకును బాలెము నిచ్చలుఁ జేయు చంద్రసూ
ర్యుల నిలఁ దెచ్చిరో యనఁగ నొ ప్పగునప్పురిహేమరత్నమం
డలిఁ దగి నాగభోగపరిణాహము లయ్యెడి దేవగేహముల్. (జ) 196

సీ. కమనీయచిత్రసంగతగతిక్రమముల దిగ్గజాదులనడ ధిక్కరించి,
లాలితగంభీరలఘుతరప్లుతముల హరిణసంఘంబుల నపహసించి,
సవ్యాపసవ్యసంచరణమహోద్ధతిఁ బంచాననక్రీడఁ బాహుసటిచి,
మహితనిరాయాసమధ్యాజవంబుల ననిలప్రయాణంబు నతకరించి,

గీ. సముచితాన్వర్థపూర్ణవేగములచేతఁ
గెరలి వచ్చి తలంపులఁ గిక్కురించి
హేతిమాడ్కి నుప్పరముల నెసక మెసఁగి
పంచధారలు గలహయపంక్తు లదరు. (జ) 197

మ. కలయం గాడ్పునఁ దూలి పుప్పొడి దివిం గప్పందు మారుండు వే
డ్కల నారామరమావసంతులఁ గడంకం బెండ్లి సేయించుచో
వెలయం బట్టినయుల్లభంబుపగిదిన్; వేమాఱుఁ దద్భూమిపైఁ
జెలువొందింపుచు రాలుఁ బుష్పవితతుల్ చేకొన్నప్రాలో యనన్. (జ) 198

క. కోటలతుద మకరప్రభ
దీటుకొనం బర్వి పరులదృష్టికి నొప్పున్
ఖాటించి మేయ జివి రవి
ఘోటకముల కజుఁడు పసురుకొలిపినభంగిన్. (జ) 199

సీ. గజయాన మెలఁగినగతి యైనఁ బైపడి గద్దించి తర్కించి కలఁక నొందు,
మానిని యల్గినమాడ్కిఁ దోఁచినఁ దేర్పు నుంకించి భావించి యుమ్మలించుఁ,
జపలాక్షి కెమ్మోవిఁ జవిగొన్నయ ట్లైనఁ జెమరించి చర్చించి చిన్నవోవు,
మదవతి కౌఁగిలి గదిసినయ ట్లైనఁ బులకించి తేటి సంచలత నొందుఁ,

గీ. దన్ను నొఱసినఁగోర్కులు తగులుగొలుపు
నోలిఁ దనలోన నన్నరపాలసుతుఁడు
మాన మూఁటాడ గాంభీర్యమహిమ సడల
లజ్జ గడివోవ ధైర్యంబు లావు డిగఁగ. (జ) 200

క. ద్విజశుశ్రూషాపరవశు
లజనితపరివాదు లభినవాకృతులు (?) మహా
సుజనచరిత్రులు ధీరులు
భుజవిక్రమధనులు ఘనులు పురిశూద్రజనుల్. (జ) 201

సీ. నెలఁతుకచూడ్కి వెన్నెల గాసినఁ గుమారు వీక్షణాంభోనిధి వెల్లివిరియఁ,
బతిచూడ్కి తామరల్ పరువంబు నొందఁ దొయ్యలిచూపు టలులు
చిట్టాడుచుండ,
సుదతిచూ పమృతంపుసోన యై కురిసిన వరుదృష్టి యనిమిషత్వమునఁ బొంద,
నధిపుదృష్టి ప్రవాహంబు పె ల్లడరిన నింతిదృక్మీనంబు లీఁతలాడ,

గీ. వరుసఁగౌతుకకల్లోలవలన మొలయ
రాగమకరందమత్తత ప్రజ్వరిల్ల
సంచితధ్యాన మనుప్రకాశము తలిర్పఁ
జిఱుతసి గ్గనుపలలోనఁ జిక్కువడక. (జ) 202

సీ. పరువంపువిరులపైఁ బొరసి యొండొకవనంబులసౌరభంబులఁ
బొరపుసేయుఁ,
బక్కువాసినపువ్వుఁబదువుతోఁ జెరలాడి యిలకు వేద్యంకంబు లలవరించుఁ,
గ్రొవ్విరులను దిరుగుడువడి పుప్పొడిఁ దలిరాకులకు వింతచెలు వొనర్చుఁ,
దనుపారఁ గొలఁకులఁ దగ నాడి వనకేళి జనులపైఁ బులకలఁ జూదుకొల్పుఁ,
గీ. గేరి మకరందములఁ దొలఁకించి మించి
మొనసి లేఁదీగెలకుఁ జిఱు ముసురు గురియ
నప్పురారామముల నెల్ల నలసగతుల
మలసి సొంపారు నింపారుమారుతంబు. (జ) 203

క. పురగోపురశిఖరంబులఁ
గర మరు దై పద్మరాగకలశము లమరున్
జరమాచరమాద్రులపై
సరిఁ బున్నమఁ దోఁచు సూర్యచంద్రులభంగిన్. (జ) 204

సీ. బహువర్ణరత్న ప్రభాతతి దివికి నొప్పుఁగ వసంత శ్రీవిభాతి గాఁగ
నగ్రస్థితాంగనాస్యామోదములు దివ్య సరిదబ్జములకు వాసనలు గాఁగ,
రమ్యస్థలములు నిర్ఝరులచూడ్కికిఁ గొమరొ [?] గదాకరములలాగు గాఁగ,
రజతకుట్టిమకాంతి రాజరోచుల కెదు రరుగుచట్టపుఁబిండువరుస గాఁగ,
గీ. సరసలీలావిలాసవిస్ఫురణ గలుగు
రమణరమణులచే నిష్ఠ గొమరు మిగిలి
పొడవు సొబగును గలిగి యప్పురమునందు
భర్మనిర్మితహర్మ్యము ల్పేర్మి నడరు. (జ) 205

మ. బహువస్తుక్రయవిక్రయక్రియలు సంప్రత్యాప్తికై కాకయున్
విహితాచారము లైనచందముల వర్ణింపంగ నింతంత నా
మహిలో రా దని చెప్ప నొప్పుదురు ధీమంతుల్కుబేరాధికుల్
మహిమోదాహరణంబు లప్పురముకోమ ట్లెల్ల లక్ష్మిస్థితిన్ (జ) 206

సీ. బ్రాఁతియే యిఁకఁ గల్గు లేఁతవెన్నెలనిగ్గు లుగ్గువెట్టెద నీకు నూరకుండు,
మునుపుగా నీకిత్తు ముదురువెన్నెల సోఁగు సంతసంబున నుండు జాలిమాని,
వేగిరింపకు నీకు వెలఁదివెన్నెలక్రొవ్వు గుడిపింతుఁ జిన్నారికడుపు నిండ,
నిట్టిముచ్చట వాయ నీఁదింతుఁ బండువెన్నెలవెల్లిఁ బలుమాఱు నిన్నుఁజేరి,

గీ. కూయకుఁడు మీరు సంతుష్టిఁ గూరినపుడు
శీతలం బగువెన్నెల చిగురుఁబాన్పు
నందు నిడి నిద్రపుచ్చెద ననుచు నాద
రించె బిడ్డల నొకచకోరీపురంధ్రి.[1] (జ) 207

సీ. మించినగతులు సాధించి యింద్రునికి మారొ్కని యున్నకా ల్గలకొండ లనఁగఁ
చేతనత్వంబులు చేకొని రవికిఁ గొమ్ములు చూపుచీఁకటిమొన లనంగఁ,
జే కల్గి యలుల కనేకదానము లిడ మేలఁగుతమాల్యామిజము లనఁగఁ,
జిత్ర కుధా స్తరాస్తీర్ణ లై [?] గాడ్పుతో మోహరించినకారుమొగుళు లనఁగ

గీ. నెల్లచందంబులను గడు నెసక మెసఁగి
పొగడు సెగడును బడసి యప్పురిఁ జరించుఁ
దమ్ముఁ జూచిన సిరియుఁ బుణ్యంబు నొసఁగఁ
దావలం బైనభద్రదంతావళుములు. (జ) 208

గీ. రత్నగర్భగర్భరత్నంబు లవ్వీట
నర్థిఁ బుట్టుచుఁ గొనియాడ మరగి
వీథి వీథి నెపుడు విలసిల్లు నా నాప
ణముల వివిధరత్నసమితి వెలుఁగు. (జ) 209

గీ. రాయుచున్న ఘనపయోధరములు గలిగి
నడుము లొకకొంత బయ లయి బెడఁగు మిగిలి
చూడ నొప్పారు రేఖలసొంపు మెఱసి
కోటకొమ్మ లమరు వీటి కొమ్మలట్లు. (ఆం) 210

చ. లలిత లతాంతపల్లవశలాటు ఫలాంకితభూజరాజి సం
కులబహుచిత్ర వర్ణపటకూటకుటీపటలంబుగా లతా
మిళితవిలాసులై చెలువుమీఱుఁ బురీవనముల్ జగజ్జయా
కలితరమాభిరామనవకామమహాశిబిరంబులో యనన్. (జ) 211

శా. లీలం గాముని నోమఁ బొవునెడఁ గేళీనందనం బెంతయున్
జాలన్ వాసన కెక్క, నొండొరువు లోజం బల్కుచోఁ జిల్కపిం
డాలో నాల్కలతొక్కుఁ దక్కఁ, జని నీరాడంగ నంభోజినీ
రోలంబంబులు చొక్క, వీటి సతులన్ రూపింప సామాన్యమే ? (జ). 21

1. ఫణిభవు మాధవుని ప్రద్యుమ్నవిజయము లోనిది.

సీ. వలరాజు పోసినవిలునారిపోలె బంధురము లగుచెఱకుఁ దోఁటలకును,
నలువచేఁ బెరిఁగి దీనుల కీఁగి యును లేని కల్పకంబులు పోనిక్రముకములకును,
మాధవుం డేదిన మవ్వపుఁబొరలయే దైఱ నివ్వటిలునాకుఁదీగెలకును,
పర్జన్యసత్కృతిఁ బసిఁడి పండెడుచే లనంగఁబేర్చినరాజనంబులకును,
గీ. దెట్టుపలు గట్టి నీటితోఁ దేలిపాఱు
తమ్మిపుప్పొళ్ళఁ బ్రోదు లై తనరుచుండు
ననిన నవ్వీటిచెఱువుల యతిశయంబుఁ
బుడమిలో నింక నేమని పొగడవచ్చు? (జ) 213

ఉ. శీలములీల, లంగములుచేకొని క్రాలెడువేదముల్, కలో
జాలము మన్కిపట్లు. యతిసజ్జనసంపదతిట్ట, లర్థిపూ
జాలలిత ప్రభావములు, ... ... ...
వేలుపుఁబిండుపండువులు, వీట ధరామరు లుత్తమస్థితిన్. (జ) 214

## పెమ్మన–భావన. [అనిరుద్ధచరిత్రము.]

గీ. అన్నిదినములు నీభంగి నఖిలలోక
సమ్మదావహ మై మహోత్సవము జరుగు
నుత్తమక్షత్రవిహితశాస్త్రోక్తసరణి
శాంతవిఘ్న మై పెండిలి సంపతిల్లె. (ఆం) 215
గీ. అభినవము లై నముక్తాఫలాక్షతములు
హస్తపంకేరుహముల నిండారఁ బట్టి
జాణజగజెట్టి యగుపంచబాణుపట్టి
చేరి నించె నుషాదేవి శిరముమీఁద. (ఆం) 216

క. అభిషేకోత్సవలీలా
విభవానంతరమునందు వెన్నునిమనుమం
డభినవవిలేపనాంబర
విభూషణస్రక్కలాపవిభ్రాజితుఁ డై. (అం) 217

సీ. అర్జునప్రీతియు నర్జునఖ్యాతియు నిగిడింప మగిడింప నేర్పుగలిగి,
యక్రూరచరితంబుఁ నక్రూరదురితంబు భూషింప దూషింపఁ బొం దెఱింగి,

కుబ్జావలేపంబుఁ గుబ్జావరూపంబు ధరియింప విరియింప వెరవు గలిగి,
గోపాలచయమును గోపాలభయమును బాలింపఁ దూలింపఁ జాలి వారి,

గీ. వారి కెడిరినరిపువీరవరుల నమర
మానినీహారనాయకమణులఁ జేయఁ
బటుపరాక్రమకేళి సంపదలఁ బొలిచెఁ
దరమె వర్ణింపఁ గృష్ణాభిధానవిధులు? (అఁ) 218

చ. అసమవసంత నీలజలజాకృతిఁ గైకొని యొప్పె నెంతయు
న్విస్ఫుమరహోమధూమములు నిర్భరలీలమెయిఁ హవిశ్శమీ
కిసలయలాజసౌరభవికీర్ణసమస్తదిశాముఖంబులై
కుసుమశరాసనాత్మజునకున్ రజనీచరరాజ పుత్రికిన్. (అం) 219

క. ఆంగిరస భార్గవులునుం
జెంగట మంత్రంబు సెప్ప శ్రీ పతిమనుమం
డంగనగళమునఁ గట్టెను
మంగళసూత్రంబు సర్వమంగళయెదురన్. (అం) 220

క. ఆసాయ మాప్రభాతము
వాసరయామినులు హృదయవర్ధితరాగ
వ్యాసంగంబునఁ దరుణియు
రాసుతుఁడు భజించి రెల్ల రతిసౌఖ్యంబుల్. (అం) 221

గీ. ఖగముచే నఱబరం బెల్ల నిమురుకొనఁగ
నుష్ణకరుఁడును గరము లొయ్యొయ్యఁ జాఁచి
తాను ననలాశఁ జరియింపఁ బూనె ననిన
నెంత యనవచ్చు నింక హేమంతమహిమ ? 1 (అం) 222

సీ. ఇరులు దర్పము మానఁ దిరముగా మంత్రించి జగముపై నడరినజడ నడంచి
జలజాతగృహములతలుపు లొయ్యనఁబుచ్చి మెలపుమైఁ దేఁటుల మేలుకొలిపి,
సొంపున మెఱుఁగారుచక్కులఁ బోఁజాగి పేర్చుకైరవములబింక మడఁచి,
రజనికిఁ బతి యైనరాజుమై కందించి చక్రవాకముల కుత్సవము నొసఁగి,

గీ. దెసల కెసకంపుఁదెలువులు దీటుకొలిపి
సకలజంతుప్రమోదసంజనకలీల

1. పోతరాజు భైరవుని శ్రీరంగమాహాత్మ్యము లోనిది.

దనదు రుచిరారుణాంశులు వినుతి కెక్క
నుదయధరణీధరముమీఁద నొప్పె నినుఁడు. (ఆం) 223

సీ. ఉచ్చైశ్శ్రవంబును, సురుమదసురభికపోలపాళివిలోలాళికలర
వాన్వితమై వాలునభ్రశుండాలంబు వాహనంబులు, వీరవైరిభీష
ణాంశుల మించు నూఱంచులకైదువు. కొమరారు పరివార మమరగణము,
పట్టంపుదేవియుఁ బౌలోమి, యీగతి నెల్లభోగములకు నెల్ల యగుచు,
గీ. విలసదమరీకరాంభోజవీజ్యమాన
చామరానిలసంచారచలితచారు
చికురుభారుఁడై చూడఁగఁ జెలువు మిగిలె
వేయుఁగన్నుల నింద్రుఁ డీ విధుఁడు తరుణి! (ఆం) 224

సీ. ఉదయార్కరుచిఁబోర నొలిచికొన్నట్టి మవ్వమునఁ జెంగావిగోవణముమెఱయ
వెన్నెల జడిగొన్న విద్యుల్లతలమాడ్కి యజ్ఞోపవీతంబు లఱుతఁ బొలయ,
ననుకైన కుసుమఁబెట్టిన పల్లవంబులచాయ సన్నపుగుజ్జుజడలు గ్రాలఁ,
గందువోఁ జదలేటఁ గడిగినశశిరీతి నెడకేల ముత్తెంపుగొడుగు దనర,
గీ. జగతిఁ దనుకాంతి యసమయచంద్రికా వి
భాతిఁ బ్రసరింప దివినుండి పార్థివేంద్రు
కొలువునకు వచ్చె సభయెల్ల నెలమిఁ జూడ
నారదుఁడు సర్వలోక విహారశీలి. (ఆం) 225

సీ. ఉప్పరం బెగయంగ నొదవినవెరవున సడిసన్నరోహణశైల మనఁగ,
వినతాసుతాకృతి వినువీథి వర్తిల్లు బాలభానుప్రభాపటల మనఁగఁ,
జైతన్యసంపదాస్పదభాతి దివిఁ బర్వు శాతమన్యవచాపభూతి యనఁగ,
జదధినుండక మింటఁ జరియించుటకుమూర్తి పొలుపుదాల్చినరత్నపుంజమనఁగ
గీ. వివిధమండనభవవిభావిభవజటిల
నిఖిలదిక్చక్రవాళుఁడై నిరుపమాన
జవసముల్లాసగగనసంచారగరిమ
చెలువు నెలవయ్యె నప్పు డప్పులుఁగుఱేఁడు. (జ) 226

సీ. కమనీయవప్రసంకలితనానారత్నధామకిమ్మీరితవ్యోమతలము,
సౌధాగ్రవిహరణాసక్తబింబాధరావిజితఖేచరవధూవిభ్రమంబు,

లీలావనీపుష్పలోలాలికలనాద రచితమన్మథధనుర్జ్యారవంబు,
పరిఖాంబుపరివర్తకరవిడంబితవార్ధి సంచారిజీమూతసంచయంబు,
గీ. మహితవితరణనృపతికుమారతిలక
హసితగీర్వాణసర్వంసహారుహంబు
విపులసౌభాగ్యపుష్పలావీవిలాస
కలితరథ్యాంతరము ద్వారకాపురంబు. (ఆం) 227

సీ. కరిముఖుండు లిఖించెఁ గల్యాణరేఖలు కనకపట్టికల లోకములకెల్ల,
వివిధశిల్పానల్పవిన్యాసరచనల వేది శృంగారించె విశ్వకర్మ,
కైసేసి యప్సరఃకాంతాజనంబును బెరిమెతో నేతెంచెఁ బేరఁటంబు.
పంచమహాశబ్దభరిత మై విలసిల్లె నంకురార్పణమహోద్యమవిభూతి,
గీ. భార్గవుఁడు దానవాన్వయప్రథమగురుఁడు
కాలసంసిద్ధికై సిల్పె గడియ(కొడుపు)
(శాస్త్రసరణిని) దేవతాసంయమీంద్రు
లాచరించిరి పుణ్యాహవాచనంబు. (ఆం) 228

చ. కలమవన ప్రతానములు గాచుటకై చనుదెంచి యింపులం
జిలికెడుమంజురీతి విలసిల్లఁగ నార్చుచు ముద్దుఁబల్కులన్
జిలుకులఁ దోలి పైఁ జెమరుచెందఁగొలంకుల కేఁగి చిల్కలం
జిలుకల నాడుచుండుదురు చెన్నుగఁ బామరబాలికాజనుల్. (ఇ) 229

క. కల్పితమణిఘృణిరచనా
కల్ప మగువివాహవేదికామధ్యమునన్
గల్పోక్తవిధానంబున
వేల్పించిరి యదుకుమారు వేల్పుందపసుల్. (ఆం) 230

ఉ. కాంతనితాంతరత్నపరికల్పితశిల్పములన్ ద్రికాలమున్
వింతతెలుంగులన్ దనరి విష్ణుపదోల్లిఖవై జయంతికా
సంతతు లుల్లసిల్ల సిరిచామ యహర్నిశమున్ వెలుంగ న
త్యంతముఁ జూడ నొప్పుఁ గను నప్పురిలోనిగృహప్రతానముల్. (ఆం) 231

చ. కులకుధరాపహాసిపురగోపురశేఖరరత్నదర్పణం
బుల వలరాచపోఁడుములు పోలఁగఁ జూచి తలంపు ప్రాణనా

ఘులదెసఁ గూర్చి యత్తఱిన తోడి వయస్యలు చూడ సిగ్గునన్
జెలు వెసలారఁగ న్గురులఁ జిక్కులు దీర్తురు సిద్ధకామినుల్. (ఆం) 232

సీ. కుసుమంబుఁబోలి పొల్పెసఁగు పొక్కిలిడిగ్గఁ గుఱుపట్టుపుట్టంబు నెఱికఁ గట్టి,
కమనీయనవరత్నఖచిత మైయొప్పుపసిండిపీఠమునఁ గూర్చుండఁబెట్టి,
గన్నెరాకుశరంబు కరపల్లవమునకు రక్షాప్రయోజనార్థముగ నిచ్చి,
దీవించి కాశ్మీరతిలకమధ్యంబునఁ బుణ్యాక్షతలఁ జిట్టిబొట్టమర్చి,
గీ. భాగ్యసౌభాగ్యవతియైనభామ యోర్తు
చన్నుఁగవభారమునఁ గౌను జలదరింపఁ
దివిచి కొనగోరఁ దోఁచి బిందువు విదిర్చి
బాణతనయకు నంటె సంపంగినూనె. (ఆం) 233

సీ. కుసుమకోదండుండు గుణవంతుఁ డగుటెల్ల యళులార! మీ ప్రాపుకలిమిఁ గాదె!
మరునియెక్కుడు పెంపు మహిమీదఁ జెప్పుట కీరంబులార! మీ పేరఁ గాదె!
సంకల్పజన్ముండు సప్రాణుఁ డగుటెల్ల మలయానిలంబ! నీమహిమఁ గాదె!
మీనకేతనుకీర్తి మిన్నందుకొనుటెల్ల శీతమయూఖ! నీచెలిమిఁగాదె!
గీ. బాలఁ గారింపఁ దగ దనిపలుకఁ దగదె!
యేడుగడయును మీర కా లెంతద్రవ్వ
మాకుఁ బుష్పాస్త్రుఁ? డంచు ననేకగతుల
మధుప శుక మందపవమాన విధులఁ దలఁచి. (జ) 234

శా. క్షామక్షామముఁ గీకటప్రకటవక్షః పీఠమున్ బాండుర
శ్యామిశ్రావయవంబు నై నపికటాకారంబుతో నవ్వుకై
చాముండాకరతాళకుక్షివలయస్థానంబుగా నుజ్జిత
హ్రీముద్రంబుగఁ బేరణీవిధము నర్తించెన్ మహాభృంగియున్. (ఆం) 235

ఉ. ఖంజననేత్ర చన్నుగవఁ కంజముఁ బొంగఁగ ధీరమేఖలా
శింజితకంకణక్వణ్వనజృంభణ మొప్పఁగఁ గౌను నిక్కఁగా
వ్యంజితబాహుమూలముగ హర్షము లజ్జఁ దిరస్కరింపఁగా
నంజలి యెత్తి నించె విభునౌదల నిర్మలమౌక్తికాక్షతల్. (ఆం) 236

గీ. గురులపంపున వక్షోజభరము గదలఁ,
జెలుపు వీక్షించి యొక్కింత సిగ్గువడుచుఁ
గంకణంబుల ఝుణఝుణత్కార మెసఁగ
పతివ లాజలు వోసె సప్తార్చియందు. (ఆం) 237

సీ. ఘనపక్షవిక్షేపజనితవాతాహతిఁ బర్వతశ్రేణులుపాదు గదల,
విపులాస్యకర్ణికావిర్భూతదీప్తుల వలయాద్రి యవ్వల వెలుకఁ బాఱ,
శతకోటిశతచండజవభవారవముల శరధులు ఘూర్ణిల్లి బరలు గడవ
వితతాద్భుతాపాదివిభ్రమోత్థితకాంతి దెసలవహోమద్యుతి దీటుకొనఁగ,
గీ. సిద్ధచారణగణనుతశ్రీఁ దనర్చి
మింటఁ బరఁగుఱెక్కలతోడిమేరు వనఁగ
వచ్చెఁ దనరాక కఖిలంబుఁ బిచ్చలింపఁ
బక్షి దేవుండు పుండరీకాక్షుకడకు. (ఆం) 238

సీ. చంద్రమండలములే జలజాతములుగాక కాకున్న నలు లేల కాఁపు లుండు?
నెలదమ్మితూఁడులే యలరుఁ దీగెలుగాక కాకున్న నీ కోరకములు గలవె?
క్రొక్కారుమెఱుఁగులే కుసుమాస్త్రములుగాక కాకున్న నీవిండ్లు గలగ వచటఁ,
గనకకుంభంబులే ఘనచక్రములుగాక కాకున్నఁ దరగలఁ గదియ నేల?
గీ.ననుచు వదనాలకములు బాహానఖములుఁ
బొలయచూపులుఁ బొమలుఁ జన్నులును వళులుఁ
జూచి జనములుఁ దమ్ముర సంస్తుతులు సేయ
వఱలుదురు దత్పురంబున వారసతులు. (ఆం) 239

ఉ. చీటికిమాటికిన్ మొగుపుఁజేతులు మౌళి ఘటించి మ్రొక్కెదన్
హాటకగర్భుబోటికి మహాకవికాంక్షితకల్పకాటవీ
వాటికిఁ దారకాహృదయవల్లభమంజులపుష్పమంజరీ
జూటికి వల్లకీస్ఫురితశుద్ధవరాటికి వాగ్వధూటికిన్ . (ఆం) 240

చ. చెలువము లొప్ప రాజనపుఁజేలకుఁ గావలియున్నకాఁపుఁగూఁ
తులనిడువాలుఁగన్నులును దోరపుఁజన్నులుఁ జూచి ధైర్యము
ల్పలపలనైన మందగతులన్ జనుచుండుదు రంగజాస్త్రముల్
దలముగఁ దాఁక నధ్వగులు దన్నగరాంతికమార్గభూములన్. (ఇ) 241

మ. జలనైర్మల్యవిధాయి వింధ్యగిరిశిక్షాకేళిసంశీలుఁ డీ
ల్వలదైత్యావరజన్మగర్వదళనావంధ్యక్షుధాభీలుఁ డు
జ్జ్వలతేజోనిధి కల్పితాయతపిపాసారిక్తవారాశి మం
జులహేలాగతిఁ దోఁచెఁ గుంభజుఁ డురుస్తోత్రైకపాత్రోన్నతిన్. (ఆం) 242

చ. తగులము పెక్కవం బురి సుధాధవళోన్నతహర్మ్యరేఖలన్
మగలనుఁ దారు మచ్చరపుమచ్చికమై వలరాచవేడ్కలన్
సొగియువధూజనంబుల తనూతనుఘర్మము లార్చు నిచ్చలున్
గగనతరంగిణీకమలగంధసుగంధ మరుద్విహారముల్. (ఆం) 243

చ. తలిరులు దోఁచె నేతరుల దట్టములై? నన లేధరారుహం
బులఁ దలసూపె మున్ను? వలిమొగ్గల నొప్పెడు నేయనోకహం
బులు? నవగుచ్ఛరాజి నగము ల్విలసిల్లెడు నెవ్వి? యన్నియన్
గలుగుట నేమహీజములు గన్నులపండువు లయ్యె? నామనిన్. (ఆం) 244

మ. తెర యెత్తించిరి దేవదానవగురు లీక్షాకళాకోవిదుల్
తరుణీరాజతనూభవాంతరమునన్ దట్టంపుఁగౌశేయమున్
తెర యెత్తించెను వార లిద్దఱమనోదేశంబులన్ గాముఁడున్
సరి నన్యోన్యముఖేందుమండలదిదృక్షాకౌతుకాంభోనిధిన్. (ఆం) 245

సీ. తెలుపులదాయ జారులకుఁ గట్టనియిల్లు బలితంపుఁజోరుల బ్రదుకుఁదెరువు,
నలుపుల మొదలు రేనెలఁతకస్తురిపూఁత యఖిలంబుఁ గప్పెడునరిదిముసుఁగు,
గుణములమీఁదటి గణనవిజ్ఞానంబు మఱుఁగు సందియములమనికిపట్టు,
కౌశికంబులచూపు క్రవ్యాదవితతిమన్నియము జక్కవదొల భయముప్రోఁక
గీ. యనఁగఁ గలవస్తువుల నెల్లఁ దనమయంబ
కాఁగఁ జేయుచు దెసలు నాకసము నిండ
సకలజనులకు మతుల విస్మయము లడర
నంధకార మంతంతకు నగ్గలించె. (ఆం) 246

శా. ధన్యం బై పితృ దేవతానివహ ముద్యత్ప్రీతి నర్తింపఁ బ
ర్జన్యాచార్యుఁడు భార్గవుండు శ్రుతిమంత్రంబుల్ పఠింపంగఁ బ్రా
ధానం బొప్పఁగ శైలరాజసుత యత్యాసక్తి వీక్షింపఁగాఁ
గన్యాదాన మొనర్చెఁ బాణుఁ డనురాగస్ఫూర్తిఁ బ్రాద్యుమ్నికిన్ (ఆం) 247

ఉ. ధన్యవిభూతి శోభితుఁడు దామరసేక్షణుఁ డొత్తె నూర్జిత
ధ్వన్యతులోగ్రతాదళితదానవసైన్యము ధూతభూతచై
తన్యముఁ దోషితేంద్రముఖదైవతసంస్తుతిమాన్యము న్నదీ
జాన్యుదరాంతరసగితసన్నుతజన్యముఁ బాంచజన్యముక్. (ఆం) 248

సీ. ధూర్జటికోపాగ్ని ధూళిగాఁ గ్రాఁగిన నాఁడేల నీయమ్ము వాఁడిలేదు?
వాఁడికోఱల రాహు వడిఁ దోలి కఱచిన నాఁ డేల నీరశ్మి వేఁడి లేదు?
శాపంబు శ్రీరామభూపాలుఁ డిచ్చిన నాఁడేల కూయవో వోఁడిగాను?
చనుపకముల కర్గి కనుకని డుల్లిన నాఁ డేల మ్రోయరో? నేఁడు మీరు
గీ. మగువఁ బాయు టెఱిఁగి మగఁటిమి వాటించి
యేయఁ గాయఁ గూయ మ్రోయ నగునె?
మదన! చంద్ర! పికమ! కౌదమతుమ్మెదలార!
నాఁడు నాఁడు నాఁడు నాఁడు లేరె? (జ) 249

సీ. నిర్భరవాంఛాఘనీభూతమానస భంగీకృతాదయాలింగనంబు.
సురుచిరనఖరాగ్రపరిరంభితాలకం బాస్వాద్యమానాధరామృతంబు,
బాహ్యక్రియాసార్ద్రభావనాశీకంబు వితతమృదూరూరువేష్టనంబు,
వర్ధితమధురోక్తివాచాలవదనంబు ఘర్మాంబుకణగణాకలితగండ,
గీ. మతితరంగితనిశ్వాస మాత్తపులక
మరుణితాక్రాంతలోచనాంబురుహయుగళ
మగుమనోహరఖేలనం బతిశయిల్లఁ
దనరెఁ గామినీకామకదంబకంబు. (ఆం) 250

సీ. పడఁతికన్నులయొప్పుఁ దడవుచో నది యెంత వెలిదమ్మితేకుల విలసనంబు
పొలఁతినెన్నడ పెంపుపొగడుచో నది యెంత కలహంసములయానగౌరవంబు?
ఉవిదనెన్నడుముతో నుపమింప నది యెంత కొఱనెల నెలకొన్న నెఱసుకలిమి?
వనితయూర్పులతావి కెనపోల్ప నది యెంత యరవిరులందలిసురభిమహిమ?
గీ. లలనకరివంకబొమలయొప్పులు గణించు
చోట నది యెంత వెడవింటిసోయగంబు ?
కాంతతనుకాంతి నరసేయ నెంతమాత్ర
వాలు మెఱుఁగుల సౌభాగ్యవైభవంబు ? (ఆం) 251

సీ. పల్లవాధరతోడఁ బలుకులయింపుల(?)నరయంగఁ బికము పోల్ననుట పికము
నలినాక్షివేనలిచెలువుతో సరిసేయఁ బురులెంత పురినెమ్మి పురులపొలుపు?
తనుమధ్యనడుముతో నెనవచ్చు ననిచూడ బయలగు నఖిలంబు బయలుకలిమి
సుదతిదంతద్యుతిసొబగు వర్ణించుచో రుచులె మౌక్తికములరుచులు దడవ?

గీ. ననిన నఖిలవరామణీయకముమహిమ
యిజ్జగంబునఁ బ్రతి లేమి యేమి సెప్ప,
గరుడఖచరోరగామరకన్యలందు
నయ్యుషాకన్య నుపమింప నబల గలదె? (ఆం) 252

చ. ప్రమదవనాంతరంబుల విభాకమనీయములై యశోకను
త్తమి గొనె నెల్లచోటఁ బ్రియులన్ గృతకప్రణయాపరాధవి
భ్రమముల నల్గఁ జేసి వెడవాసినపాంథులమీఁదికోపభా
రమున రతీశుకన్నుఁగవ రాలిననిప్పులప్రోఁకలో యనన్. (ఆం) 253

గీ. ప్రియముఁ గూర్చి ముత్తైదువ పేరఁటాలు
నలువపట్టంపుదేవి లేనగవు నగుచు
నగసుతాపద్మ లీక్షింప బిగియ ముడిచె
దంపతులయుత్తరీయవస్త్రములతుదలు. (ఆం) 254

గీ. పూని తిమిరారు లందఱు పొడిచిరేని
పంకమగ్న రత్నంబులభాతి నిందు
మినుకు మినుకని యంతన పొనుఁగు వడరె
యనఁబటు ధ్వాంతజృంభణ మగ్గలించె. (ఆం) 255

గీ. పొదలి యొండొండ దివియును భువియు దెసలుఁ
బొదివికొనియెడి చీఁకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్టి
కరవటం బన జగదండఖండ మమరె. (ఆం) 256

చ. పొలుపువహించి పెన్నురువు ప్రోఁకగతిన్ హరిదంతభాగముల్
గలయఁగఁ బర్వు మంచున దళంబుగ శైత్యముఁ దాల్చు క్రొత్తత
మ్మిలచెలికాని నిందుఁ దని ముద్దొలుకంగఁ దదీయదీప్తు లు
య్యలలుగఁ దూఁగుఁ బ్రీతి యెసలారఁ జకోరకిశోరసంఘముల్. (ఆం) 257

చ. భువిఁ దనివోక వెండియు నభోనదిపొందునకై కళిందసం
భవ బహువేణికావిభవబంధురతన్ దివియందుఁ బర్వె నా
నవిరళలీల నొప్పెసఁగు నప్పురివప్రనిబద్ధశాతమ
న్యవమణిజాయమానసముదగ్రతరాగ్రిమదీప్తిపూరముల్. (ఆం) 258

సీ. మకరందరసపానమత్తాలినీగానమంజులోద్యాననికుంజములను,
కలనినాదగభీరకాదంబసంచారసముదీర్ణకాసారసైకతములఁ
జందనామృతచంద్రచంద్రశేఖరచంద్రసదృశశోభాసాంద్రసౌధములను,
కమలా ప్రతిమభానుకాంతశిలాభానుమహితలీలాసానుమంతములను,
గీ. వినుతలావణ్యసంపద కనుగుణంబు
ప్రకటసామ్రాజ్యవిభవంబునకు ఫలంబు
నగుమనోజఖేలనమున నతిశయిల్లె
భోజనందనయును దానుఁ బుష్పశరుఁడు. (ఆం) 259

సీ. మత్తాలిసంగీతమాధుర్యములతోడి కుసుమగుచ్ఛంబులు కోసి కోసి
సంపుల్లమాధవీసదనవాటికలందుఁ జిలుకల పెండిండ్లు చేసి చేసి,
కమనీయకమలనీఘనసైకతంబుల నంచలఁ బట్టంగఁ బొంచి పొంచి,
సహకారవరతరుచ్ఛాయాతలంబుల మేనులఁ జెమరార మెలఁగి మెలఁగి,
గీ. దర్పకునియాజ్ఞఁ దల మోచి తమక తమక
తమకముల నోలముల కల్లఁ దారి తారి
మఱియు బహువిధసంచారమహిమ లమర
నుల్లసిల్లిరి లీలామహోత్సవముల. (ఆం) 260

గీ. మందవాతకణపరితాపమథితహృదయ
పాంథలోక మై తనవిజృంభణము దనర
శిశిరసంపద భువనలక్ష్మీదుకూల
కల్పితోపకుంతనభాతిఁ గానఁ బడియె. (ఆం) 261

క. మధుపర్కము సేయించిరి
మధురిపుమనుమనికి సర్వమంగళయెదురన్
విధివిహితం బగుపథమున
నధిగతపరమార్థు లగుసురాసురమంత్రుల్. (ఆం) 262

చ. మరుతుతగాలయంబు లన మన్మథు నమ్ములయిండ్లు నాఁగ శం
బరరిపునాట్యశాల లనఁ బంచశిలీముఖు నాతపత్రమం
దిరములు నాఁగఁ శారుశుకదీప్తలతాంతమరుచ్ఛటల్ లతా
సురుచిరపల్లవ ప్రతతి సొంపెసగుం బురితోఁట లెప్పుడున్. (ఆం) 263

సీ. రక్షోవధూవృత్తవక్షోజపరిలిప్త కుంకుమక్షోదంబు క్రొవ్వు డించి,
శక్రారిమదవతీవక్రాలకాలోగ ఘనతమఃపరభాగగరిమ నడఁచి,
క్రవ్యాదయావనీగ్రైవేయమణిహార కహ్లారదీప్తులగర్వ మడఁచి,
దైవతాహితవీరతరుణీసముల్లాస దరహాసచంద్రిక దర్ప మడఁచి,
గీ. చటులసంవర్తపరివర్తచండకిరణ
శతశతాఖిలపరిదీప్తసాత ఘోర
దర్శనం బగునట్టిసుదర్శనంబు
గలుగ నీ కసాధ్యంబులు గలవె కృష్ణ! (ఆం) 264

మ. లలనల్ పాడఁగఁ గౌఁగిలింపఁగ సముల్లాసంబునం దాఁపఁ బైఁ
గలయం బుక్కిటికల్లు నింపఁ దిలకక్ష్మాజాతకాండంబుఁ గ్రో
వు లశోకంబులుఁ గేసరక్షితిరుహవ్యూహంబుఁ దోడ్తోఁ గడున్
దిలకించెన్ బులకించె నవ్వె నలరెన్ దీపించె నుద్యానముల్ (ఆం) 265

సీ. వనరుహామోదిని చనుదోయిప్రాపున ననులేపనములు వాసనకు నెక్కఁ,
బూఁబోణినెఱివేణిపొందు సంధిల్లుట నలరులు సౌమనస్యంబుఁ దాల్ప
నంగనారత్నంబు నపఘనద్యుతుల సౌవర్ణమండనములు వన్నెకెక్క,
ధవళాంశుముఖిమేనితఱచు గ్రొమ్మించుల వెలిపట్టుగుణరాజి నెలవుకొనఁగఁ,
గీ. జెలువ మసలారఁ బూసి వేడ్కలు జనింప
ముడిచి బెడఁగుగఁ దొడిగి సొం పడరఁ గట్టి
గట్టినేర్పులు దళుకొత్తఁ గంబుకంఠి
కాచరించిరి శృంగార మాత్మసఖులు. (ఆం) 266

సీ. వరుణుండు కానిక పురుహూతునకుఁ దెచ్చి ప్రోవిడ్డనవరత్నపుంజ మనఁగ,
నుదయాద్రితటములో నున్నాళమై మున్ను వికసించురక్తారవింద మనఁగ,
గాశ్మీరరసపూరకమనీయ మగుశచీసఖిచేతికల్యాణచషక మనఁగఁ,
బ్రాచి కందుకకేళిపరత మింటికి వైవఁ బొల్పారుమందారపుష్ప మనఁగ,
గీ. నడరు కెంజాయ మండలం బతిశయిల్ల
నఖిలభూసురదత్తసంధ్యార్ఘ్యతోయ
దళితమందేహుఁడై జగంబులు వెలుంగ
భానుఁ డుదయించె దేదీప్యమానుఁడగుచు (ఆం) 267

సీ. వరుణునిశృంగారవనములోఁ బొంగడొందు పగడంపుఁదీగలప్రాఁ కనంగఁ,
జరమభూధరముపై సురగాలి నెగయింపఁ దోతెంచు జేగురుధూళి యనగ,
నస్తాంబురాశిలో నంతకంతకుఁ గ్రాలు బాడబానలశిఖాపటల మనఁగ,
నినురాక కపరదిగ్వనిత యెత్తించిన రత్నతోరణవిభారాజి యనఁగ,

గీ. విరియ నుంకించుచెందొవ విరులయందు
వఱలు ఱేకులకాంతికి వన్నెవెట్టి
రమణరమణీజనానురాగములతోడ
నిగిడి యెఱసంజ పడుమట నివ్వటిల్లె. (ఇ) 268

గీ. వారుణీస్పర్శమున నాదు వాఁడి దఱిగె
సకలతీర్థనిదాన మీజలనిధాన
మే నొనర్చెదఁ బావనస్నాన మనుచు
మునుఁగుగతిఁ బశ్చిమాంబుధి మునిఁగె నినుఁడు. (ఇ) 269

శా. విఘ్నధ్వాంతనిరాసవాసరపతిన్ వేదండరాజాననున్
విఘ్నాధీశ్వరునిన్ గపోలఫలకావిర్భూత దానచ్ఛటా
నిఘ్నాళిన్ నిరుపాధికాధికకృపానిత్యోదయోపఘ్నుఁ గ్రొం
చఘ్నజ్యేష్ఠు భజింతుఁ గావ్యరచనా చాతుర్యసంసిద్ధికై. (ఆం) 270

సీ. వికచారవిందదీర్ఘికల వినోదించి తని గమ్మతేఁపుల నసఁగి పెనఁగు,
గుసుమితనవలతావిసరంబుఁ గదలించి వలి దేనియలసోనఁ దలముగొల్పు,
సహకారపాదపచ్ఛాయల కై యేఁగి శశికాంతవేదుల సంచరించు,
సురతకేళిశ్రాంతి సొగియుముద్దియలపైఁ జిట్టాడితనువులఁ జెమట లార్చుఁ,

గీ. జంచరీకంబురీతిఁ బర్ణస్యుభాతి
విరహపరితాపహరుమాడ్కి సురఁటిపోల్కి
నవ్వురంబున సజలజనానుమోద
కరణదక్షుండు దక్షిణగంధవహుఁడు. (ఆం) 271

గీ. వెలయువెన్నెల నిఖిలంబు వెల్లివొడిచి
తనిసి చనుచోట నుడుపీథిఁ దవిలియున్న
నురువుబుగ్గలు దోడ్తోన విరియుపగిదిఁ
దరతరంబ తారకములు విరియఁ దొడఁగె. (ఆం) 272

ఉ. "వేగుచు వచ్చెఁ జూసె నిదె వెన్నెల యిన్నెల వింక నుండఁగా
వేగునె మాకు నీక్షణము వేఁడివెలుం గుదయించు" నంచు ను
ద్వేగమునం దదీయపదవీపరివర్తన ముజ్జగింప వే
వేగమునం దొలంగుగతి విచ్చె నుడువ్రజ మంబరంబునన్. (ఆం౹ 273

ఉ. వేలుపుగిడ్డియుం బరుసవేదియుఁ గల్పకుజంబుఁ దోడరా
లాలితపాదనూపురఝుళంఝుళనాదము లుల్లసిల్లఁ బై
చేలచెఱంగు దూలఁగ విశృంఖలవృత్తిఁ జరించుచుండు నీ
లాలక యన్నపూర్ణ యమృతాన్నము వెట్టుచుఁ బంక్తిపంక్తులన్.[1] (ఆం) 274

శా. సీమాంతంబున ద్వారకానగరమున్ జేరన్ దటాకోత్తరా
రామశ్రేణిసమన్వితంబు లగుచున్ రాజిల్లి రాజన్యస
స్యామోదం బిరుకారునుం గలుగు భాండాగారవాటీమహా
గ్రామవ్రాతము నిచ్చెఁ గన్యకు హరిద్రాచూర్ణసంపత్తికిన్. (ఆం) 275

సీ. సుందరీయౌవనస్ఫురితోష్ణకుచకుంభ పరిరంభలీలలఁ బరఁగకున్న,
బింబాధరాననాతాంబూలరససుధాస్వాదఖేలనముల జరుగకున్న,
సీమంతినీజనస్నిగ్ధోరుయుగళసంకలితపేషణములఁ గ్రాలకున్న,
రాజాననానేకరతికళావిర్భూత సుఖవిజృంభణముల సొగియకున్న,

గీ. మఱి శరణ్యంబు గలుగునే మనుజతతికిః
ననఁగ హేమంతసంపద కంతటికినిఁ
దాన యగుచుఁ గుబేరదిక్తటమునందు
... ... ... (ఆం) 276

శా. సేవాయాతవధూమనోజ్ఞకలకాంచీకింకిణీకంకణా
రావంబున్ సముదగ్రవాద్యపటలీరావంబులున్ గూడి భూ
దేవస్తోత్రనినాదమేదురములై దిక్కూలముల్ నిండఁగా
దేవాగారము లొప్పు నప్పురములో దివ్యప్రభావోన్నతిన్. (ఆం) 277

సీ. హంసతూలికశయ్య లలరుఁబొత్తుతలాడ శశికాంతమణిశిలావిశదధరణి,
తాంబూలపేటి యద్దము రాజకీరంబు పన్నీరుచెంబులు పసిఁడిగిండి,
విరులచింద్రికె (?) రుద్రవీణామతల్లిక వింజామరము వట్టివేళ్లసురఁటి,
గిలుకలపాగాలు క్రీడాసరోజంబు కాళంజి ముత్యాలమేలుకట్టు,

---

1. శ్రీనాథుని భీమఖండములోనిది-(3-144)

ఆ.వె. చతురశీతిబంధసంయుతప్రతిసీర
యగరుధూపపాత్ర యాదియైన
కామదీపనప్రకాశవస్తువులతో
నందనమైనకేళిమందిరమున. (ఆం) 278

## పేరయ—బొడ్డపాటి. [అనంతమహత్త్వము] (జ)

సీ. తనయనురాగాభ్యుదయమూర్తి పద్మినీ సతికిని ముఖవికాసం బొనర్ప,
దనదుర్నిరీక్షప్రతాపవైఖరి యరితమముల గిరిగుహాంతములఁ దార్పఁ
దనకరవిదళితదానధారాశక్తి కలయలోకులకు నాకండ్లు దీర్పఁ,
దనదుమిన్నందినఘనతరైశ్వర్యంబునకు విబుధాళి సన్నుతు లొనర్పఁ

గీ. దేజరిల్లెడురా జన దినదినంబు
మూఁడుమూర్తుల జనులచే మ్రొక్కుఁ గొనెడు
పద్మినీవల్లభుని నాదుపాలివేల్పు
భక్తసులభునిఁ గొల్తు హృత్పద్మ మలర. (జ) 279

## పేరయ-బొడ్డపాటి. [చాటువు] (జ)

సీ. కాంతులఁ జూపట్టుకం డ్లమరించిన తిర మైనవిపులపుఁదేరునందు,
విద్యలప్రోఁక యా వృద్ధసారథి నిల్పి యతఁడు శిక్షించుహయములఁ బన్ని,
తన్నివాసుల మించుతిన్నని ప్రావిల్లు చొక్కఁబైనారి నెక్కువెట్టి (?)
గరితోడఁగూడ నాకసపుసూటిని బాగు నెమ్మేనుఁ బస నిచ్చునమ్ముఁ దొడిగి

గీ. యమరభటు లార్వ దైత్యపురములు గెడపి
విజయ మొందినజోద వీ విశ్వమునను
వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ ! యుమాప్రసంగ ! (జ) 280

సీ. ఖండఖండంబుగఁ గదిసినతేరును భంగంపుటిరుసు బొసంగఁ గూర్చి,
విజ్జోడుపడి నిచ్చ వినువీథిఁ దిరిగెడు చక్రంబు లొనగూడ సంఘటించి,
తలకొన్నభీతిఁ గొందలపడ బహుముఖభ్రాంతసారథి నేరుపరిగ నిలిపి,
పలుకఁ బదక్రమంబుల నలుజాడలఁ బోయెడిగుఱ్ఱముల్ పూనుకొలిపి,

గీ. కుంటివింటను బలువంకకోలఁ దొడిగి
విషమలక్ష్యంబు లేగతి వ్రేసి తయ్య ।
వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ ! యుమాప్రసంగ ! (జ) 281

సీ. బంట్లున్న పాలెంబు బలువిల్లుగాఁ జేసి నవమణివలయంబు నారిఁ జేసి,
నుదుటినెన్నడిమికన్నును ములికిగాఁ జేసి దక్షిణాంగంబ యస్త్రంబుఁ జేసి,
చేకోరతలవాని జోక సారథి సేసి తనమూర్తి యొకటి రథంబు సేసి,
కనుదోయిఁ జక్రయుగ్మముగ యోజనచేసి సమత నూరుపుల నశ్వములఁ జేసి

గీ. యన్నియును నీ యధీనంబు లగుటఁజేసి
పురము లేసితి గాక నీ కొరులు తోడె ?
వేల్పు లెవ్వరు నీసాటి విజయవాటి
మల్లికార్జునలింగ ! యుమాప్రసంగ ! (జ) 282

## పేరయ-జొడ్డపాటి. [పద్మినీవల్లభము] (జ)

ఆ.వె. ఆ ప్రదోషయ...ముల్లై యున్న సమయంపు
కంట వేఁటకాని కరము దిల్పె
సొగపుద్రోచెఁ గ్రుంకె నగుప్రొద్దు పరసంధ్య
వెనుక నిరులు ముందు వెలుఁగు నగుట. (?) (జ) 283

క. ఒక యెనిమి దడఁగె దిక్కుల
మకరంబున కొకటి యోడె మలహరుచే ము
న్నొక టుడిగె ధిక్కరింపఁగ
నిఁక నేలని మాఱుమలయు నేనుఁగులు పురిన్. (జ) 284

సీ. కమలాకరస్ఫూర్తి కాసారములయందుఁ దమయందుఁ గలుగంగఁ దనరుచుండు,
గంభీరజీవనక్రమ మగడ్తలయందుఁదమయందుఁ గలుగంగఁ దనరుచుండు,
ధారావిహార ముత్తమతురంగములందుఁ దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
సుమవాోవికాసంబు ప్రమదావనములందుఁ దమయందుఁ గలుగంగఁ దనరుచుండు,

గీ. దానమహిమ సముత్తుంగదంతులందు
దమకరంబులఁ గలుగంగఁ దనరుచుండు
సిరులసంతోషమున ముఖ్యశీలవృత్తి
రణజయౌదార్యములఁ బురి రాజకులము. (జ) 285

సీ. గజములనడలుఁ దత్కరములజిగులుఁ దత్కుంభగౌరవములుఁ గూర్చి,కూర్చి
జలజస్ఫుటములుఁ దచ్ఛదవిభ్రమములుఁ ద త్కేసరసురభులు గిలిమి గిలిమి,
మరువిండ్లుఁ దన్మౌర్వీమధుకరరుచులుఁ దదస్త్రంబుమొనలును నలమి యలమి
గనకవేదులు నందుఁ గాంతినుగ్గులును ద త్సగితసన్మణులును దార్చి తార్చి,
గీ. గతులు నూరుకుచములు మొగములు నేత్ర
ములును దనుగంధములు బొమ లలకములును
చూపులు నితంబములును రుచులును దశన
ములును విధి సేసె నా సుంద్రు పురిచెలువలు (జ) 286

ఉ. పాయక కన్నె నాథుతలఁ బ్రాలిడఁ బూన్చినయాణిముత్తెముల్
దోయిట పద్మరాగమణులో యన నించుక యెత్తి చూచుచోఁ
జాయల నింద్రనీలములచాయలుగాఁ బతిమౌళి మీఁదటన్
బోయఁగ బూపుమొగ్గ లనఁ బొల్చె విచిత్రవిలాసవైఖరిన్. (జ) 287

ఉ. సారసరః ప్రతీరవనసౌరభపుష్పరజోవిభూతి నా
య్యారపుఁజొక్కు చల్లి మలయానిలుఁ డన్గడిదొంగ వేకువన్
జోరనగండ్లఁ గన్నములఁ జొచ్చియు దివ్వెలు దూల్చి భోగభా
మారతితాంతఘర్మకణమౌక్తికకపంక్తులు దార్చు నిచ్చలున్. (జ) 288

## పేరయ — బొడ్డపాటి. [మంగళగిరి విలాసము] (జ)

ఉ. హారతు లిచ్చువేయిన...సారికిరాయనిగన్నతండ్రి కొ
య్యారి మెఱుంగుఁజూపులనె యారతు లిచ్చె నొకర్త తజ్జ్వణా
త్కారకరద్వయీవలయకాంతులు గుత్తపుఁజన్నుదోయి తా
హారగళంచలన్నలుజాలతశనెంతకురాయభాకాంతియై [?] (జ) 289

## పేరయ — బొడ్డపాటి. [శంకరవిజయము] (జ)

చ. అదరి సరోజరాగమణు లామిషఖండము లంచుఁ గట్టుకు
ట్లొడికము సేయువేడుకల నుజ్జ్వలసన్మణు లేర్చి నిప్పులం

దిడియును ఖల్లుకవ్రజనిరీక్షణము ల్గని దివ్వెలించుఁ దేఁ
దడవుదు రొయ్య మౌగ్ధ్యమునఁ దద్గిరిసీమఁ గిరాతబాలికల్. (జ) 290

ఉ. ఆమని పెంకిపట్లు మలయానిలునిత్యవిహారసీమముల్
కామునిపాళెముల్ శుకపికంబులజీతపుటూళ్లు కామినీ
కాముకవిశ్రమంబులకుఁ గట్టని యోర్వకు [?] లాపురాంగనా
స్తోమమునందు నెందు నెలతోఁటలు శైలశిలోన్నతస్థితిన్. (జ( 291

గీ. తనకు బలము గలిగి తన మంత్రిమిత్రాప్త
బలము దనకుఁ దోడుపడుట గలిగి
వైరిబలము దఱిగి వారిచుట్టము లెల్ల
గ్రిందు వడినవేళ గెలువవచ్చు. (జ) 292

చ. తనరుచిగానివేళ బెడిదం బగువేఁడి నినుండు దోఁచినన్
గనుమొఱఁగుంట రాజునకుఁ గర్జ మటం చెటయేనిఁ జన్నయ
ట్లనుచరు లై వెలింగెడి గ్రహంబులుఁ దారలుఁ దోడరాఁగ వే
గన చనె వెల్లవెల్లనిమొగంబుకళంకమునన్ శశాంకుఁడున్. (జ) 293

గీ. రాజురాకకుఁ దారహారములతోడి
యామినీపాత్ర నాడింప నేమి సమయ
నాటకుఁడు దోఁపుతెరవాఱినాఁ డనఁగ
సాంధ్యరాగము పశ్చిమాశను దనర్చె. (జ) 294

సీ. సంజప్రొద్దున నాట సలుపునంబరకేళు తలయేటిజలకణతతు లనంగ,
రజనీవధూద్విజరాజులపెండ్లి కేర్పఱచుము త్తెపుఁదలఁబ్రా లనంగఁ,
గాలవాణిజ్యుండు నీలాంబరస్థలి స[రి] బఁచరించువజ్రము లనంగ,
వేళాఖ్య పుష్పలావిక యిందుఁ డనురాజునకు నేరిచినప్రసూనంబు లనఁగఁ,
గీ. బాలవెల్లి మథించు తొల్కాలమునను
నమృతబిందువు లుదరి మిన్నందెననఁగ
గగన మనుకొల నలమినతొగ లనంగఁ
గలయఁ జుక్కలు తోఁచె నాకాశవీథి. (జ) 295

మ. సమలావణ్యము వన్నెఁగూడి రసముల్ సంధించి శృంగారవే
షముతోఁ జొక్కపుఁజూపు న వ్వొలయ నిచ్ఛాతూలికన్ భావచి

త్రముగాఁ బంచశరుండు రాగ రతిఁ జెంతం జూచుచున్ వ్రాసి ప్రా
ణము వాగీశ్వరువేఁడి నించె నన మేనాపుత్త్రి యొప్పెం గడున్. (జ) 296

## పేరయ్య—బొడ్డపాటి. [సూర్యశతకము] (జ)

శా. ఈఁగల్వోలె వ్రణంబులే వెదకుచు న్నీర్ష్యం బరున్ మెచ్చకే
మూఁగల్వోలె నిరంతరాస్యు లగుచున్ మూర్ఛించి తర్కించినన్
పీఁగ న్నేరనిదుష్కవుల్ బ్రతుకనీ విక్రాంతులై వారినో
రాఁగం బోవఁగ నేల సత్కవులు సూర్యా! పద్మినీవల్లభా! (జ) 297

## పోతరాజు—[బేతాళపంచవింశతి] (అం)

చ. అరయఁగఁ బూర్వదిగ్వనితయం దనురక్తుఁడుఁ ముంద ఱిష్టు భా
స్కరుఁ డిట వచ్చి నాదెసఁ బ్రశాంతముతో ననురక్తుఁ డయ్యె సు
స్థిర మిది యంచు నయ్యపరదిక్సతి రాగముఁ బొందె నాఁగ వి
స్తరముగ నిండఁ బర్వె నెఱసంజ నభంబునఁ బశ్చిమంబునన్. (అం) 298

క. ఇంటింటం జింతామణు
లింటింటం బరుసవేదు లింటింట నిధుల్
జంటగొని యుండు ధనపతి
యింటిక్రియన్ బురములోనియిండుల నెల్లన్. (అం) 299

ఉ. ఇందుల నున్న నగ్నిభయ మెందునుఁ గల్గ దటంచు మున్ సురా
నందన మైనఖాండవవనం బమరావతి వాసి వచ్చి పొ
ల్పొందఁగ మర్త్యలోకమున నుత్సవలీల వహించెనొక్కొ నా
నందవనంబు లొప్పెఁ బురినాలుగుదిక్కుల నున్నతస్థితిన్. (అం) 300

క. ధరమిన్ను దఱిఁగివైచిన
కరణిఁ దటాకంబు లెల్లకాలమునందున్
బరిపూర్ణము లై యుండును
బురికి నవగ్రహభయంబు పొరయక యుండన్. (అం) 301

క. పురివిభవముఁ జూడఁగ న
త్కరమున [?] జలదేవి పెక్కుకన్నులు వెలయన్
ధరియించినట్లు వికసిత
సరసిరుహాకరము లొప్పు సౌరభలీలన్. (అం) 302

సీ. ప్రజ్వరిల్లుచు నున్నపసిఁడిశాఖలతోడ వెలసినవనముల చెలువుదానిఁ,
గరిమకరగ్రాహకచ్ఛపంబులతోడఁ బరిపూర్ణజలములపరిఘదాని,
మరకతవైడూర్యమాణిక్యములతోడ హాటకమయ మైనకోటదానిఁ,
గమనీయకాంచనకలశాంగములతోడ నమరిన దేవాలయములదానిఁ,
గీ గనకఖచిత మైనకంబంపుగట్టతో
వెండిమాడులిండ్లు వెలయుదాని
జనమహోత్సవ మనఁ దనరిన యుజ్జయి
నీపురంబు సొచ్చె నృపవరుండు. (ఆం) 303

క. రవిఁ బొంది రాహుచేఁ బరి
భవములఁ బడ నోడి తద్గభస్తులు పురి ʼను
క్కివపునఁ జొచ్చినవిధమున
నవిరళరుచి వెలిఁగె దివియ లయ్యె యిండ్లన్. (ఆం) 304

ఉ. వ్యాళవిభూషణాళియు దిగంబరమున్ గదయున్ త్రిశూలమున్
వ్రేలెడు కెంజడల్ గగనవీధికిఁ జాఁగినయుగ్రరూప మా
భీలచతుర్భుజంబులు నభేద్యకరాసియుఁ జంద్రఖండమున్
ఫాలవిలోచనంబుఁ గల భైరవుఁ గాంచె విభుండు ముందరన్. (ఆం) 305

క. సురధరము పెక్కురూపులు
ధరియించి పురంబులోనఁ దనరె ననంగా
స్ఫురితనవరత్న కాంచన
భరితములై వివిధదేవభవనము లొప్పున్. (ఆం) 306

## పోలమరాజు — [పర్వతపురాణము] (జ)

చ. అరయఁగ లోకబాంధవుఁడ నై భువనత్రయకర్మసాక్షి నై
హరిహరపద్మసంభవమయాకృతి నై మనునాకు వారుణీ
పరిచయదోష మబ్బెనని భానుఁడు తద్దురితోపశాంతికై
శరనిధిఁ గ్రుంకెనా నపరశైలతిరోహితుఁ డయ్యెనయ్యెడన్. (జ) 307

## బసువయ — అంగర. [ఇందుమతీకల్యాణము] (జ)

మ ఉదయస్తంభములోపలన్ వెడలి తా నుద్యుత్తమోద్దైత్యునిం
గుదియంబట్టి గభస్తిమన్నృహరి సక్రోధంబునన్ వానిదు

ర్మదగాత్రంబు కరంబులం దునుమ ధారాళాస్రపూరంబుకా
వి దివిం బర్విన కై వడిన్ గలయఁబర్వెన్ సాంధ్యరాగచ్ఛవుల్. (జ) 308

ఉ. బీద శచీవిభుండు దితిబిడ్డ లవార్యులు వారు పల్మఱున్
బాదలఁ బెట్టఁగాఁ జెఱలు వట్టఁగ నుండుట భారమంచు రం
భాదిమరున్నివాసలసదప్సరసల్ చనుదెంచి వచ్చిరో
నా దరవుల్లపద్మవదనల్ విహరించుదు రప్పురంబునన్. (జ) 309

సీ. లాజవిమోక్షవేళాసముద్గతహోమ ధూమవాసన మేనఁ దొంగలింప,
మృగనాభిమకరికారేఖ లై మృదుగండ మండలి హోమధూమములు నిలువ,
హోమధూమశిఖాముఖోష్ణంబు చోఁకి పూర్ణేందుబింబాననం బెఱ్ఱవార,
మాటికి హోమధూమంబుచే వెడలెడు కన్నీటఁ గాటుక కరఁగి పాఱ,

గీ. గురుజనోక్త విధానానుకూల చాల [?]
నిజవివాహవిలాసంబు నిర్వహించి
భోజుఁడప్పుడు వేడుక బుధకవివి [?]
తానములతోడ నార్ద్రాక్షతములు సల్లె. (జ) 310

సీ. శశిమండలముమీఁద సాంద్రచంద్రికవోలె నునుమొగంబునఁ దెల్లఁదనమునిల్చెఁ
బసిఁడికుండలమీఁద బలభిన్మణులువోలె వలిచన్నుముక్కుల నలుపు లొదవె,
నిఱుపేదమీఁదినిర్నిద్రసంపదవోలె మధ్యభాగంబున మహిమఁ దాల్చెఁ,
గదలినలత మీఁది కమ్మపూవులువోలె నలవనిమేన సొమ్ములు దొలంగెఁ,

గీ. దరుణిగమనంబు మిగుల మాంద్యము వహించె
వనజపత్రాక్షికోర్కులు కొనలుసాఁగె
వనిత నేత్రాంతములు వసివాళ్ళువాడె
వనితతనువల్లి శయ్యల ప్రాలఁ గడఁగె. (జ) 311

సీ. హేమసింహాసనం బెక్క నుద్యోగించు మణికల్పితాస్థానమంటపమున,
విసరించుకొనఁ జూచు వింజామరంబున వైరివీరవిలాసవతులచేత,
నాటింపఁ దలఁచు నానాద్వీపసంధుల గెలుపుఁగంబంబులు పలసినన్ని,
దుష్టరాక్షసకోటిఁ దునుమ విచారించు మఘవన్ముఖాఖిలామరులు వొగడ,

గీ సంతసము జహ్ను కన్యాతటాంతరముల
నధ్వరంబులు గావింప నలవరించు
నెలఁత నిచ్చలు నిజగర్భనివసదర్భ
కప్రభావపరిప్రాప్తి గౌరవమున. (జ) 312

## బసువయ్య — తులసి. [సావిత్రికథ] (జ)

ఉ. అన్నగరంబుహర్మ్యములయందు ఘటించినపద్మరాగర
త్నోన్నతకాంతిమండలము నొక్క మొగిన్ జదలేటఁ బర్వినన్
కిన్నరకాంత లాత్మఁ దలకింతురు జంబునదీప్రవాహ మి
ట్లెన్నఁడు వచ్చె నింగి కని యెత్తినసంశయసంభ్రమమ్ములన్ (జ) 313

మ. అరవిందప్రియవాది ఘోరతిమిరవ్యాళవ్రజస్ఫూర్తికిన్
గరుడం డంచితదిక్సతీకుచతటీకాశ్మీరపంకంబు పు
ష్కరభాగాటవిధాగ్రపల్లవితమాకందంబు [?] మందప్రభల్
బెరయం దూర్పునఁ గుంటువేల్పు పొడసూపెన్ దీపదండాకృతిన్ (జ) 314

క. ఆపూర్ణశంఖపద్మమ
హాపద్మాధికధనాఢ్యు లై పుణ్యజన
వ్యాపారవృత్తిపెంపున
నాపౌలస్త్యున్ గణింప రప్పురివైశ్యుల్. (జ) 315

చ. ఉరగవధూజనంబులు పయోధరసంభృతకుంకుమాంకముల్.
గరఁగ నిరంతరంబు నవగాహన మర్థి నొనర్చు చుండఁగా
నరుణరుచిం గనుంగొనఁగ నంద మగుం బరిఖాంబుతోయ మ
ప్పురి దనఘోరవీరరసముం బ్రకటించుచు నున్న కైవడిన్. (జ)316

సీ. కమలకోరకనికాయములఁ జిక్కిన తేఁటి గమిబ్రమోఁత ప్రియు కూఁతగాఁ దలంచు
వికసన్మనోజ్ఞహల్లకరాశిలోఁ దూటి దావానలం బని తల్లడిల్లు,
హంసఖండితమృణాళాంకూరములు శశి ప్రతిబింబితము లని పరితపించుఁ,
గల్లోలఘట్టనోద్గత ఫేనపుంజంబు ఘన మైన వెన్నెల యని కలంగు,

గీ. వెదకు నలుదిక్కులును జాల వెచ్చనూర్చు,
తలఁకు బిసినీపలాశ మధ్యమునఁ బొరలు.
జాలిఁ బడి తూలు దివసావసానవేళ
జడిసి ప్రాణేశుఁ బాసిన చక్రవాకి. (జ) 317

చ. కరుణ దలిర్ప నిన్ గుటిలుఁగా మదిఁ జూడక జూటకోటిలో
నిరుపమలీలఁ జేర్చుకొని నెమ్మది నున్నపురారిఁ బాండురు
గ్భరితశరీరుఁ జేసితివి కంతుని వైరముఁబట్టి యక్కటా !
సరసిజవైరి ! యీవిసపుజాతికిఁ బాంథవధంబు పెద్దయే ! (జ) 318

గీ. గగనలక్ష్మీప్రవమాటికిఁ గలశవార్ధి
యెలమితోడ నుపాయనం బిచ్చినట్టి
క్రొత్తకట్టాణిముంగఱముత్తె మనఁగఁ
జూడ నొప్పారి వేగురుఁజుక్క వొడిచె. (జ) 319

ఉ. గైరికమండనంబులు నఖర్వసమున్నత పాదపంక్తియున్
హారిమదాపరాశి యపహార్యసమంచితసత్త్వరేఖయున్
ధారుణి మీకు మాకు విదితంబుగ సాటియె పొమ్మటంచు దు
ర్వారగతిన్ హసించు గిరివర్గముఁ దత్పరివారణౌఘముల్. (జ) 320

సీ. తనశాతహేతి మత్తవిరోధిశుద్ధాంత దుర్దాంతహృదయాగ్ని ధూమరేఖ,
తనకీర్తి హుతవహస్తంభశంభుకిరీటి తక్షుల్లమల్లికాస్తబకపంక్తి,
తననిరర్గళ దానధార పంకజభవాండోదంచితావరణోదకంబు,
... ... ... ... ... ...

గీ. గాఁగ విలసల్లు సకలదిక్చక్రవాళ
భరితతేజో బృహద్భాను భానుదళిత
చండభానుండు సంతతాఖండవిభవ
శాలి యగునశ్వసేన భూపాలవరుఁడు. (జ) 321

సీ. దర్మభంగము విధూత్తంసవీరమునంద ధర్మభంగము రణస్థలులయంద,
ఘనతమస్ఫూర్తియు [?] ర్యమునంద ఘనతమస్ఫూర్తి యామినులయంద,
విక్రమోత్సేకంబు వీరయోధులయంద విక్రమోత్సేకంబు విష్ణునంద,
బలగర్వహతి గోత్రకులభంజనునియంద బలగర్వహతిరా... [?]

గీ. (కా కిఁ కే) చోట లేక నిష్కంటకంబు
గా మహీతల మేకచక్రముగ నేలె
రంతిదశరథనాభాగరఘుదిలీప
నయసమన్వితుఁ డశ్వసేనప్రభుండు. (జ) 322

సీ. పటుచండతాండవోత్పతిత ధూర్జటిజటామకుటాగ్రఫణిఫణామణి యనంగ,
నికటవాతాఘాతనిర్భగ్న మగుపశ్చిమాచలధాతుశృంగాగ్ర మనఁగ,
సంధ్యాప్రభిన్నరక్షఃకోటిపై వియచ్చరణుఁ డేసినసుదర్శన మనంగ,
ఘననిశాంబుధి జగం బనుకలం బెడలక యుండఁగఁ ద్రోచినగుం డనంగఁ,

గీ. దేశమంతయు శిఖియందుఁ దిరముకొల్పి
కడఁకఁ దల లెత్తి పటుమాంసకలశశంకఁ
బదరి జలచరపంక్తి పైపైఁ బడంగఁ
బడియె నపరాంబురాశిలోఁ బద్మహితుఁడు. (జ) 323

చ. పనివడి పాకశాసనునెపంబునఁ బంకజసంభవుండు నీ
తనువుఁ దొఱంగఁ జేసె నతిదారుణశాంభవరోషవహ్నిచే,
మనమున నాఁటియాగ్రహము మానక నీవును సంఘటించి తా
ఘనునిశిరంబుఁ ద్రుంచుతమకం; బితరుల్ తెలియంగనేర్తురే. (జ) 324

ఉ. పోకులఁ బోయి యన్యసతిఁ బొందినవాఁడు సదాకళంకి దో
షాకరుఁ డుగ్రమూర్తి సముదగ్రవిషాగ్నిసహోదరుండు ప
ద్మైకవిరోధి సంతతజివాత్ముఁడు మాసరిగాఁ డటంచు ను
త్సేకముతోడ రాజు నిరసింతురు రాజకుమారు లప్పురిన్. (జ) 325

సీ. బింబంబు హిమధామబింబంబు నడఁగించు మధురాధరాననమండలములు,
మించులఁ బసిఁడిక్రొమ్మించులఁ దలఁపించు నతిమనోహరకటాక్షాంగరుచులు
నగములఁ గృష్ణపన్నగముల నగుఁ గుచద్వితయరోమావళీవిభ్రమములు,
దమ్ములఁ దేటిమొత్తమ్ముల నిరసించు నంఘ్రిద్వయీవినీలాలకములు,

గీ. కరము కేసరిఁ గేసరోత్కరముఁ దెగడు
మధ్యకోమలదంతాంశుమండనంబు
లౌర! నుతియింప నజునకు నైన వశమె?
యప్పురంబున నొప్పారునబ్జముఖుల. (జ) 326

క. బీరమునఁ బొదలి సమర
ప్రారంభమె పెండ్లియనుచు బలవర్షమునన్
వైరులకు వెన్నుచూపని
శూరవ్రజ మప్పురమునఁ జూడఁగ నొప్పున్. (జ) 327

క. మందేహ దేహదహనా
మందక్షతజప్రవాహ మహనీయనదీ
సందేహదాయి యగుచును
గ్రందున నెఱసంజ మింటఁ గానఁగ నయ్యెన్. (జ) 328

ఉ. మాయపుఁదుంటవిల్తువెడమాయల మానినులార ! ప్రాణముల్
వోయెడు నాఁడునాఁటి కిఁకఁ బోవిడుఁ డీయలుకల్ నిజేశులన్
బాయకుఁడీ యటంచుఁ బరిభాషలఁ జాటెడుభంగిఁ గొక్కొరో
కో యని కూఁత వేసెఁ దొలికోడి పురాంతరగేహదేహళిన్. (జ) 329

మ. లలితాహంకృతిచేత రాచిలుక తాళం బుగ్గడింపం గరాం
చలవాచాలవిపంచికారణనచంచద్గానముం గూడి యు
జ్జ్వలపాదాంబుజరత్ననూపురచలద్వాక్యంబు సొంపొంద వా
గ్జలజాతాక్షి యొనర్చు నాహృదయరంగక్షోణి నృత్యక్రియన్. (జ) 330

సీ. వదనాంబుజంబుపై వ్రాలినమదభృంగ జాలంబు లబలనీలాలకములు,
రదనముక్తాఫల ప్రకరంబుదాఁ(చిన) (పవడంపునును) గ్రోవి పడఁతిమోవి,
యౌవనాంభఃప్రవాహములోనఁ దేలెడు జక్కవకవ కాంతచన్నుదోయి.
నతనాభికూపసంగత యైననవజలద్రోణి పల్లవపాణిరోమరాజి,

గీ. ... ... రామణికి నిడిన
కమ్మపూదండ లబ్జాక్షికరయుగంబు
చరణపద్మముల్ ముట్టంగఁ జాలునట్టి
కరికరంబులు నిడువాలుఁగంటితొడలు. (జ) 331

చ. విడిలినమోవికెంపులును ప్రేఁకపుటూరుపు గాలిసొంపులు
న్నుడలినమేనియొప్పులును నానదొఱంగిన మాట తప్పులున్
సడలినకొప్పుబాగులును జంకెనచూపులవింతలాగులున్
దడఁబడ నభ్యసించిరి ముదంబున నిద్దఱుఁ గామతంత్రముల్. (జ) 332

సీ. సకలదిగ్దేశరాజన్యహారప్రభాజాలంబు ఫేనపుంజంబు గాఁగఁ,
జంచలలోచనాజనకరాంచలచల చ్చామరోత్కర మూర్మిచయము గాఁగ,
సముచితరత్నాసనము లంతరాకీర్ణబహుళ భూధరకదంబములు గాఁగఁ,
బరనృపాలార్పితబాలాజనంబుల మెఱుఁగుఁజూపులు గండుమీలుగాఁగ,

గీ. వందిసంస్తుతు లుద్ధతధ్వనులు గాఁగ
జయరమాకాంతకుద్భవస్థాన మగుచు
నంచితాజ్ఞామహావేల నంబురాశి
మహిమఁ జెలువొందు నాస్థానమండపమువ. (జ) 333

సీ. సంతతిలేనిసంసారంబు నిస్సారమొగి నర్భకులు లేనియొప్పు తప్పు,
కొడుకుతోఁ గూడనికూడు కీడు, తనూజు లెపుడు క్రీడింపనియిల్లు పొల్లు,
పుత్త్రిరత్నము లేనిభోగంబు రోగంబు, తనయుఁ గాననిదానితగవు నగవు,
పిన్నబిడ్డలు లేని పెక్కువ తక్కువ, సూను మైసోఁకనిమేను మ్రాను,

గీ. కాన యెబ్బంగినైన సంతానలబ్ధి
కాన నగుత్రోవఁ బరికించి కానవలయుఁ
గాని యూరకయున్కి యుక్తంబు కాదు
జగతి సంతతి లేకున్న జన్మహాని. (జ) 334

సీ. సురవాహినీహేమసరసిజంబులు గోయ జను లర్థి నిడిననిచ్చెన లనంగ,
నభంబు పాథోధి యనుచు నేఁగఁగ నిల్చి సాఁగినశరదభ్రచయము లనఁగ,
జవభిన్నరవిరథాశ్వములు సిల్వఁగ నోలిఁ బన్నినపటికంపుఁ దిన్నె లనఁగ,
ఘనరత్నకుట్టిమోద్గతరసాతలశేషఫణిఫణాద్యుతికలాపంబు లనఁగ,

గీ. భూమి కాంచితనవమణిస్తోమధామ
మండలాఖండలాచ్ఛకోదండఖండ
పటలనర్తితదేహాళిబర్హికులము
లగుచు నప్పురిసౌధంబు లతిశయిల్లె. (జ) 335

సీ. సౌవీర మగధ కోసల భోసల పుళింద లాట కేరళ మహాభోట చోట
సాముద్ర పౌండ్ర ఘూర్జర కుంత లావంతి పాండ్య గాంధార నేపాళ గౌళ
కర్ణాట కుకురు కేకయ వత్స మత్స్యాంగబంగాళ సింధు కళింగ వంగ
కురు బాహ్లి కా(?)ది కొంకణ టెంకణ సాళ్వ కాశ్మీర పాంచాళ చోళ

గీ. శక సుధేష్ణ త్రిగర్త దశార్ణ వార్ణ
కాల కాంభోజ దరద కంథాణ హూణ
సుంహ లోత్కళ బహుధాన శూరసేన
యవన మద్ర మరుద్రదేశాంధ్రవిభులు. (జ) 336

క. హరితురగమునరుణాంశుని
హరులుం గవ గూడెనేని యగు సరి లేదా
సరి గా వని యితరహయో
త్కరముల నగు నప్పురమునఁ గలహరు లెల్లన్. (జ) 337

సీ. హరినీలరుచిరమధ్యప్రభాభోగంబు నంభోధరశ్రేణి నపహసింప,
శశికాంతకుట్టిమచ్ఛాయాకలాపంబు వరబలాకావైభవంబు నెఱప,
నంగనాచటులకటాక్షపాతంబులు సౌదామనీవిలాసములఁ జేయ,
నిబిడభేరీశంఖనినదసంరంభంబు ఘనగర్జితప్రౌఢిఁ గైకొనంగఁ,
గీ. గలహవిగళితసౌధాగ్రగతవధూటి
కాప్రసూనాళి కరకాప్రకాస్తిఁ బెనుప
మహిమ నెప్పొద్దు వర్షాగమంబు లేవ
దీపితం బయ్యెఁ భోగవతీపురంబు. (జ) 338

## భాస్కరుఁడు—[?] (ఆం)

సీ తొలిపల్కు మునికోలఁ దోఁచువారువములు వారువములఁ గన్నసారథియును,
సారథిఁగన్న యస్త్రము నస్త్రమును మోచుగరి గరితోడఁ దొడరెడు నారి,
నారిమీఁదటి తేరు తేరిమీఁదటి విల్లు నావిల్లు పైపట్ల నరుగు రథము,
మెఱుఁగుఁజిప్పలజోడు మెయిజోడు పైగతుల్ గతులపై విజ్జోడుకండ్లు గండ్ల,
గీ. సరివెలుఁగుచున్న ములికియు సంఘటించి
విషమలక్ష్యముల్ సమదృష్టి విఱుగనేసి
జయము చేకొన్న విలుకాఱ చక్రవర్తి
కరుణ దళుకొత్త మనలను గాచుఁ గాత. (ఆం) 339

## మల్లయ - నంది. [మదనసేనము] (జ)

గీ. అపుడు తానావసానంబునందు మధ్య
కీలితం బయి యొప్పెఁ గెంగేలు వలికి
నలియవు గదా యటంచు నానడిమితీగ
నుపచరింపఁగ వచ్చినదో యనంగ. (జ) 340

సీ. తళతళ మనుపతాకలతోడ రవికాంతిఁ దలతలమనెడిరత్నములతోడఁ,
గనఁగన సొబ గధికం బైనపొడవుతోఁ గనకన మనుహేమకాంతితోడఁ,
గలకలఁ బల్కుచిల్కలతోడ గృహదీర్ఘికలఁ గలహంససంఘములతోడఁ,
బరిపరిగతి నాడుబర్హులతో నిజోపరిపరిగతిమేఘపంక్తితోడఁ,
గీ. దముల విహరించుపారావతములతోడ
భ్రమదళివ్రాతసుమవితానములతోడఁ
బ్రమదవనవాసనలచేతఁ బ్రమద మొసఁగి
యెనయునీమేడతోఁ బ్రతి యెనయఁగలదె ? (జ) 341

సీ. పరిఫుల్లహల్లకప్రభలు నిండినచోట సాంధ్యరాగద్యుతి చౌకళింప,
వికచనీలోత్పలప్రకరస్థలంబుల గిఱిగొన్నచీఁకట్లు గ్రేళ్ళుదాఁట,
నిర్ణిద్రకుముదవనీప్రదేశంబులఁ దేటవెన్నెల పిల్లతీపు లాడ,
వికసితకనకారవిందబృందంబులు బెరయునీరెండఁ బింపిళ్లుగూయఁ,
గీ. బగలు రేయును దమలోనఁ బగలుమాని
కలసి మెలసినబాగున గడలుకొల్పి
వివిధమహిమలఁ దనరునావిమలసరసిఁ
జూచి నివ్వెఱపడి రాజసూనుఁ డపుడు. (జ) 342

సీ. మెఱుఁగుశృంగములందు మెదలక యున్నవినీలమేఘంబులు నీరజాస్య!
వెన్నెలపులుఁగులు వేకువచంద్రుపైఁ దేలుచున్నవి చూడు తియ్యఁబోఁడి!
మింట నాగడపలు మెల్లమెల్లన విచ్చి కానరావయ్యె నోకలువకంటి!
పారిజాతపుఁదీగ బహువర్ణపుష్పభారంబు మోవఁగలేదు కంబుకంఠి!
గీ. యనుచుఁ దమలోన గర్భోక్తు లాడుకొనుచుఁ
దనకు నుపచారములు సేయు ననుఁగుఁజెలులఁ
జూచి నవ్వుచు సహజన్య చూడ నొప్పెఁ
జారుదోహదలక్షణసహిత యగుచు. (జ) 343

## మల్లయ — నండూరి. [హరిదత్తోపాఖ్యానము] (జ)

చ. నవరుచిపల్లవస్థితిఁ దనర్చి లసత్సుమనస్సమృద్ధివై
భవమునఁ బొంది గంధబహుబంధురతం దగి యాశ్రితద్విజో
త్సవములఁ బొల్చి వారవనితామణిరీతిఁ ద్రివిష్టపంబుతే
వ వరగజంబుమాడ్కిఁ గ్రతువాటిగతిన్ బురితోఁట లొప్పగున్. (జ) 344

## మల్లయ — మద్దికాయల. [రేవతీపరిణయము] (జ)

సీ. అమృతాంశుబింబంబు నవఘళింపఁగఁ జాలు తీయని పెదపెన తేనెపెరలు,
కలశాంబునిధితరంగలపిల్ల లనఁ జాలు సాంద్రదీర్ఘవళక్షచామరములు,
తారకంబులయొప్పిదములు గాదనఁజాలు వైణవమౌక్తికవ్రాతములును,
పండువెన్నెలగుంజుఁ బరిహసింపఁగఁ జాలు పరిపరిగతులయబ్బురపుజున్ను,
గీ. నాది యగుదివ్యవస్తుసంహతులు దెచ్చి
యవనమండలపతి కుపాయనము లిచ్చి

విన్నపము చేసె నిట్లని వేడ్క దనదు
డెందమునఁ గందళింపఁ బుళిందవిభుఁడు. (జ) 345-A

మ. కటకండూయనమంతనంతఁ జలుపంగాఁ దామ్రపర్ణీమదో
త్కటదానంబులు నిండి చెండుకొన కస్త్రగ్రావకూటద్వయ
త్రటము ల్మెట్టఁగఁ జిర్కబాఱె నవనీతంబుల్ వడింబాఱెనా
బుటకన్యాప్తుఁడు గ్రుంకెఁ బశ్చిమమహాంభోరాశిపూరంబునన్? (జ) 345-B

చ. నిలయతమఃప్రతానము గణింప మఱుంగులునొచ్చినట్టుగా
నలరుపిఱిందినీడలు రతాంతదుకూలపరిగ్రహత్వరా
కలితవిలాసినీనివహకౌతుకహేతువులై చెలంగ ను
జ్జ్వలరుచి మించె గేహముల సంపెఁగమొగ్గలవంటి దీపముల్. (జ) 346

## మల్లుభట్లు - ఘటసాసి. [జలపాలిమహత్త్వము] (జ)

సీ. అత్రిమునీశ్వరుం డడవి కేఁగినవేళ హరిహరబ్రహ్మలు ధరకు వచ్చి,
యనసూయవర్తనం బరయఁ దలంచి వా రతిథులై యాహార మడిగినంత,
యవుఁగాక యని వేగ నన్నపానాదులు వడ్డింపఁ దలఁచుచో వారికోర్కి,
తప్పకుండఁ బతివ్రతాప్రభావంబున నకలంక యగుచు బాలకులఁ జేసి,

గీ. యంబరము లూడ్చి సకల పదార్థములను
బాత్రములఁ బెట్టి తొంటి (రూప)ము లొనర్చ
సంతతం బంది తత్తదంశముల సుతుల
వరము లందె నయ్యది పతివ్రతలమహిమ. (జ) 347

సీ. కచభరకృష్ణమేఘంబులఁ బ్రభవించు మెఱుఁగుఁదీగలరీతి మేను లలర,
వదనేందుదరహాసవరశరచ్చంద్రిక లక్షిచకోరంబు లనుభవింప,
నతుల సౌందర్యాబ్ధి కధరబింబద్యుతుల్ పవడంపుఁదీగెలబాగు మెఱయ,
జగము గెల్వఁగ దక్షనగరంబు దొనసేసి మరుఁడు దాఁచినదివ్యశరములనఁగ

గీ. సరసలీలావలోకనచతురగతుల
నప్సరస్త్రీసమూహంబు లభ్యసింపఁ
బద్మినీజాతిముఖ్యస్వభావములను
వన్నె మెఱయదు రప్పురివారసతులు. (జ) 348

సీ. ధవళాంగుఁ డగుశంభుదత్తగర్భముగాఁగ వనితదేహము పాండువర్ణమయ్యెఁ
బుత్త్రలాభానందపూరితకుక్షియై యఖిలభక్ష్యములందు నరుచి యయ్యెఁ,
జెలులు వచ్చినఁ జూచి సిగ్గున నున్నట్లు పలుక నోపక యుండె నలసవృత్తిఁ
దతి మరాళములకు గతి నేర్పుకై వడి నళినాక్షి మందయానము వహించె,

గీ హేమకలశాగ్రములయందు నింద్రనీల
రత్నములరీతిఁ దత్కుచాగ్రంబులందు
నలుపు సొంపారి గర్భచిహ్నములు గలుగ
నతివ తల్లికి సంతోషమావహిల్లె. (జ) 349

## మాధవుఁడు _ ఫణిధవు. [ప్రద్యుమ్నవిజయము] (జ)

గీ. అత్రిమునికంటి పసుబిడ్డఁ డాకసమున
నుడుగణము లాడకాడకు నొడ్డగిలిన
బాలభానుండు నలుగడఁ బర్వమీటు
వెండిగుండన నుదయించె వేగుఁజుక్క. (జ) 350

చ. ఎడపక దివ్యవస్తువు లనేకము లుండుటఁ జేసి యేమిటం
గడమయిడంగ రానినిజగర్భభరంబున దేవతాపురిం
దొడరుట కప్పురంబు బిరుదుల్ గగనంబున కెత్తెనో యనన్
బొడవున నాడుచుండు నృపపుంగవ! మారుతవైజయంతికల్. (జ) 351

సీ. గబ్బిబేడిసమీలు కన్నుల కెనవచ్చుఁ బలుమాలు నవి మిట్టిపడకయున్నఁ,
దొగలనెచ్చెలికాఁడు మొగమున కెనవచ్చు నొకయింత మేనఁ గం
డుండకున్నఁ,
గ్రొవ్వున జక్కవల్ గుచముల కెనవచ్చుఁ బ్రొద్దువోయినఁ బాసిపోకయున్న,
మెఱుఁగులు మెత్తనిమేనుల కెనవచ్చుఁ దళతళఁ బొడకట్టి తలఁగకున్న,

గీ. ననుచు సరసులు వర్ణింప నవయవాతి
విభ్రమవిలాసవిస్ఫూర్తి వినుతికెక్క
గణన మీఱినమానినీమణులు గలరు
... ... ... ... (జ) 352

గీ. గాఢతరకాంతికై గ్రింగుకాంక్ష నంత
రిక్షకాపాలికుఁడు సంతరించినట్టి

గొప్ప యగుశుద్ధపారదఘుటిక యనఁగఁ
జొక్క మగుకాంతి వేగురుఁజుక్క దనరె. (జ) 353

ఉ. చెంచెతగుబ్బచన్నుఁగవ శీఘ్రతరంబుగ నంతనంత వ
ర్తించిన యౌవనోపగమజృంభణ మెక్కినఁనంతకంతశో
షించెను దానినెన్నడుము జీవితనాథుఁడు వానివిల్లునున్
జెంచులరాజులున్ సవతిచేడియపిండును బక్కణంబులన్. (జ) 354

గీ. తొలుత ముంగిళ్ళఁ గర్పూరధూళిఁ దుడిచి
సహజచందనజలములఁ జాఁపి చల్లి
చారుగృహములఁ గమ్మకస్తూరి నలికి
ముగ్గు లిడుదురు పురసతుల్ ముత్తియముల. (జ) 355

ఉ. దలదవదాతకంజదళధౌతకనత్కలధౌతమల్లికా
వలులవికాసలీల శరవర్గమృణాళమనోజ్ఞహారవ
ల్లులరవణంబునన్ సకలలోకనుతోజ్జ్వలకందబృందకం
దలములచాయఁ జంద్రకిరణంబులకుం దెలు పెక్కె నంతటన్. (జ) 356

చ. నవకపుఁదెల్లముగ్గు జతనంబునఁ గూర్చి వియద్గృహంబునన్
దివురుచు రంగవల్లికలు దేవగణంబులు చూచి మెచ్చఁగా
నవరఁగఁ దీర్చి కాల మనుజకులముద్దుఁడు వేడ్కతో దివా
యవనికఁ బాయఁదట్టె నన నంచితలీల వెలింగెఁ దామరల్. (జ) 357

గీ. పట్టువడ కది చపలతఁ బాఱె మనసు
సూరిజననుత! రూపజీ సుడిసె గాలి
యండగొనె నారి గట్టియై యాశుగంబు
లప్పరముగుబ్బములవేగ మరసి చూడ. (జ) 358

ఉ. పొంకపుగుబ్బలం బునుఁగుఁబూఁతయుఁ దుమ్మెదకప్పుమేనులున్
జంకెనచూపులున్ జఘనసైకతసీమలఁ బారుటాకులున్
మంకెనచాయమోములును మానితహస్తధనుశ్శరంబులున్
కొంకక భిల్లకామినులకుం దగియుండుఁ బసిండిగుబ్బలిన్. (జ) 359

ఉ. పోలఁగ నందులం గలుగు పుష్పసుగంధుల రూపవైభవ
శ్రీ లరయంగఁ గోరి యట చేరినఖేచరయక్షదైవత

స్త్రీ లని సంశయింపఁగఁ బురీజను లద్భుతదర్శనప్రియా
చాలనదూరతన్ నెఱయు సౌధహిరణ్మయసాలభంజికల్. (జ) 360

గీ. మిక్కుటపుఁగాంతి వేగురుఁజుక్క వొడిచె
బారెఁడెక్కినయపుడు గన్పట్టియుండె
నినుఁడు నరుదెంచినను రాగ మెసఁగఁ బ్రాచి
మురువుగాఁ దాల్చునాసికాభరణ మనఁగ. (జ) 361

క. మెత్తనిబంగరురవరవ
లొత్తెడుకరమూలరోచు లొలయంగను దా
రెత్తులు గట్టెడుమిషమునఁ
జిత్తిణితన మెల్ల బయలు సేయుదు రచటన్. (జ) 362

## ముత్తరాజు—నెల్లూరి. [పద్మావతీకల్యాణము ] (జ)

క. నీ వెంతవేఁడుకొన్నను
గేవలపాతకుల కేల కృప వుట్టు మదిన్
దేవుఁడు 'నహి' గురువున్ 'నహి'
భావజచంద్రులకు వికచపద్మదళాక్షీ! (జ) 363

## ముద్దమరాజు— రెడ్డిపల్లె. [అష్టమహిషీకల్యాణము] (ఆం)

ఉ. రామకథాసుధారసము బ్రహ్మపయోంబుధి మున్గి యుండఁగా
నేమునివాక్యమందరమహీధరసన్మథనంబుచే సము
ద్ధామత సంగ్రహించి విబుధప్రకరంబున కిచ్చె నరిమై
నామహితుం బ్రచేతసునియాత్మజుఁ గొల్చెద నాదిసత్కవిన్. (ఆం) 364

శా. శ్రీవామాగ్రహలిప్తసన్మృగమదశ్రీఁ బొల్చు వక్షంబునన్
శ్రీవత్సంబు వెలుంగఁ గౌస్తుభము లక్ష్మీదీప మైయొప్పఁ ద
ద్దేవీకేలనలోలచిత్తుఁ డగు శ్రీదేవుండు కృష్ణుండు స
ద్భావం బొప్పఁగృపావలోకనమునన్ బాలించుఁ ద్రైలోక్యమున్. (ఆం)365

## ముమ్మయ—జైతరాజు. [విష్ణుకథానిధానము] (ఇ)

ఉ. అంగిటిగాల మాపదకు వ్యాధుల కెల్ల బొజుంగు భీతికిన్
గొంగ దరిద్రవృత్తిముకుఁగొయ్య యఘంబులవేఱు విత్తుదు

స్సంగతి వెన్నునమ్మెకట విప్రకరంబులమిత్తి దేవ! నీ
మంగళనామధేయము సమాశ్రితభక్తివిధేయ మచ్యుతా! (ఆం) 366

చ. అమృతమువంటితల్లి కమలాసనుపట్టపుదేవి వేదశా
స్త్రములవిహారభూమి కలప్రాణుల కెల్లను పల్కుఁదోడు వి
శ్వమున సమస్తవిద్యల విశారద శారద నాదు వక్త్రప
ద్మమున వసించి మత్కృతిఁ జమత్కృతి పట్టఁగఁ
జేయుఁ గావుతన్. (ఇ) 367

చ. అరుణజటాచయంబును దిగంబరభావము సాంద్రధూళిధూ
సరితశరీరముఁ జెలువుచండ మెఱుంగమి యెల్లచోటులన్
దిరుగుచు నున్కియున్ గలిగి తెల్లము చేసె యశోదపట్టి దా
హరిహరు లేక మౌటఁ దనయం దతిశైశవవిభ్రమంబునన్. (జ) 368

క. అలకలును ముద్దుఁజెక్కులు
వలుఁదతొడలు మెడలు నడలు పలసినయెడలున్
చెలువుగఁ బుడుకుచు వెన్నుఁడు
వెలఁదులఁ జొక్కించి పుడుకువేఁదుఱుఁ గొలిపెన్. (ఆం) 369

చ. అసదృశసర్వశాస్త్రనిచయంబుల క్రొవ్వు పురాణపంక్తిలో
మిసిమి సమస్తవేదముల మీఁగడ మంత్రచయంబులోనియ
య్యసురు విశిష్టధర్మములయుక్కు తపంబులచేవ యంచు నిం
పెసఁగఁగఁ నీదు నామము మునీంద్రులు సెప్పుదు రర్థి నచ్యుతా!(ఆం)370

ఉ. ఆడఁగఁ గెంజడల్ దొలఁకి యాడఁగ జాహ్నవి దిక్కు లెల్ల న
ల్లాడఁగ భూతధాత్రి యసియాడఁగ నాకము నాకసంబు నూఁ
టాడఁగ ముజ్జగంబుఁ గొనియాడఁగ నిచ్చట నీవు తాండవం
బాడఁగ గౌరి నిన్ సరసమాడఁగఁ జేరు నటా మహానటా! (ఇ) 371

శా. ఆడెన్ దాండవ మార్భటిన్ బటహాలీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాటకరోటికోటరకుటీకోటీలుఠత్సింధువీ
చీడోలాపటలీపరిస్ఫుట తరస్ఫీతధ్వని ప్రౌఢిమన్. (ఆం) 372

సీ. ఆయు వగ్గలముగా నాశీర్వదించుచో నేపుణ్యుఁబురుడింతు రెల్లవారు?
జనులకు నేమహాత్మునిపురాణము సర్వ వర్ణాశ్రమాచారనిర్ణయంబు?

ఏయయ్య చేసినయీశ్వరస్తోత్రముల్ పఠియించినను మృత్యుభయము వాయు?
... ... ... వీర శివలింగములఁ బ్రతిష్ఠించి నెగడె ?

గీ. నట్టిలోకైకమాన్యు మహానుభావు
సుతునిఁగాఁ గాంచి వెలసిన సుకృతమయుని,
ఘను మృకండుమునీంద్రునిఁ గరివిభుండు
గనియెఁ దొలుమేనిసుకృతపాకమునఁ జేసి. (ఆం) 373

సీ. ఆరఁగా బండినయల్లనేరెడుపండు మెఱుఁగున మెఱుఁగారుమేనివాఁడు,
వెడవెడ విరిసినవిరిదమ్మి ఱేకులఁ దెగడుకన్నులు గలమొగమువాఁడు,
మెండైన యేనికతుండంబు మెచ్చని యిరుదోయిచేతులఁ బరఁగువాఁడు,
తొమ్మిదిరూపులతుమ్మెద వాయని పువ్వుఁదామర గలబొడ్డువాఁడు,

గీ. కలిమిముద్దియ యురమునఁ గలుగువాఁడు
గడఁగి మున్నీటిసెల యైనయడుగువాఁడు
వన్నె గలపైఁడిచీరలవన్నెకాఁడు
నేడు నాచూడ్కిచుట్ట మై నిలిచె ననుచు. (ఆం) 374

శా. ఆహాకావ్యము ! మేలుమే లనమి యన్యాయంబు వో శారదా
ద్రోహం బేటికిఁ గట్టుకో ననుచు సంతోషించు నట్లుండు న
య్యూహాదుల్ విని సత్కవీంద్రుఁ డితరుం డొచ్చెం బపేక్షించు సం
దేహించుం దనసొమ్ము వోయినగతిన్ దీనత్వముం బొందుచున్. (జ) 375

సీ. •త్తుంగకర్కశవృత్తస్తనంబున నద్వైతభావన యతిశయిల్ల,
నత్యంతశూన్యతాయత్తమధ్యంబున నాస్తికతత్త్వంబు విస్తరిల్ల,
స్నిగ్ధారుణారుణముగ్ధాధరంబునఁ బ్రాభాకరాపూర్వశోభ దొలఁక,
విటమనోవిదళనస్ఫుటకటాక్షంబుల భేదసిద్ధాంతంబుపెంపు మిగుల,

గీ. మేన వైశేషికప్రభ గానఁబడఁగ
నొప్పుదురు వారకామిను లిప్పురమునఁ
దలఁపఁ గేవలకామశాస్త్రంబె కాదు
నిఖిల శాస్త్రంబులును నింపు నెగడు ననఁగ. (ఆం) 376

సీ. ఊఁకరల్ గొట్టక యుబ్బసం బందక వెఱవక దేహంబు విఱుచుకొనక,
నిడుచన వెట్టక నిద్దొట ... తరవాయి దప్పక తడవికొనక,
అక్షరాస్పష్టత యతిగీతనష్టత కాకుండ నర్థంబుగానఁబడఁగ,
నయ్యైరసంబున కనురూపముగఁ బెక్కు రాగముల్ ఫణితులు బాగువుట్టఁ

గీ. తెలుసుకొనను ... వుదోప
కంతకంతకు వేడుక లతిశయిల్లఁ
జదువుకొన్నారు వీరలచదువుఁబోలఁ
జదువలే దనిపొగడిరి సభికవరులు. (జ) 377

శా. ఓలక్ష్మీపతి ! యోపురాణపురుషా ! యోపుణ్యసంకీర్తనా !
యోలోకేశ్వర ! యోగజేంద్రవరదా ! యోద్వారకావల్లభా !
యోలీలామనుజావతారనటనా ! యోకృష్ణ ! యోయచ్యుతా !
యోలిన్ నాదుమనస్సరోవరములో నోలాడవే యోహరీ ! (ఆం) 378

చ. కదలదు తేరు రథ్యములు గట్ట నశక్యము సూతుఁ డంటిమా
ముదుసలి చక్రముల్ సరసమోపుఘటిల్లని వల్ల నారియుఁ౯
గుదిగొను నమ్ము శార్ఙ్గమునకుం బనుపడ్డదిగాన వింతపెం
పొదవఁ బురత్రయంబు నెటు లోర్చితివో త్రిపురాంతకేశ్వరా ! (ఆం) 379

చ. కమలజకృష్ణశంకరులు కాంచననీలపటీరవర్ణు లా
గమనగచంద్రధారు లఘకంసపురారులు హంసతార్క్ష్యగో
గమనులు జన్మపోషలయకారులు వాక్కమలాంబికేశ్వరుల్
శమకరుణావిభూతిగుణసక్తులు ప్రోతురు మమ్ము నెప్పుడున్. (జ) 380

సీ. కమలజాతసుమ్మఁడు గొమరుండుఁగూడి నీమూర్తియుఁ గీర్తియు మూదలింపఁ
జతురాస్యుచదువులు జననియుఁ గూడి నీ యునికియు మనికియు నుపచరింప
హరిశిరోమాల్యంబు వరధనుఃప్రథయు నీ యడుగును మడుగును నంగవింప,
శివుసిరథంబును జెవికుండలములు నీ యునికియు మనికియు నుపచరింప,

గీ. ననుసరింపఁగ నేర్తు వీ వఖిలజగము
జగము లొగిఁ బ్రోవ నిల్చిన జగదధీశ !
ఈశ ! వాణీశ ! నిర్మలహృదయవాస !
వాసుదేవ ! జగత్త్రియావాస ! దేవ ! (ఆం) 381

సీ. కమ్మలు నటియించుగతులకుఁ గడు మెచ్చి చెక్కులు చిఱునవ్వు సేసచల్ల,
బిగువుచనుంగవబింకంబునకు మెచ్చి లీలమైఁ జూపు నివాళి సేయ,
జఘనంబు చేసినశౌర్యంబునకు మెచ్చి వేనలి తగఁ బువ్వువృష్టిఁ గురియ,
నూరుకాండంబునొయ్యారంబునకు మెచ్చి మొలనూలుకైవార మెలమిఁజేయఁ

గీ. జెమటఁ గరఁగినతిలకము సెదరఁ గురులు
గలఁగ వదనము విరిదమ్మిచెలువుఁ దెగడ
మదనసమ్మోహనమందలి మగతనమున
మెఱయుగోపాంగనలపొందు మెచ్చె శౌరి. (ఆం) 382

మ. కరథక్కారవవాద్య మి-పొదవ గంగాతుంగరంగత్తరం
గరవప్రస్ఫుటతాళసమ్మిశ్రితతత్కంజాతపుంజస్ఫుర
ద్వరపుష్పంధయమంథరధ్వనులు గీతం బొప్పఁ దౌర్యత్రికం
బిర వై యుండఁగ నీదు తాండవమహం బేపారు సర్వేశ్వరా! (ఆం) 383

ఉ. కాటుక చేతులున్ మొగము గాఁ బులుమాడుచుఁ దల్పవస్త్రముల్
చీటికిమాటికిం దరలి చిందఱవందఱచేసి యాడుచున్
మీట నడల్చ నేడ్చుచును మెత్తనిమాటల బుజ్జగించి ము
ద్దాటకుఁ జొచ్చినన్ నగుచు నట్లమరెన్ హరి శైశవంబునన్. (జ) 384

సీ. చనుఁగవఁ బయ్యెద జాఱంగ జాఱంగఁ గరమూలమున నంటఁ గదిమి కదిమి
వేసలి వెడవెడ వీడంగ వీడంగ నెలమి మూఁపునఁ జాల నిఱికి యిఱికి,
నుదుటిపై నలకలు సెదరంగఁ జెదరంగ నల్లని ముంజేత నదిమి యదిమి,
పొడతెంచుచెమటలు పొదలంగఁ బొదలంగ నడరునూర్పులచేత నడఁచి
యడఁచి,

గీ. చన్నులును జేతికలశంబు సరసమాడ
నవ్వు నమృతంబుఁ దమలోన నవ్వులాడ
సిగ్గు తమకంబు వినయంబుఁ జెంగలింప
వెలఁదియమృతంబు వడ్డించె విబుధతతికి. (జ) 385

[గూఢచతుర్థి]

సీ. చూడ్కి మోమున నాభి సువిహారయోగ్యత వలరాజుబావి జావళము సేసి,
యెలయింత బొమల మైమెలఁకువ మాటల మరువింటిరసము లేఁబరము సేసి
కళలఁ దనుప్రభ గతి నటనంబున శారదమెఱుఁగుగజంబు గెలిచి,
యెలమి నవ్వునఁ గుచముల నిటలంబున మొలకవెన్నెలమొగ్గముంపు దింపి,
గీ. పలుక నేర్చినరత్నంపుఁబ్రతిమ లనఁగఁ
దిరుగ నేర్చినవెన్నెలతీగ లనఁగఁ

బొంద నేర్చినపుత్తడిబొమ్మ లనఁగ
నొప్పుదురు కామినీమణు లప్పురమున. (ఇ) 386

మ. జయనారాయణ పుండరీకనయనా! శార్ఙ్గీ! జగన్నాయకా!
జయ పీతాంబర! భక్తవత్సల! విరించస్తోత్రపాత్రక్రియా!
జయ జంభారివిరోధివిక్రమ కళాశ్లాఘావిఘాతక్రమా!
జయ గోవిందః ముకుందః మంథరధరా! శౌరీ! మురారీ! హరీ! (అం) 387

చ. తమకముతోడఁ దల్లియును దండ్రియు నొక్కట ముద్దువేఁడ సం
భ్రమమున వచ్చి తల్లి ముఖపద్మముఁ దండ్రి ముఖంబు లైదు వే
గమ తనయాఱుమోములను గైకొని ముద్దిడు మేటివేలుపుం
గొమరుఁడు నాదువాణికి నకుంఠితశబ్దము లిచ్చుఁ గావుతన్. (ఇ?) 388

సీ. తియ్యవెల్లువ యనుతెల్లదామరలోనఁ గొమరారునిద్దంపుగ్రుద్ద (గుబ్బ?) యనఁగఁ,
గొడుకుఁ జూడఁగ వచ్చి కడు నిరవైసను నిలిచినమంచుగుబ్బలి యనంగ,
ముక్కంటికొండకు నెక్కుడుగాఁగ వెన్నుండు పాటించినకొండ యనఁగ,
నేఖులనెలఁత నిండెలమి (?) వేడుకకు నై పట్టినముత్తెపుబంతి యనఁగఁ

గీ. బుడమిముద్దియ గందంపుఁబూఁతతోడి
చన్నుఁగవఁనాగఁ జుక్కలసంగడీల
గనియొకో యనఁ దెలుపులగద్దె యగుచుఁ
దెల్లమిగ నొప్పు నత్తెల్లదీవిమీఁద. (అం) 389

శా. ధాటీధూళియు బోలెఁ బుష్పరజముల్ దట్టంబుగా నుల్లస
ద్ఘోటీకోటులమాడ్కిఁ జూతతరువుల్ గ్రొవ్వారఁ జంచచ్చల
త్పాటీరానిలలోలపల్లవము లుద్యత్ఖడ్గసంఘంబుగాఁ
బాటిల్లెన్ వనవాటిఁ జైత్రుఁడు జితప్రాలేయసంరంభుఁడై. (ఇ) 390

సీ. నారాయణునకుఁ బ్రణామంబు గావింతు నడుగులు కెరఁగుదు నచ్యుతునకుఁ,
గైటభారికి నమస్కారంబు వాటింతు మ్రొక్కు సేయుదు నాదిమూలమునకు,
వందనం బొనరింతు వాసుదేవునకును దండ మొనర్తు గదాధరునకుఁ
బ్రణతిసంపాదింతుఁ బరిపూర్ణమూర్తికి నంజలి ఘటియింతు నఖిలపతికి,

గీ. ననుచు నానందభరితులై యమరదైత్య
మునినరోరగముఖ్యులు వినతు లగుచుఁ

గొలువ నొప్పుజగత్పతిఁ గొలుతు నిన్ను
నఖిలభూతాత్మ ! యాదినారాయణాత్మ ! (ఆం) 391

ఉ. పూర్వకవీంద్రులం గొలుచుపూనికి నిప్పటివారిఁ గొల్తు ని
ర్గర్వత నిక్కవీంద్రులు పురాణకవీంద్రులకంటెఁ దక్కువే?
యుర్విని నేఁటివా రగుట యొచ్చెమె? నేఁడును దామ్రపర్ణిలోఁ
బూర్వపుముత్తియంబులను బోలినమౌక్తికరాజి లేదొకో? (జ) 392

ఉ. భారవిఁ గాళిదాసు శివభద్రుని మాఘుని బాణు భామహుం
జోరు మయూరునిం దలఁచుచున్ మఱియుం కవులౌ విదగ్ధు లె
వ్వారలు వారి నెల్ల ననవద్యుల నామ్యులఁ బ్రస్తుతింతు సం
సారసుఖైకసారవిలసత్కవితావరవైభవార్థినై. (ఆం) 393

చ. మదషను మందెమేలమును మందటయుం దమకంబు వేడ్కయుం
గుదిగొనియున్న జవ్వనపుఁ గొమ్మలకాంక్ష యెఱింగి యెంతయున్
బ్రిపులని కౌఁగిలింతలను బింకపుఁ గ్రీడ నఖక్షతాదులన్
మదనగురుం డనంగసుఖమర్మములం దనిపెం బ్రవీణుఁడై. (ఆం) 394

సీ. మేరురోహణముఖభూరిమహాశైల కులజనకాయితగోపురంబు,
సోమసూర్యాద్యనానామహస్సముదయ జననీభవద్వప్రచక్రశతము,
అభ్రగంగాయమునాదిప్రవాహసంఘాతధాత్రీభూతకేతనంబు,
సౌదామనీశక్రచాపపురస్సరద్యుతిదేశికాయితతోరణంబు,

గీ. నిఖిలపాతాళపాతాళ నిమ్నపరిఖ
మూర్ధ్వలోకోర్ధ్వలోకాయితోచ్చసౌధ
మసదృశానేకశుభవిభవాస్పదంబు
పుణ్యసులభంబు వైకుంఠపురవరంబు. (ఆం) 395

సీ. రాగంబు లగుశుద్ధరాగసాళగరాగ సంకీర్ణరాగముల్ చక్కఁదీర్చి,
స్త్రీపున్నపుంసకరూపంబులను వాని వేళలు మైత్రియుఁ వెలయఁ జూపి,
తానప్రపంచవిస్తారంబు చూపుచోఁ గ్రొత్తతానంబులు గొసరికొసరి,
స్వరమూర్ఛనా గ్రామజాతి శ్రుతులలక్షణములకు నపుడులక్ష్యములుగ[?]

గీ. ......లింపు లొదవంగఁదగిన శుద్ధ
దేశమార్గములును రాణఁ దేటపడఁగ

సకలమోహనసంగీతచతురుఁ డగుచు
వేణుగానంబుఁ బ్రకటించె విశ్వగురుఁడు. (జ) 396

సీ. లసదురఃస్థలమునఁ బస నైనగళమున విలసితలీల శ్రీ నిలిపినారు,
చరణంబుపట్టున జడలలోచుట్టున ననువొందఁగా గంగ నునిచినారు,
భవ్యగుణంబున దివ్యదేహంబున నొఱపు మీఱఁగ భూతి మెఱసినారు,
తిరముగా మూఁపునఁ గర మొప్పురూపునఁ బొలుపొందఁగా
ధాత్రిఁ బూనినారు,

గీ. తెల్ల గలయిండ్ల నిలిచి వర్తిల్లినారు
ఇరువు రిరువురభార్యల నేలినారు
పెక్కు మొగములకొడుకులఁ బెనిచినారు
హరిహరులు వీరు సర్వలోకాధిపతులు. (జ) 397

## [గూఢచతుర్థి]

సీ. వలపుల బొమల మైనిలుకడఁ గన్నులఁ బువ్వుచాపధ్వజస్ఫూర్తిగలిగి,
కాంతి గంధంబునఁ గరములఁ దనువల్లిఁ గనకపంకజదామగరిమఁదాల్చి,
కురులను బొడ్డునఁ బిఱుఁదునఁ గుచమున ఘనసరసీచక్రగతి వహించి,
నేర్పున నగవున నిగ్గున మొగమున శారదామృతభానుసమితినొంది,

గీ. కౌను నఖములసొబగును గల్గి చూపు
హరిమణి శ్రీసమానత నతిశయిల్లి
రూపశుభలక్షణమ్ముల నేపుమిగిలి
వెలఁదు లమరుదు రవ్వీట వేడ్క తోడ. (జ) 398

చ. వల పెటువంటిదో పుసలివాఁ డనవచ్చునె యద్దిరయ్య! ప
లుకులజవరాలు దాఁ జదువులోన జపంబులలోనఁ బాయ చ
గ్గలముగ నెల్లప్రొద్దును మొగంబునఁ గట్టినయట్లు యుండు నీ
నలువకు నంచఁ గాముకులు నవ్వవిధాత శుభంబు లీవుతన్. (ఇ) 399

చ. వెడవెడఁ గౌఁగిలించుచును వేమఱుఁ జుంబనలీల మోవియుం
దొడుకుచు బుజ్జగించుచును దొంగలిచూపుల లోన సిగ్గుతో
సుడివడుభీతి వాపి మదిసోఁకునకున్ సొగియంగఁ జేసి యే
ర్పడ రతిసౌఖ్యముల్ మరపె బాలలకుం గమలాక్షుఁ డింపుగన్. (అం) 400

చ. వెనుకకుఁ బోక యీయనక వేసటఁ బొందక పంక్తిపంక్తికిన్
బెనుపక కానమిన్ బ్రమసి బెగ్గిల కంతయు మున్న చూచుచున్
గనుఁగొని యక్షరాక్షరముకందువ దప్పక యేకచిత్తుఁ డై
యనుపమభక్తితోఁ జదువునాతని వాచకుఁ డంద్రు భూవరా ? (జ) 401

సీ. శృంగారవిభుఁ డని చెప్పంగ నేటికి భావజుఁ గొడుకుఁగాఁ బడసె ననినఁ?
గారుణ్యనిధి యని గణుతింప నేటికి సృష్టిరక్షణనిత్యశీలుఁ డనినఁ
బరమపావనుఁ డని ప్రణుతింప నేటికి గంగఁ బాదంబునఁ గాంచె ననినఁ?
ఘనవైభవుం డని కొనియాడ నేటికిఁ గలిమిముద్దియ కులకాంత యనిన ?

గీ. విష్ణుఁ డఁట యద్గ నేటికి విశ్వమూర్తి
యనఁగ ? నచ్యుతుఁ డఁట నిత్యుఁ డనఁగ నేల ?
యని మునీంద్రులు గొనియాడ నతిశయిల్లు
నమ్మహాత్ముండు సర్వలోకాధికుండు. (జ) 402

శా. శ్రీరామాస్పద మైన పేరురముపైశ్రీవత్సచిహ్నంబుఁ దా
నారూఢంబుగఁ దాల్చి శ్రీకిఁ దగుచిహ్నల్గల్గువాఁ డౌట సొం
పారం దెల్లమి సేయుదేవుఁడు కృపావ్యాసక్తుఁ డై మామక
ప్రారంభంబు నిరంతరాయశుభసాఫల్యంబుఁగాఁ జేయుతన్. (జ) 403

శా. శ్రీనిత్యాశ్రయ మై మహామధురిమ శ్రీ పేర్మికిన్ సంతత
స్థానం బై యనపాయ మై యనఘమై తాపఘ్న మై స్వచ్ఛమై
యానారాయణుశుద్ధసత్త్వగుణ మీయాకారముం దాల్చెనో
నా నొప్పారుఁ బయఃపయోధి నిఖిలానందైకసంధాయి యై. (ఆం) 404

శా. శ్వేతద్వీపము దుష్కృతాంధతమసచ్ఛేదక్రియాదీప ము
ద్భూతాఖండసుఖస్వరూప మమరస్తోమాద్భుతాటోప ము
త్ఖాతామర్త్యరిపుప్రతాపము నతధ్వస్తోగ్రసంతాప మ
జ్ఞాతాక్షప్రియరూప మార్యహృదయప్రక్షేప మొప్పుం దగన్. (ఆం) 405

క. సుతుఁడుఁ దటాకము దేవా
యతనము నల్లిల్లు నిధియు నారామము స
త్కృతియు ననుసంతతులయం
దతిశయము ప్రబంధ మెపుడు నక్షయ మగుటన్. (జ) 406

సీ. సూర్యునిఁ బోలుకౌస్తుభముపైఁ బ్రాలంబ మనియెడుపరివేష మతిశయిల్ల
మేఘంబుసరి యైనమేనిపైఁ బీతాంబరప్రభ యనుతటిత్ప్రభలు మెఱయ,
నిండుఁజందురు నవ్వుసెమ్మొగంబున సుప్రసన్నత యనుసుధాసార మమర,
జలజంబుఁ దెగడెడుచరణంబునను దివ్యదీద్ధిక యనుపూవుఁదేనె దొరఁగ,

గీ. హస్తముల శంఖచక్రగదాంబుజంబు
లమర ధర్మార్థకామమోక్షములమాడ్కి
నఖిలలోకేశుఁ డాద్యుఁ డవ్యయుఁ డమేయుఁ
డమ్మహాత్ముండు మెఱయు నారాయణుండు. (ఆం) 407

చ. స్ఫురదురుకర్ణతాళమునఁ బుట్టినగాడ్పున విఘ్నవారిదో
త్కరములఁబాఱఁదోలి మదధారల విశ్వముఁ దొప్పదోఁచుచున్
గరివదనుండు దోడుపడుఁగాత! మహాగణనాథుఁ డర్థితోఁ.
గరివదనస్తవంబు పని గైకొని సల్పిన నాకు సత్కృతిన్. (జ) 408

## రంగనాథుఁడు-[?] (ఇ)

చ. అదలనితేరు తేరునకు నాదరువై తగువిల్లు వింటికిం
గుదు రగునారి నారిపయిఁ గూన్కుశరంబు శరంబు బొడ్డునం
బొదలినయంత యంతముఖముల్ నిజవాసము లైనగుట్టముల్
చెదరక నీకు నెట్టిపని సేయునయా! గిరిజాధినాయకా! (జ) 409

సీ. ఓజు చే ముట్టక యొగ్గానఁ బట్టక చక్కఁగా దివిఁ బాఱుచక్రములును,
లాయానఁ గట్టక లలి మేఁత వెట్టక వర్ణహీనం బైనవారువములుఁ
తవన వెట్టక జీవితము కాసు ముట్టక సత్త్వసంపదఁ జూపుసారథియును,
కడచీలఁ దట్టక ఘనముగా మెట్టక గంభీరసంపద గలుగునిరుసుఁ,

గీ. గలిగి తనరారునరదంబుఁ గడఁక నెక్కి
త్రిపురవిజయంబుఁ జేకొన్న దేవదేవుఁ
డిందుశేఖరుఁ డానందమందిరుండు
మనలఁ గరుణావిధేయుఁడై మనుచుఁ గాత! (ఆం) 410

ఉ. గోశతపంచవార్ధులును గోయుగవార్ధులు గోత్రివార్ధులున్
గోశరవార్ధులున్ పదితగోశత (వార్ధులు) పంచవార్ధు లా
కేశవతల్పపద్మభవకేకిపవాహనదానవేశదే
వేశుల కిచ్చునట్టి పరమేశ్వరుఁ డీవుత మా కభీష్టముల్. (జ) 411

## రామయ్య - వాసిరాజు. [బృహన్నారదీయము] (ఆం)

శా. అంభోజాసనమానసాంబుజభవుం డధ్యాత్మవిద్యోన్నతా
రంభుం డిద్ధతపోవిశేషశమితప్రస్ఫీతఘోరాఘసం
రంభుం డంచితశాంతిసంయుతుఁడు భారద్వాజమౌనీంద్రుఁ డు
జ్జృంభించెన్ వరసప్తసంయమిజనశ్రేణీసముద్భాసి యై. (ఆం) 412

సీ. మల్లికానవసముత్ఫుల్లపాటలపుష్పవల్లరీసౌరభ్యవాసితంబు,
కాసారనీరజ వ్యాసక్తమధుకరీఝుంకారముఖరితాశాముఖంబు,
పద్మాప్తకిరణ ప్రభావలీసంతప్యమానసర్వంసహామండలంబు,
దహనహేతిచ్ఛటాదందహ్యమానదుర్గమ ఘోరకాంతారసముదయంబు,
గీ. చటులతరనిర్భరోష్ణసంసక్తవాత
శోషితాశేషనిమ్నగాస్తోమజంతు
సంచయంబును నగు ఘర్మసమయ మేచి
పర్వె నతిసాంద్ర మగుచు దిగ్భాగములకు. (ఆం) 413

సీ. విశ్వంభరాచక్రవిజయలక్ష్మీఘనస్తనపరీరంభదోస్స్తంభయుతుఁడు,
బాడబానలశిఖాభంగభానుప్రభాద్యోతమానప్రతాపోజ్జ్వలుండు,
కుంభీనసాధీశగురుపద్మసంభవస్ఫుటశేముషీకళాభూషణుండు,
సురసింధుశరదభ్రశుభ్రాభ్రకావభ్రవిభ్రమస్థిరయశోవిశ్రుతుండు,
గీ. విపులకోదండనిర్ముక్తవిశిఖనివహ
దారుణోదగ్రదహనదందహ్యమాన
సమదశాత్రవరాజన్యచటులవిపిన
సముదయుండు భగీరథక్ష్మావరుండు. (ఆం) 414

## రామయ్య–ఆంధ్రకవి. [విష్ణుకాంచీమాహాత్మ్యము] (ఆం)

మ. అరుణస్ఫూర్తి సురేంద్రదిక్తటమహావ్యాప్తిన్ విజృంభింపఁగా
శిరసుల్ వంచెఁ జకోరవర్గములు హెచ్చెం జక్రవాకంబు లా
తురతం గైరవపంక్తి దూలెఁ గడు సంతోషించెఁ బద్మంబు లొ
క్కరిచే టొక్కరిమేలు పొమ్మనుట నిక్కం బైనచందంబునన్. (ఆం) 415

శా. ఇష్వాసక్రకచాదిసాధనపరాహీనప్రభాంగీకృతా
భిష్వంగద్యుమణిద్యుతిప్రకరుఁ డై పీతాంబరాలంకృతున్

విష్వక్సేనుని గౌస్తుభాభరణు నుర్వీశ్రీయుతుం గొల్చి యా
విష్వక్సేనుఁడు సంచరించు గణరాడ్విఖ్యాతుఁ డాచక్కటిన్. (అం) 416

క. కాంచనబహువిధరత్నా
భ్యంచిత మై చిత్రరచనబంధురతర మై
మించి సురాసురముఖ్యులు
గాంచి నుతింపంగఁ గాంచి కాంచిం బోలెన్. (అం) 417

సీ. గజకచ్ఛపంబు లెరునికుక్షిలోనికినిరాది (టి) [?] భిక్ష......
సకలలోకములు నేజవసత్త్వసంపన్ను ఖురశికాయాత్రకు గోష్పదంబు,
బలభేదివజ్ర మేయలఘు ఱెక్కలలోనఁ జిక్కి పెంపే (ఁదిన) చిఱుతపుల్ల,
కద్రూతనూజవర్గంబు లేమహనీయు నాగ్రహంబునకుఁ జొక్కాకుపదువు,
గీ. లతఁడు హరిఁ గొల్వ నచ్చోటి కరుగుదెంచె
శంఖచూడసుదక్షిణక్షమపయోద
వాహనోద్గారతాఖిలసాహసైక
జనితదాక్షిణ్యుఁ డైనట్టివినతపట్టి. (అం) 418

సీ. తనుఁ బట్టి విడువనితగవరి యితఁ డంచు మృడునకు నొకవంక మేలుసేసెఁ,
దనకుఁ బూర్వాశ్రితుఁ డని సురాధ్యక్షుని శతకోటిధనసమన్వితునిఁ జేసెఁ
దనపాదములు నితాంతముఁ జేరి కొలువఁగ రాజీవశత్రుని రాజుఁ జేసెఁ,
దనకు గుణంబుగాఁ దగిలియుండుట సూచి యహికులాధిపుని భోగాఢ్యుఁ
జేసె,
గీ. ననుచు మిన్నక కొనియాడినను నిజంబ
యగుచుఁ దనయందుఁ గాన్పించు ననుదినంబు
జగతి నొప్పారు నీ శైలచక్రవర్తి
యసమతరకీర్తి నిత్యకల్యాణమూర్తి. (అం) 419

శా. ద్రాక్షాపాకనవీనవైఖరిఁ బ్రబంధస్తోమముల్ సెప్పి య
ధ్యక్షుం డయ్యె మహాకవీంద్రులకు నాహా ! యెట్టిపుణ్యాత్ముఁడో
సాక్షాద్భారతి గాక యీతఁడు మనుష్యవ్యక్తియే యంచు సం
లక్షింపం దగు కాళిదాసుఁ గృతిలీలావ్యాసుఁ గీర్తించెదన్. (అం) 420

సీ. పడియలలోపలఁ బడి యలందురుఁ గాక గండుమీనము లంబకముల సరియె?
పొదలు మాటుగ నేచి పొదలుట గనుఁగాక యలరుగుత్తులు కుచావళులసరియె?

గహనంబులోననగహన మై చనుఁ గాక చమరవాలములు కేశములసరియె?
ఘనములయొద్ద నఘనము లై మనుఁ గాక తళుకులు మించుగాత్రములసరియె?

గీ. కలువ లొండెను జక్రవాకంబు లొండెఁ
దేఁటు లొండెను బువ్వారుఁదీగె లొండెఁ
గాక యని ప్రస్తుతింప నాకాంచిలోన
సతులు విలసిల్లుదురు హేమలతలుఁ బోలె. (అం) 421

చ. రసికత సోలిసోలి యనురాగరసంబునఁ దేలితేలి యా
కసములు మెట్టిమెట్టి తమకంబునఁ గాంతలఁ బట్టి పట్టి యా
దొసఁపులఁ జిక్కి చిక్కి కడుదూరముగాఁ జని తక్కితక్కి పై
కొస రెసఁగం జకోరికలు కోరిక లీరిక లొత్త మత్తిలున్. (అం) 422

సీ. రాలుకారాకులఁ గ్రాలుమాఁకులఁ గలయ భూజములెల్లఁ గానరాఁగ,
సతులడెందంబుల నతులకుందంబుల వికసనం బాత్మకు వ్రేఁగు గాఁగ,
బొలుచుదారకముల గెలుచుకోరకముల విరవాదితీగెలు విఱ్ఱవీఁగఁ,
జంపకజాలంబు నింపక యోలంబుగొని దవ్వులనె తేఁటికోలము లాఁగ,

గీ. నెంతయును వింత యిది యన నంతనంత
సంతతాక్రాంతమదననితాంతతాంత
కాంతకాంతాకదంబక స్వాంతములకు
సంతసము నింప వచ్చె వసంత మంత. (అం) 423

సీ. శబ్దశాసనకావ్యసంఘట్టనక్రమానందితబుధవర్యు నన్నపార్యు,
నుభయభాషారచనోన్నిద్రభద్రవచోరాజిఁ దిక్కనసోమయాజి,
లక్ష్యలక్షణకళాలంకారసౌభాగ్య సత్కావ్యవిన్యాసుశంభుదాసు,
ఛందోనిబంధనచాతురీధౌరేయ వాగ్ధాము వేములవాడభీము,

గీ. రసికజనపద్మదిననాథు రంగనాథుఁ,
బ్రకటకృతికర్మనిస్తంద్రు భాస్కరేంద్రు
నమితరసభావు శ్రీత్రిపురారిదేవు
సూక్తినిధాము నాచనసోముఁ దలఁతు. (అం) 424

సీ. శ్రుతులును నిర్జరస్థితులును మగిడింప నిగిడింపఁ జాలునినేర్పుకలిమి,
ధరణియు రిపుగర్వసరణియు ధరియింప హరియింపఁ జాలునీయలవుకలిమి,

భ్రాత నర్మిలిఁ గన్నమాతను బాలింప లాలింపఁ జాలునీలావుకలిమి,
గేహిని రవిసుతావాహిని సాధింప ఖేదింపఁ జాలునీపేర్మికలిమి,

గీ. జనులఁ బాతకజనులను జరుప నురుప
సలరునీనేర్పుకలిమి చిహ్నములు నీకు
మత్స్యకూర్మమహీధరమనుజసింహ
ఖర్వరామత్రయీబుద్ధకల్కిగతులు. (ఆం) 425

## రామరాజు—ఎలుకుర్తి. [రామలింగశతకము] (జ)

సీ. గంగాప్రవాహంబు కన్నెగేదఁగిఱేకు నమృతాంశురేఖ ముత్యాలసేస,
యురగేంద్రహారంబు కురువిందములపేరు విసము కప్పురముతో వీడియంబు,
ప్రాంతకంకటికాలు పంకసంజాతంబు జింకపిల్లయు రాచచిలుకబోచ,
యిభచర్మచేలంబు నింద్రగోపపుఁబట్టు భూతిపుంజము నవ్యపుష్పరజము,

గీ. హేమగోత్రకోదండంబు నిక్షుధనువు
గలుగునర్ధనారీశ్వరాకారమునను
భువనజాలంబుభక్తులఁ బ్రోవుమయ్య !
రాజహంసరథాంగ ! శ్రీరామలింగ ! (జ) 426

## రామలింగయ్య—తెనాలి. [కందర్పకేతువిలాసము] (జ)

ఉ. అక్కమలాక్షిఁ గన్గొనినయప్పటినుండియు నేమి చెప్ప నా
కెక్కడఁ జూచినన్మదనుఁ డెక్కడఁ జూచిన రోహిణీవిభుం
డెక్కడ జూచినం జిలుక లెక్కడఁ జూచినఁ గమ్మగాడ్పు లిం
కెక్కడ వెట్ట యోర్వఁగల నీవిరహానలతాపవేదనన్. (జ) 427

ఉ. కామిని చంద్రుఁ జూచి మదిఁ గందు సరోరుహగంధి మందిరా
రామముఁ జూచి మ్రానుపడు రాజనిభానన సారెకున్ శుక
స్తోమముఁ జూచి యేఁకరును దొయ్యలి కోకిలఁ జూచి కంటఁ గెం
పొమదలీలఁ దాల్చు మదనానలతాపవిషాదవేదనన్. (జ) 428

సీ. తారామనోరంజనారంభ మేదొడ్డు శిలలు ద్రవింపంగఁ జేయు ననినఁ
జాకోరహర్షయోజనకేళి యేదొడ్డుఁ పేర్చి యంభోధి లుబ్బించు ననినఁ,
గుముదౌఘతాపోపశమకృత్య మేదొడ్డు సృష్టియంతయుఁ జల్లసేయు ననిన,
పరనిశాకామినీవాల్లభ్య మేదొడ్డు వర్ణింప సత్కళాపూర్ణుఁ డనినఁ,

గీ. దనకు సర్వజ్ఞశేఖరత్వంబు గలుగ
హితసుధాహారవితరణం బేమిదొడ్డు
ననఁగ విలసిల్లె హరిదంతహస్తిదంత
కాంతినిభకాంతిఁ జెలువారి కంజవైరి. (జ) 429

ఉ. వారిజ! మీన! కోక! యళివర్గ! సితచ్ఛద! సల్లతావనీ!
మీరుచిరాస్య మీనయన మీకుచ మీయలకాలి మీగతిన్
మీరమణాంగి మత్ప్రియ నమేయగతిన్ విరహాతురాననన్
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరుఁ గానరే ? (జ) 430

## రామలింగయ్య — తెనాలి [హరిలీలావిలాసము] (జ)

శా. ఆకరివేల్పుసామిచరణాబ్జములన్ జనియించినారు మం
దాకినితోడుసీడ లయినారు నిజంబుగఁ గమ్రకట్టి దా
మై కమనీయకీర్తి మహిమాతిశయంబున మించినారు భ
ద్రాకృతు లద్రిధీరులు ప్రభాద్రుల మాద్రులు శూద్రు లప్పురిన్. (జ) 431

ఉ ఆలఘృతంబు వేఁడి యగునన్నము నుల్చినముద్దపప్పు క్రొం
దాలిపుకూర లప్పడము ద్రబ్బెడచారులు, పానకంబులున్
మేలిమిపిండివంటయును మీఁగడతోడి దధిప్రకాండమున్
నాలుగుమూఁడుతోయముల సంజులు గంజదళాక్షి పెట్టఁగన్. (జ) 432

గీ. ఉడుపథం బనుములు దోసతొడిమయూడఁ
దామరసబంధుఁ డనుపండు తనకుఁ దానె
వికృతి గనుపింపఁ గనుపట్టువిత్తు లనఁగఁ
దనరె నెఱసంజఁ గెం పగుతారకములు. (జ) 433

ఉ. ఎంతయు రాజుతోడి పగ యేకొదవో ? మధుపప్రసక్తి య
శ్రాంతముఁ గల్గుతమ్ముల ప్రచారము గాదని చూడ నోడి దే
శాంతర మేఁగె నాఁగ నపరాశఁ బతంగుఁడు దాఁగె నట్టి వృ
త్తాంత మెఱింగి సి గ్గొలసినట్టులు గందె సరోరుహంబులున్. (జ) 434

ఉ. ఏటిమహానుభావుఁ డిహిహీ జమదగ్నితనూజుఁ డేడుము
మ్మాటులఁ గాని శత్రుమదమర్దనదక్షుఁడు గాఁడు గోత్రమే

తూఁటుగఁ జేతఁ దల్లిమెడఁ ద్రుంచెఁగదా యని యీసడింతు రౌ
గాటపుపంతగాండ్రు కులగణ్యు లగణ్యుఁలు పుణ్యు లప్పురిన్. (జ) 435

ఉ. కాలధనంజయుండు తనుఁ గాచి దివాకరమత్స్య యంత్రమున్
గీలెడలించి సంధ్య యనుకృష్ణ నుదంచితరూపవిభ్రమ
శ్రీలలితాంగినిం దగ వరించి తమోమయధార్తరాష్ట్రభూ
పాలకసేన నేయుసితభల్లములో యనఁ బర్వెఁ దారకల్. (జ) 436

ఉ. చంగునఁ దాటు ధే యనిన సప్తసముద్రములైన వేగ వా
గెం గుదియింప నిల్చు నడుగెంటనె శస్త్రనిపాతధీరతన్
సంగరరంగవీథిఁ దమస్వామికి గెల్పు ఘటించునట్టి యు
త్తుంగతురంగరత్నములు తొంటిహయాకృతి శార్ఙ్గి పుట్టువుల్. (జ) 437

గీ. భానుశశిమండలంబుల లోనడంచి
యిరులు పెనువానఁ గురియుచు నేపు చూపు
రాత్రి వర్షర్తువునఁ బుట్టెఁ బ్రతిగృహాక
రములఁ బటుదీపవైడూర్యరత్నసమితి. (జ) 438

చ. తెలతెలవాఱ నొయ్య నరుదెంచు నిశాంతరతాంతతాంత లా
చెలువల కింపుగా మెలఁగుఁ జెక్కులఁ గూరినమూర్ఛకుంతలా
వళి సరసంబుగా జడియు వాడినసెజ్జలమీఁది ప్రావిరుల్
దొలఁగఁగఁ జేయు నూడిగపుఁదొయ్యలులంబలె వేగుఁదెమ్మెరల్. (జ) 439

సీ. నీ రింకఁ దొడఁగె వెన్నెలమానికంబుల వేఁడిరాతూఁపుల పిడిసె వహ్ని,
కలఁగె జీవంజీవములనిండుమనములు జక్కవపులుఁగులజాలి వదలెఁ,
గనుమూసెఁ గుముదకాననవిభావిభవంబు శ్రీ లక్ష్మి నిలిచె రాజీవపీఠి,
వాజువాఱఁగఁ జొచ్చె వరుణునిదిక్కున నేర్పడి దీపించెఁ దూర్పువలను,
గీ. తార లుడివోయె వికసించెఁ దరుల విరులు
చంద్రికలు గందెఁ గొలఁకులు చాలఁ దేరె
దీపరుచి దాఁగెఁ దలసూపె రేపటెండ
చందురుఁడు వ్రాలెఁ బొడిచెఁ గంజాతహితుఁడు (జ) 440

ఉ. పున్నమచందమామఁ బొరపుచ్చి సుధారస మొయ్యఁజిల్కుచున్
సన్నముగాఁగ నూరి ఘనసారమునం బ్రతిపాక మిచ్చి మీఁ

ద న్నెఱయంగ సల్కినవిధమ్మున వెన్నెల గాయ నప్పురిన్
సున్నపుమేడ లభ్రపదచుంబిశిరోగ్రుహరాజి రాజిలున్ (జ) 441

క. పురనిధిరక్షకునై ఫణి
పురము వెడలి వెట్టివెట్టి పొంగారుఫణా
ధరపరివృఢుకరణి భయం
కర మగుఁబ్రాకారపరిధి కడు నచ్చెరు వై. (జ) 442

సీ. మదభిన్నకటగళన్మౌక్తికంబులు తొటతొట రాల మస్తవిధూననముల,
ఆనమత్కుతలంబు లగుపదక్రమముల ఘణఘణంకృతి నాభిఘంట లులియఁ,
గీర్తిచంద్రికలయాకృతి దట్టమై ధళధళఁ బర్వ దంతకుంతము లరుచులు,
పుష్కరపూత్కారముల నకాలపువానకారు లెల్లెడఁ దముతార కురియఁ,

గీ. దమకుఁ బరవాహినులలోను దఱియఁ జొచ్చి
క్రీడలాడుట యుచితపుజాడ లనఁగఁ
బెరిఁగి సరయూజలంబుల సరసలీల
గ్రాలఁ జనుచుండు నప్పురి గంధకరులు. (జ) 443

సీ. ముదురుఁజీఁకటిమన్నె మూఁకకుఁ గైజీత మొసఁగుకుంతలముల యొప్పు వెలయఁ,
బండు వెన్నెలరాజు బంటుగా నేలు చక్కనిమొగంబులనిక్కుఁ గని భజింప
బసిఁడిగ్రజేనిఁజేపట్టుకుంచము సేయు జిగి మించుచన్నులబిగువు నిగుడ,
గబ్బియేనికదొర గారాముగాఁగ మన్నించులేనడపుల నేర్పు మెఱయ,

గీ. నూరువులె గాదు రంభ మైయొఱపుఁ దమవ
శమ్ము గావింపఁ, బద నఖచయమె కాదు
విలసనముఁ దార పాటింప, వీటఁ బద్మ
పత్రనేత్రలు చాలఁ జూపట్టుచుంద్రు. (జ) 444

చ. యుగములు వేయు వోవు నొకయుద్ధరువుల్ గణుతించు నంతకే
యుగములు లక్ష చెల్లుఁ బోరి నున్నధనంబు మితింప నమ్మహా
యుగశతకోటు లేఁగు నితరోన్నతవస్తువు లెన్నఁ గీస వె
ల్తిగ నలకాదినాథులుగదే పురిలో మనువైశ్యపుంగవుల్. (జ) 445

ఉ. రాసి సహస్రభానుఫణరత్నములెల్లను బోవఁదన్నుచున్
వాసరభోగిఁ గాలఫణివైరి కడున్ వడి నొక్కి నక్కఁగాఁ
జేసినఁ గ్రమ్మృతద్రుధిరశీకరపూరవిజృంభణం బనం
గా సముదగ్రగతం బొలిచెఁ గ్రమ్మి జపోపమసాంధ్యరాగముల్. (జ) 446

సీ. వలమానచంపకోత్పలమాలికాదిసంగ్రథనచాతురి నెఱకవులఁ బోలి,
దళము గెలిచినసూత్రమున నూల్కొల్పు నేర్పున యోధవీరులపొలుపుఁ దెలిపి,
ఖండితత్వమున రాగము గలపల్లవావలిఁగోయుటల వేశ్యవలపు నెఱపి,
పలుతావు లరసి యెత్తులు పచరించు పెంపున జూదరుల తేప పొడమఁ జేసి,

గీ. తమనిజాంగమరీచులు తత్తపన్య
పుష్పములసావి నిక్కింపుఁబువ్వు లమరు
పేరఁ బేర్కొనుపౌరులఁ గేరికేరి
నవ్వుదురు పుష్పలావికానలినముఖులు. (జ) 447

సీ. వినుతమాణిక్యవంపనమాలికాకాండ కల్పితరోహితాకారరేఖ,
జాలకాననిర్యదాలోలవాసనాగరుధూపపోషితకంధరాళి,
చంద్రశాలాతిగర్జన్మృదంగధ్వాన విరచితపరిఘోషవిభవలహరి,
సంభోగసంరంభసమయవిచ్ఛిన్నముక్తాహారమణికృతకరకనికర,

గీ. మదనమదభారమంథరమత్తకాశి
నీదృగంచలసంచితనిబిడచంచ
లాలతాతల్లజయునై యిలావివిక్త
వర్ష యననొప్పుఁ గాకుత్థ్సవంశ్యనగరి. (జ) 448

ఉ. వేదపురాణశాస్త్రములు వేడుకవిద్యలు, సర్వయజ్ఞసం
పాదనశక్తి నిత్యనిరపాయవిధి ప్రతిపాలనంబు, దా
రాదిమతత్త్వముం గనుట హస్తగతామలకంబుఁ గంట, ధా
త్రీదివిజావతంసుల కరించవ మన్నురిఁ గల్గువారికిన్. (జ) 449

చ. సరళదలత్సరోరుహసారపరాగపరంపరాపరి
స్ఫురితసువర్ణవర్ణమును బూరితదిఙ్ముఖహంసనాదమే
దురమును నై యగడ్త కనుదోయికిఁ బండువుసేయ మ్రోయుఁ ద
త్పురవరలక్ష్మి యెప్పుడును బూనెడుకాంచనకాంచియో యనన్. (జ) 450

చ. సరసులపొందు గల్గనఁగఁ జాలి బహూన్నతచారుశాఖలం
బెరిఁగి మహాద్విజావనమె పేర్మి నిజాయతి గాఁ దనర్చి ని
ర్భరజనతాపసంహరణపాత్రము లయ్యు మహీజవాటికల్
పురివెలి నిల్చె మేటియు నపూజ్యుఁ డగున్ మధుపానుకూలతన్. (జ) 451

## వల్లభరాయఁడు—[వీథినాటకము] (జ)

సీ. చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు విమలదంష్ట్రాప్రరోహములవానిఁ,
బవడంపుఁగొనలతోఁ బ్రతివచ్చు ననవచ్చు కుటిలకోమలజటాచ్ఛటలవాని,
నింద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు కమనీయతరదేహకాంతివాని,
నుడురాజరుచులతో నొఱవచ్చు ననవచ్చు చంచన్మదాట్టహాసములవాని,

ఉ. సిగ్గుమాలిన మొలవానిఁ జిఱుతవాని
నెల్లగాలంబు ములికినాఁ దేలువాని
నర్థి మోపూర నవతార మైనవాని
భైరవునిఁ గొల్వ వచ్చిరి భక్తవరులు. (జ) 452

## వీరయ్య—పిల్లలమఱ్ఱి. [పురుషార్థసుధానిధి] (ఆం)

సీ. కాశకర్పూరనీకాశఁగా భావింపఁ గవితాసిరూఢిఁ బ్రఖ్యాతి నెసఁగు,
యావకారుణదేహయష్టిఁ గాఁ జింతింప మదకుంభియానల మరులుగొలుపు,
నీలజీమూతసన్నిభఁగా విలోకింప సకలమాయాప్రపంచంబు నడచుఁ,
గనకచంపకధామగౌరిఁగా శీలింప నంహస్సమూహంబు సంహరించు,

గీ. శంభుదేవి విశాలాక్షి సదనుకంప
యోగిజనసేవ్య యోగపయోదశంప
శ్రీకరకటాక్షలేశరక్షితనిలింప
ముజ్జగంబుల మొలపించుమూలదుంప. (ఆం) 453

సీ. భర్గభట్టారకుపర్యాయమూర్తికి షాణ్మాతురునికూర్మిజనకునకును,
మేషరాజము నెక్కు మేటిరౌతున కమరాధీశుపొరుగుదిశాధిపతికి,
హరిణవాహనునినెయ్యపుసంగడీనికి సామిధేనీప్రియస్వాంతునకును,
యాయజూకులయిండ్ల యనుఁగుఁజుట్టమునకు స్వాహాస్వధాప్రాణవల్లభునకు,

గీ. దండములు వెట్టెదము మోడ్చెదము కరములు
సేవ యొనరించెదము మమ్ముఁ గావు ప్రోవు

యాగవేదికి విచ్చేయు మారగింపఁ
బ్రథమజన్మలయింటికల్పద్రుమంబ. (అం) 454

## వీరయ్య—పోతరాజు [త్రిపురవిజయము] (అం)

సీ. కపిలజటాజూటగంగాసముత్తుంగ వీచీఘటలు మిన్నువీఁకఁ దాఁకఁ,
బ్రబలబాహార్గళపరికంపితస్ఫార ఢక్కాధ్వనిని దిశల్ పిక్కటిల్ల,
జ్వాలాకరాళభీషణశారదస్థూల శూలయుద్ధప్రభల్ సూర్యుఁ బొదువఁ,
బ్రకటబంధురదీర్ఘపటువజ్రనిష్ఠురపదఘట్టనము లుర్వి యదర నొదవ,

గీ. విమలశార్దూలచర్మాంచలములు దూల
మహితమండనఫణిఫణామణులు గ్రాల
నసమరౌద్రరసావేశ మావహింప
నారభటి భూరితాండవం బాచరించె. (అం) 455

సీ. తమ్ముల బెదరించుతళుకువెన్నెలపాప గన్నెగేదఁగిఱేఁకు గారవింపఁ
బదినూఱుపడగలఁ బఱపైనపదకంబు సవడిము త్తెపుబన్నసరముఁ బ్రోవ,
మిసమిస మన మించుభసితాంగరాగంబు పరఁగుచందనచర్చఁ బరిఢవింప,
మెఱయుమువ్వన్నెలకఱలపుట్టముకొంగు చెఱఁగుల నునుపట్టుచేలఁ బెనుప,

గీ. మించి తలమీఁద నురముపై మేనఁ గట్టి
యీడుదోడుగ నుమతోడఁ గూడి జగము
లెల్ల రక్షించు నిను భజియింతు మెపుడు
భయదదురితలతాదాత్రః ఫాలనేత్రః [అం) 456

సీ. తల్లిదండ్రులపొందు దప్పి యొండెడ నార్వురువిదలయెద్దియువ నెదిగినతఁడు,
కడు వడి బలుగొండఁ గాఁడిపాఱినమేటి ఘనసాయకము కేలఁ గ్రాలునతఁడు,
కమియారఁగాఁ బాఁపకవణంబుఁ దిని యాడు తెక్కలతురగంబు
నెక్కినతఁడు
భోగిపాన్పున నిద్ర భోగించుదేవునిఁ దఱిమినరక్కసు నుఱిచినతఁడు,

గీ. సవడిమోములఁ జతురత సమకొనంగ
జోడుమాటలు సరివడ నాడునతఁడు
దంతిముఖుకూర్మితమ్ముఁ డై తనరునతఁడు
కదలె బలముల నడిపింపఁ గ్రౌంచవైరి. 457

సీ. శూలి కన్నులఁ గెంపు చూపిన రౌద్రంబు పొదల ముందఱిదెసఁ

బొడమినతని,

భువనభయంకరస్ఫూర్తి పెం పెసలార శరభావతారతఁ బరఁగినతని,

జన్నంపుసిరి కొనసాఁగఁ జూచినతాతఁ జేకొని తలవంపు చేసినతనిఁ,

దళతళ మని మించుదులకించుకైదువుల్ కరములు పదిరెంటఁ గలిగినతని,

గీ. సురలు నసురులుఁ బలుమఱుఁ జూచి బెదరి

బిరుదుపెండెంబు డాకాలఁ బెట్టినతని

భద్రకాళి మహాశక్తిఁ బరమభక్తిఁ

బాయకుండెడు శ్రీవీరభద్రుఁ దలఁతు. (ఆం) 458

## శేషనాథుఁడు - [పర్వతపురాణము] (జ)

ఉ. తత్తరపాటుతో నిరులు తద్దయు మాన్పఁగఁ జాలు కన్ను ను

వ్వొత్తున వేల్పుమూఁకలకు విందులు వెట్టెడుకన్ను దమ్మిరయున్

మొత్త మెలర్ప లచ్చికిని ముద్దుగఁ బుట్టినముద్దుపట్టి మే

నెత్తిలఁజూచుకన్నుగల యిట్టిఁడివేలుపుఁ గొల్తు నిచ్చలున్. (జ) 459

## శ్రీగిరన్న — చెనమల్లు[శ్రీరంగమాహాత్మ్యము] (ఆం)

క. కాలాగరుకుంకుమస

మ్మేళనబాలాకుచాగ్రమేదురపరిరం

భాలోలలీలచే హిమ

కాలముఁ గడపుదురు జనులు కౌతుకమతులై (ఆం) 460

చ. తమము నుడుప్రజంబు భరితంబుగ నంతటఁ దూర్పుదిక్కునన్

హిమకరజన్మవేళ నుదయించినపాండిమ మించి పాఱెఁబ

శ్చిమమున కభ్రలక్ష్మి కుచసీమఁ గురంగమదం బలంది హా

రము లిడి తా మకూలమున రక్షగఁ బయ్యెద గప్పుచొప్పునన్. (ఆం) 461

సీ. దీపించు నేవేల్పుదివ్యాంగకంబునఁ గాశీకుచాంగరాగంబు భూతి ?

కొమరొందు నేవేల్పుగురుజటాభరసీమ నమృతాంశుఖండంబు నభ్రగంగ ?

కడు మించు నేవేల్పుగాత్రవల్లికచుట్టు వ్యాఘ్రచర్మము వారణాజినంబు ?

కరమొప్పు నేవేల్పుకంఠపీఠంబున భుజగేంద్రహారంబు పునుకపేరు ?

గీ. అట్టివేలుపు శంకరుం డాదిమూర్తి
వేదవేదాంతవేద్యుండు విశ్వభర్త
వికసితోజ్జ్వలవదనారవిందుఁ డగుచు
నుచిత రీతిఁ బేరోలగఁ బున్నయంత. (అం) 462

శా. సంతోషంబునఁ బొందె నీలె విమలస్వాంతున్ మహాదానవ
ధ్వాంతవ్యూహవిదారణోజ్జ్వలవివస్వంతున్ యశఃపూరితా
శాంతున్ సాహసవంతు నిర్భరజయాయత్తైకవిశ్రాంతు ధీ
మంతున్ ధర్మనగేంద్రకాంతుని హనూమంతున్ జవాత్యంతునిన్. (అఁ) 463

## శ్రీనాథుఁడు – [వల్లభాభ్యుదయము] (జ)

సీ. రజనీవధూకర్ణరజతతాటంకంబు వలరాజుధవళోష్ణవారణంబు,
ప్రోషితయువతిహృత్స్ఫుటభేదదాత్రంబు బహుచకోరకుటుంబపానపాత్ర,
మధుకైటభాసురమథనుదాఁపటికన్ను చక్రవాకంబులచల్లచేఁపు,
దుగ్ధపాథోరాశితొలుచూలిసంతతి రోహిణీదేవితారుణ్యఫలము,

గీ. చంద్రకాంతశిలానునిలకృపీట [?]
నిర్జరాంధోవ్యథామోక్షనియమవైద్యుఁ
డంధకారచ్ఛటాహాలహాలహరుండు
చంద్రుఁ డొప్పారెఁ గాంతిని స్తంద్రుఁ డగుచు (జ) 464

## శ్రీనాథుఁడు(?) [నైషధము] (అం)

సీ. మించి కన్నులఁ గోరగించురాజాన్నంబులొలుప యుంచుకలేని యొలుపుఁబప్పు
అభినవసంతప్తహైయంగవీనంబుఁ బరువంపు రుచి నొప్పు పాయసములు,
నేతను మిరియాల నెనసిన కూరలు ఖండశర్కరతోడఁ బిండివంటు,
గ్రొజ్జుగాఁ గాఁచిన గోక్షీరపూరంబుఁ బనసరంభాచూతఫలచయంబు,

గీ. ద్రాక్షపండులు ఖర్జూర మాక్షికములు
బహుసుగంధిరసావళు ల్పానకములు
పెక్కువిధములపచ్చళ్ళు పెరుగుమజ్జి
గయును వడ్డించి రెంతయుఁ గ్రమముతోడ. [1] (అం) 465

1. ఈ పద్యము నైషధమున గానరాదు.

## సర్వదేవుఁడు - [ఆదిపురాణము] (ఆం)

మ. సరసీజాతవిరాగకారి పురయోషావక్త్రహృద్యాతిసుం
దరకాంతిన్ దఱిఁగించుఁ బో యని మదిందర్కించి దోషాకరున్
బుర ముద్దండకరంబు లెత్తి చఱవం బొత్తైనయ ట్లొప్పు ను
ద్ధురసౌధాగ్రనిబద్ధకేతువు మహాదోలాభిరామంబుగన్. (ఆం) 466

క. హరినీలమణివిరాజిత
సురుచిర గోపురము దగిలి చూచి తమిస్రా
కరుఁడు విధుంతుదమండల
పరిశంకం జేసి పురముపైఁ జన నోడున్. (ఆం) 467

## సర్వదేవుఁడు – [విరాటము] (ఆం)

సీ. ఇక్షురసాబ్ధినీ రెట్టిదో యని మది నూహించి యువ్విళులూరకుండ,
విరసంపుముదిమికిఁ బరిహరం బగురసాయనముమీఁదికిఁ జిత్త మరుగకుండ
దివిరి దేహమ్ముమ్మ వేధించుసిద్ధరసంబు [?] కందువ యచ్చోటి కందకుండ,
నాయువుఁ జిరతరస్థాయిగాఁ జేయుసుధారాసంబున వేడ్క దగులకుండ,

గీ. నఖిలజనులకుఁ బంకేరుహాసనుండు
నేర్చి యన్నింటిరుచు లొడఁగూర్చి తెచ్చి
సంచితంబులుగా సంగ్రహించె ననఁ
భరితజలము లై పురసరోవరము లొప్పు. (ఆం) 468

## సర్వన్న — మలయమారుతము. [షష్ఠస్కంధము] (జ)

సీ. పోడియావగనున్న పుదుఱు జక్కవ లింక నక్కట నెగసెగా శాడకున్నె,
సరిగామి నెంతయుఁ జఱులలోఁ బడనున్న గిరులెల్ల నిఁకఁ బెచ్చు పెరుఁగకున్నె
పగిలి లోఁగరఁగెడు బంగారుకుండలు తలకెక్కి యటమీఁదఁ జెలఁగ కున్నెఁ
కలఁగినమాలూర ఫలము లింకిటమీఁద గిట్టితి దీవులఁ బెట్టకున్నె,

గీ. సదు...గమైన నున్నతిఁ బాయవలసె
నక్కటా! మాకునని యవి యాత్మఁగుంద
ముసుపు చింతాంధకారంబు మొనసె ననఁగ
నలిన లోచన చనుమొనల్ నల్లనయ్యె. [?] (జ) 469

## సింగయ - ఏర్చూరి. [కువలయాశ్వచరిత్ర] (జ)

శా. ఆదిబ్రహ్మముఖాళి చాలక విహారార్థప్రయత్నంబుతో
వేదంబుల్ భువి ధర్మపోషణకు నై విఖ్యాతిఁగాఁ బుట్టెనో
కాదే నిట్టి మహత్త్వ మన్యులయెడం గానంబు నాఁ బొల్తు రా
భూదేవోత్తము లప్పురంబున మహాపుణ్యప్రభావంబులన్ (జ) 470

క. గిటగిట నగునెన్నడుములు
పుటపుట నగుచన్నుఁగవలుఁ బున్నమనెలతోఁ
జిటచిట లాడెడు మొగములుఁ
గటితటములయొప్పు శబరకాంతలకొప్పున్. (జ) 471

ఉ. గోపురగోపురప్రతిమగోపురముల్ చెలువొంద నప్పురిన్
మాపులు రేపు లంగనలు మంజులగీతవినోదకృత్యముల్
చూపఁగఁ గిన్నరాదు లవి చూచునెపంబున వచ్చి చేర్తు రా
లాపవిశేషనర్తనవిలాసకలాపముల్ ముదంబునన్. (జ) 472

ఉ. చల్లనిపండువెన్నెలల సౌధతలోన్నత హేమవేదులం
దల్లన వల్లభుల్ గదిసినట్టిసుధాకరుఁ జూచి ప్రాణముల్
జల్లన రాహువుందలఁచి సయ్యనఁ బాపుదు రంకసంగతో
త్ఫుల్లవధూముఖంబులను బొల్పగుకస్తురిపత్రభంగముల్. (జ) 473

సీ. తనజన్మ మప్పులఁ దలమున్క లని రోసి పులిన మీపొంకఁబు బొందెనొక్కొ?
పరికింపఁ దనపట్టు తిరిగెడిపా టని పెన్నిధిసుడి సహత్రి బెరసె నొక్కొ?
బ్రతు కెల్లగతి బట్టబయ లాయె నని చూచి గగన మీపుట్టువుఁ గనియె నొక్కొ?
పని లేక పాసెడి పాపంబుఁ దలపోసి జక్కవ లీరీతి కెక్కెనొక్కొ?

గీ. యనఁగ లలనజఘన మంబుజముఖినాభి
చామనడుము బాలచన్నుదోయి
మహితరుచులఁ దెగడి మానవపతికన్ను
దోయిపండు వగుచు దొరసె నంత. (జ) 474

సీ. తమచూపు లొగిఁ బాంథతతులపైఁ బూనిన భావజుకరవాలభాతు లనఁగఁ,
దమకురుల్ యువమృగేంద్రములకై తీర్చిన మరునసమానంపుటురు లనంగఁ,
దమహాసములు విదోత్కరమానసముఁ బట్టు వలరాజుపూవులవల లనంగఁ,
దమకాంతి పురుషులఁ దాపంబు నొందించు రతిరాజుమోహనరస మనంగ,

గీ. జలజకాహళకదళికాపులినగహన
కోకబిసశంఖచంద్రాళికులమ్ముఁ దెగడు
పాదజంఘోరుకటిమధ్యపటుకుచోరు
బాహుగళవక్త్రకచములపణ్యసతులు (జ) 475

సీ. తిమిర మంతయుఁ బాసి దిక్కులు తెలివొందె నమృతాంశువులు సెందె
నభ్రవీథిఁ,
గువలయానంద మై కోరిక లిగురొత్తె విబుధులమదిలోన వెట్ట లొదవె,
నక్తంచరశ్రేణి నయ మెల్ల దిగజాఱెఁ జిత్తజోల్లాసంబు చెలువుమిగిలె,
దివ్యనీరంబులతేట లల్లనఁ బర్వె భువనాధిపతి వేడ్కఁ బొంగి పొరలె,
గీ. దీపికాజాలమెల్లఁ జిత్రించినట్టి
రమణఁ దోఁపంగ దృక్చకోరములు మెచ్చ
నమితతేజోవిరాజమానాత్ముఁడైన
పుత్త్రచంద్రుఁడు జననంబు వొందునపుడు. (జ) 476

క. నిరుపమధర్మస్థితిచే
వరపాతివ్రత్యనిరతివైభవమున స
ప్పురిపుణ్యకాంత లమరిరి
గిరిదత్పురివాణులెల్లకీర్తితగతులన్. [?] (జ) 477

శా. ప్రాచీనంబులు రత్నకాంతులు లసత్ప్రాకారముల్ హేమముల్
సూచింపన్ ఘనవేదికుట్టిమము లాశుభ్రాంశుకాంతంబులై
యేచోటన్ వరరత్నజాలములచే నింపొంది సొంపొందుచున్
వాచాగోచరమై గృహంబు లమరున్ వస్తుప్రశస్తోన్నతిన్ (జ) 478

ఉ. మీఱినభద్రనాగములమీఁదికి దాఁటి తదీయకుంభముల్
చూఱలు వట్టి కేసరికిశోరనఖావళినుండి రాలి సొం
పారినమౌక్తికంబులు ప్రియంబున నేరి కిరాతబాలికల్
గీరనగింజ లాడుదురు గేలిఁ దలిర్పఁగఁ బక్కణంబులన్. (జ) 479

ఉ వైరితమస్తమం బడఁగ వంశమహార్ణవ ముబ్బ బాంధవో
ద్ధారచకోరసంతతి ముదంబునఁ దేలఁగ నర్థివర్గస
త్కైరవజాతమెల్లను వికాసముఁ బొందఁగఁ బుత్త్రచంద్రజ
న్మారవచంద్రికానుభవ మబ్బినచిత్తము మిన్నుముట్టదే? (ఝ) 480

గీ. శేషఫణులకు మణులైనఁ జేరి యమ్మఁ
గోరి రత్నాకరంబైనఁ గుత్తగొనఁగఁ
జాలి పరవస్తుసంచయసమితి నొనరి
పరఁగుదురు వైశ్యవర్యు లప్పట్టణమున. (జ) 481

## సిద్ధనప్రెగడ-[శాకుంతలము] (ఆం)

ఉ. నీరజమిత్రుతో బయల నిల్చి చలంబునఁ గిట్టి మైమయిః
బోరుట దుర్లభం బనుచు భూరితమఃపటలంబు లొక్కమై
నూరెలఁ గోటవట్టి పొదసూపఁగనొక్కొ యెదిర్చె నాఁగఁ బ్రా
కారనిబద్ధనీలమణికాంతిఁ గసుంగొన నొప్పునెంతయున్. (ఆం) 482

## సూరయ్య-కంచిరాజు. [కన్నప్పచరిత] (జ)

ఉ. కారణ మేమి? రక్కసు నఖంబుల ప్రచ్చితి నాఁడు నీకుఁ బెం
పారఁ గుఠార మబ్బదొ? పురారివిరించులు చేరి యేటికిం
గోరను బోవు సేఁతలకు గొడ్డలి యన్నఁ దొఱంగితో? వినం
గోరెద నన్నయిందిరకుఁ గోర్కుల నిచ్చుముకుందుఁ గొల్చెదన్. (జ) 483

ఉ. కొమ్మును దొండమున్ కఠినకుంభయుగంబును నయ్యుమాకపో
లమ్ములచారుకాంతిఁ దొడలన్ వలిచన్నులఁ బోలెఁ, బుత్రికుం
డిమ్ములఁ దల్లిఁ బోలి జనియించిననంచితభాగ్యవంతుఁ డౌ
నమ్మ ! యటంచు సిద్ధసతు లక్కునఁ జేర్చుగజాస్యుఁ గొల్చెదన్. (జ) 484

మ. తమసౌభాగ్యము లంగసంభవునిభద్రశ్రీలసేవింపఁగాఁ
దమదృగ్జాలము లాలతాంతశరకుంతశ్రేణిఁ బాలింపఁగాఁ
దమవృత్తస్తనభారముల్ మరునిచిత్తస్ఫూర్తిసూచింపఁగాఁ
దమకం బారఁగఁ జేరి చూచిరి పుళిందగ్రామణిన్ బ్రేముడిన్. (జ) 485

సీ. శ్రుతిసుధాశ్మభక్తసురజనసీవధూ మల్లశంకరధర్మమహితబుద్ధిఁ,
గగకూర్మకిటినరమృగకుబ్జరామరామానంతబుద్ధకల్క్యాహ్వయముల,
నముచిమందరకుదానవబలార్జునపంక్తి ముఖముష్టికస్త్రీవిముక్తఖులులఁ,
చత్పుచ్ఛకర్పరదంష్ట్రాగ్రనఖపవ పరశుబాణహలాంగఖురపుటములఁ,

ఆ.వె. జెరివి తాల్చి యెత్తి చీరి బంధించి సి
ర్జించి యేసి యేర్చి చెఱిచి మట్టఁ
గడఁగుచున్న శౌరి కరుణావిధేయుఁడై
మనలఁ గోర్కు లిచ్చి మనుచుఁగాత[1]. (జ) 486

## సూరయ్య—నూతనకవి. [ధనాభిరామము] (జ)

చ. ఇరువదియాఱుపీక్షణము లెన్నఁగ నాలుగువక్రచేష్ట లిం
పరుదుగ నేడుభ్రూనటన లర్వదినాలుగుదోర్విలాసముల్
సరసతఁ జూపి హంసవృషసామజవాయసశుద్ధ సంగతుల్
పరువడి ముట్ట నిల్పె సితపంకజలోచన పాడుచుండఁగన్. (జ) 487

## సోమయ్య - దామరాజు. [భరతము] (జ)

ఉ. అంబరసీమఁ దారలు జటాటవి మల్లెవిరుల్ భుజాంతరా
ళంబున హారసంతతు లిలాస్థలిఁ బూవులవర్షముల్ ప్రసూ
నంబులు సత్కృతాంజలి ననం దగి మౌక్తికతుల్యమౌళి గం
గాంబుకణంబు లుట్టిపడ నాడెడుశంభుఁడు మిమ్ముఁ బ్రోవుతన్. (జ) 488

చ. అడుగుల్ పుష్పడయాఱిటన్ వెడలు పై హస్తత్రిషట్కంబుచే
నిడు పై యున్నత మై సమస్థలము నై నిర్మోకహస్తాంక మై
మృడ మిత్ర | బంచు వాకి లౌక బై మించం గవాక్షంబు లిం
పడరంగ శాలను రాజు షడ్విధము నాట్యం బిట్టు సేయించుటన్ (జ) 489

ఉ. సందిమృదంగరావము ఘనస్తనితం బని మ్రోల నున్నయా
స్కందునివాహనం బగుశిఖండి యఖండితనృత్య మాడ భీ
తిం దనహస్తరంధ్రముగతిం జొరునాభరణాహిరాజి వో
పం దల యూచువిష్ణుపతి భాసురపూత్కృతిమమ్ముఁ బ్రోవుతన్. (జ) 490

సీ. ప్రాకారములయందుఁ బటుగోపురంబుల దామరమ్యద్వారసీమలందు,
విపణిగృహంబుల వెలయునాయుధహస్త భటులను హి(తము)గాఁ బ్రౌఢి నిల్పి,
రక్షితం బొనరించి రాజబింబద్యుతుల్ మించికాయుచు నున్నమంచివేళ,
మహిమ నాప్తసుబంధుమధ్యస్థలమునందుఁ జెలఁగి రత్నాసనాసీనుఁడగుచు,

1. ఆం. సా. ప. గ్రంథసంధాత ఈ పద్యమును 'భీమకవి దశావతారపద్య'మని పేర్కొనెను.

ఆ.వె. నర్తకేళిలాస్యనటనాగతులచేత
శాస్త్రసమ్మతముగ జనులకెల్ల
వేడ్కఁ జూపి మఘవవిభవుఁ డై కొలువుండ
వలయు విభుఁడు నిఖిలకలలు నెఱిఁగి. (జ) 491

సీ. మొదలిపుష్పాంజలి ముదమునఁ గావించి కరబాళిమొగబాళిసరవులెత్తి,
యురుపృథుబాళము లొగిఁబిల్లమురువును హస్తప్రకణము లే ననువుచఱచి,
కడకట్టుశబ్దంబు కడఁగి దర్వును జిందు బాగైనగీతప్రబంధములును,
కుండలిబహురూపదండలాస్యవిలాస దేశిమార్గంబులతెరువు లెఱిఁగి,
గీ. నయము బిఱుసును, సరిగతుల్ కడిఁదిగాను :
తిరువుమురువును నిలుకడ తిన్న నగుచు,
పాత్రఁ గొనిపించఁ గొనఁగను బ్రౌఢియైన
వాఁడె నటుఁ డనఁబరఁగు నీవసుధయందు. (జ) 492

## సోమయ — పెదపాటి. [అరుణాచలపురాణము](జ)

సీ. అంగయుక్తంబుగా నామ్నాయములు నాల్గు చదువంగ నేరనిసద్ద్విజాతి,
బ్రాహ్మపాద్మాదిపురాణాగమేతిహాసము లెఱుంగనిబ్రహ్మసంభవుండు,
భాట్టవైశేషికప్రాభాకరాదిశాస్త్రము లాఱు చూడనిధరణిసురుఁడు,
స్వకులోచితము లైనసప్తతంతువులెల్లఁ బార మెద్యింపని బాడబుండు,
గీ. కావ్యనాటకలసదలంకారముఖ్య
విద్య లన్నియు నెఱుఁగనివిప్రవరుఁడు
పంచయజ్ఞములును లేని బ్రాహ్మణుండు
వెదకిచూచినఁబొడమండు పీటిలోన. (జ) 493

క. తఱుముదు రంతకునైనను
వెఱచఱవఁగ భద్రకర్తుల విఱుతురు హరి ను
క్కఱఁ బట్టి చట్ట లేరుదు
రుఱుకుదురు యుగాగ్నికైన సురుభటు లందున్. (జ) 494

ఉ. తారకజిచ్ఛిఖండి శివతాండవ మాడ నతండు మర్దళో
దారరవంబు మేఘనినదంబని చేరినఁ జూచి నాసికా
ద్వారబిలంబు జన్నిదపువ్యాళము చొచ్చినఁ దొండ మెత్తి ఘీం
కారము సేసె నవ్వువెనకయ్య కృతీశ్వరు మన్చుఁగావుతన్. (జ) 495

సీ. ప్రతిభావిలంఘితభారతబహుకథాఘట్టు నన్నయభట్టుఁ గడు భజించి,
యుభయభాషాప్రౌఢిమోద్యన్మహారాజ్యభాజిఁ దిక్కనసోమయాజిఁ బొగడి,
వాక్ప్రతోషితదక్షవాటీమహాస్థానభీము వేములవాడభీముఁ గొలిచి,
భావబంధనిబంధపరమేశబిరుదప్రశర్ము నెఱ్ఱయశర్మ సన్నుతించి,

గీ. భారతీహారు భవదూరుఁ బ్రణుతి సేసి
సుకవికులసోము నాచనసోము నెన్ని,
నవ్యకవితాసనాథు శ్రీనాథుఁ దలఁచి
సరససకలాంధ్రకవుల కంజలి యొనర్చి. (జ) 496

ఉ. బంటుతనంబు వైభవము భాగ్యము తేజము చాలఁ గల్గ ము
క్కంటిని దమ్మికంటి నధికం బగుభక్తి భజించి కేలిమైఁ
గంటకులం జయించి కలకాలము నర్థులకోర్కి-పంట లై
పంటలుఁ బాఁడియుం గలిగి పంటలు మీఱుదు రప్పురంబునన్. (జ) 497

సీ. భ్రమరకావళికప్పు ప్రసవగుచ్ఛభ్రమ ద్భ్రమరకావళికప్పు బాంధవింప,
కరములకెంపును గమనీయహల్లకోత్కరములకెంపు సఖ్యంబు సేయ,
ముఖసౌరభములు సమోహాతిముక్తక ముఖసౌరభంబులు మొనసి బెరయ,
హాసవిస్ఫూర్తులు నతులవర్ణప్రతిహాసవిస్ఫూర్తులు ననఁగి పెనఁగ,

గీ. సారము లగుతమ్మిలవిలాసములు చూపి
వరుసఁ బువ్వులు జట్టికోవచ్చినట్టి
జనులమనసులు మును తారు జట్టికొంద్రు
పుష్పలావీవధూటు లప్పురమునందు. (జ) 498

ఉ. రాజులు విక్రమోగ్రమృగరాజులు విశ్రుతదివ్యకాంతి రే
రాజులు రూపరేఖ రతిరాజులు మానగుణంబునందు రా
రాజులు దానశక్తి ధనరాజులు వైభవభోగవృద్ధి స్వా
రాజు లనంగ నొప్పుదురు రాజితతేజులు దత్పురంబునన్. (జ) 599

చ. వలుఁదకుచంబులున్ బవడవాతెఱలున్ మెఱుఁగారుమేనులున్
బలుచనిచెక్కుటద్దములుఁ బద్మపుమోములుఁ గంబుకంఠముల్
కలువలఁ బోలుకన్నులు వికాసపునవ్వులుఁ జిల్కపల్కులున్
దలిరుల మించుపాదములుఁ దత్పురికాంతల కొప్పు నెంతయున్. (జ) 500

సీ. విపణికోరో యన్న విబుధాచలం బైనఁ దెమ్మనఁ దేనివై దేహికుండు,
పులిజున్నువలె నన్న బొరుగిల్లు సూపక యాక్షణంబున నీనియర్యవరుఁడు,
మహనీయకౌస్తుభమాణిక్యమున కైన వెలఁద్రెంచనేరనివిద్వరుండు,
గురుతరహాటకకోటికిఁ బడగలు కోటి యెత్తనివణిక్కుంజరుండు,

గీ. మందునకు నైన లేరు సమగ్రభోగ
భాగ్యసంక్రందనులు జగత్ప్రకటకీర్తు
లర్థిసంపత్ప్రదుల్ నిర్జితార్థపతులు
వర్ణితోదారు లప్పురివైశ్యు లెల్ల. (జ) 501

సీ. వ్యాసుని వాల్మీకి వరరుచి వామను బాణు క్షేమేంద్రునిఁ బ్రవరసేనుఁ,
గర్ణామృతు మయూరుఁ గాలాంతకుఁ గళింగుఁ గవిదైత్య
శివదాసుఁ గాళిదాసు,
భట్టారహరిచంద్రు భట్టనారాయణు భట్టగోపాలుని భట్టబాణు,
భాసు భామహు సార్వభౌముని శివభద్రు భారవి భవభూతి భర్తృహరిని,

గీ. రాజశేఖరుఁ జోరుఁ మురారిఁ గృష్ణ
మిశ్రు జయదేవు దండి సౌమిల్లు సోమ
చంద్రు దిఙ్నాగు విజయవిశాలదేవు
హర్షుఁ జిత్తపు శాతవాహను సుబంధు
మాఘు మల్హణు బిల్హణు మఱియుఁ గలుగు
ప్రథితగీర్వాణకవులనుఁ బ్రణతి సేసి. (జ) 502

## సోమయ — పెదపాటి. [కేదారఖండము] (ఇ)

ఉ. కన్నియ రూపుఁ గోరుఁ, గనకంబులుగోరును దల్లి. బుద్ధిసం
పన్నతఁ గోరుఁ దండ్రి, కులభవ్యతఁ గోరును బంధుకోటి, ప
క్వాన్నఫలాదిభక్షణము లన్యులు గోరుదు రిట్టు లిన్నియున్
బన్నుగ నొక్కచో నొదవె, భాగ్యము సేసితిఁ గన్య నిచ్చెదన్.[1] (జ) 503

సీ. కక్షకటిస్కంధకుక్షిఫాలాస్యంబు లాఱు నున్నతము లయ్యె ర్భకునకు,
నాజానుబాహునాసాక్షులు దీర్ఘముల్ హ్రస్వముల్ పృష్ఠ మేహనగళంబు,
లంగుళీజత్రుకేశాగ్రగుల్ఫములుసూక్ష్మము లధరోష్ఠనఖరదృగంత
తాలుజిహ్వాకరతలరేఖ లెఱ్ఱన స్వరనాభిసత్త్వముల్ సద్గభీర

1. చూ. "కన్యావరయతే రూపం..."

గీ. ములు, సెమర్పవు మృదువు లంఘ్రులు, కరములు
కఠినములు శంఖచక్రాంకకలితములును,
నైదురేఖలు చెలువొందునలికతలము,
లక్షణము లింత యొప్పునే యక్షయములు. (ఆం) 504

సీ. కెంజాయజడముడి కేశపాశంబును బూపచందురుఁడును బూవుదండ,
యురగకుండలమును దరళతాటంకంబు వనజాక్షుఁ డగుకన్ను వాలుఁగన్ను
ముదురుపున్కలపేరు ముత్యాలహారంబుఁ గడుఁ గొంచెమగుచన్ను
ఘనకుచంబుఁ,
బులితోలు దుప్పటి వెలిపట్టు చీరయుఁ బాఁపపెండెంబును బసిఁడియందె,

గీ. మృదువుఁదెలుపును నగుభూతి మృగమదంబు
నింత యొప్పునె కుడివంక నెడమవంక
నిమ్మహాదైవమున కని యిచ్చ మెచ్చి,
యర్ధనారీశ్వరునిఁ గొల్చి రఖిలజనులు. (ఆం) 505

సీ. చరియించువారికి సంకల్పసిద్ధిగా నిర్మించె నెవ్వాఁడు నిజవనంబు ?
సార్వకాలిక ఫలసస్యంబుఁ గల్పించి వరమునిశ్రేణి నెవ్వాఁడు ప్రోచెఁ?
జీఁకటితప్పు సేసినసెవ్వఁ డొదవించె నింద్రునితనువెల్ల హేయముగను?
నుర్వీసురశ్రేణి కొఱమ లేకుండఁగఁ బలికె నెవ్వఁడు ప్రతాపంబు మెఱసి?

గీ. యట్టిశ్రీవీరశైవాగమాదివేది
యైనగౌతమసంయమియాశ్రమంబు
పొంత నెంతయు నొప్పారి పొగడ నెగడు
ననఘమానసః శ్రీవైజయంతిపురము. (ఆం) 506

మ. పదలాలిత్యము వర్ణశుద్ధియును శబ్దస్థైర్యముఁ మంగళా
స్పదభావంబును రాజయోగ్యతయు దోషస్ఫూర్తిరాహిత్యమున్
సదలంకారవిశేషముం గలిగి విశ్వప్రాణసౌభాగ్యసం
పదమై తేజిను పోలి క్రాలవలదాః పద్యంబుహృద్యస్థితిన్.[1] (జ) 507

సీ. లలిఁ గావ్యనాటకాలంకారములు చూచి శబ్దప్రపంచంబుజాడఁ దెలిసి,
వర్ణోద్భవవ్యక్తివర్గగ్రహారిమిత్రస్నిగ్ధరూక్షచింతనము లెఱిఁగి,
గణరూపదేవతాగ్రహమైత్రినక్షత్ర మాతృకాపూజాదిమార్గ మెఱిఁగి,
జల్లి విక్రియ కాకు పొల్లు వ్యర్థము ద్రాఘ విరసంబు గ్రామ్యోక్తి పరిహరించి,

1. నన్నిచోడని పద్యమున కనుకరణము.

గీ. కవిత సెప్పినఁ దగుఁ గాక కవిసి నోరి
కొలఁదు లివ్వల నవ్వలఁ గూర్చి తెచ్చి
దిట్టకూళతనంబున వట్టిబిగిని
గావ్య మని చెప్ప మెత్తురే కవిజనములు. (జ) 508

సీ. వనితయూర్పులచేత వావిలి వికసించెఁ బాటఁ బ్రేంకణము లేఁబరువ మయ్యె,
నాతుక చూచిన నలువొత్తెఁ దిలకంబు గొమరారె మాటలఁ గొండగోఁగు,
సతిముఖరక్తిచే సంపంగె సొంపెక్కె నవ్వివ సురపొన్న మవ్వ మలరె,
నెలనాఁగకౌఁగిట నిగురొత్తెఁ గురువకం బంటినఁ జెలువొందె నాగ్రమతరువు,

గీ. పొలఁతిపుక్కిటిమధువునఁ బొగడ వాలిచెఁ
గాంతపదసంగమున నశోకంబు విరిసెఁ
గాననములోన జాతి యొక్కటియె తక్క
భూజములుఁ దీగెలునుఁ బూచి పురువులయ్యె. (అం) 509

సీ. వేదాదు లగుమహావిద్యలన్నియుఁ గూడి మూర్తిమంతంబులై మొనసి కొలువఁ,
గ్రతుమరీచ్యంగిరఃకణ్వాదిసంయముల్ పలుమాఱుఁ గనుసన్నఁ బనులు సేయఁ,
సురసిద్ధకిన్నరగరుడవిద్యాధరయక్షాదు లంతంత నభినుతింప,
నారదవిశ్వావసతుమ్బురాంగిరశ్శతరుతు లుభయపార్శ్వముల మెఱయ,

గీ. భాషతోఁ గూడి యానందభరితుఁ డగుచు
సత్యలోకేశ్వరుం డందు సంస్తుతింప
నిమ్మహాసృష్టి కెల్లను నితఁడు కర్త
చూడుమీ ! బ్రహ్మలోకంబు సుభగమూర్తి ! (అం) 510

సీ. హరియురస్థ్సలిఁ బోలెఁ గర మొప్పెఁ జూచితే భాసురకమలాధివాస మగుచుఁ,
త్రిదివంబుఁబోలె నొప్పిద మయ్యెఁ జూచితే మకరకచ్ఛపమహామహిమ గలిగి,
గగనంబువోలె నక్కజ మయ్యెఁ జూచితే రాజహంసస్ఫూర్తి రమణఁ గలిగి,
యాశాతటమువోలె నసలారెఁ జూచితే బంధురకుముదవిభ్రమము గలిగి,

గీ. యతిమనోహరమందమారుతవిహార
లోలకల్లోలమాలికాందోళకేలి

కలితబహువిధఖగసముజ్జ్వలత గలిగి
యమరెఁ జూచితె యీసరోజాకరంబు. (ఆం) 511

## సోమయ— పెదపాటి. [త్రిపురవిజయము] (ఆం)

సీ. భూరివిశ్వంభరా భూతంబు రథము, తద్రథమధ్యమునఁ బొల్చుజాయి విల్లు'
విల్లువెంబడిఁ దిగ్గువెలుఁగులు చక్రముల్ చక్రారికులపతి చారునారి,
నారిఁ బట్టఁగఁ బాఱు నాగరకపు గతి గతిమీఁద విహరించుఘనశరంబు,
శరము నాభిని గన్న శతవృద్ధుసారథి సారథిమాటలు సైంధవములు,
గీ. గాఁగ నేఁగి వేగ గడఁకతోఁ బురములు
గెల్చి వచ్చి గెలుపు గిరిజతోడఁ
జెలఁగి చెలఁగి చెప్పి చెలువొందుశంభుండు
గాచుఁగాత! మనలఁ గరుణతోడ. (ఆం) 512

## సోమయ— పెదపాటి. [శివజ్ఞానదీపిక] (జ)

సీ. కవగూడి నడక సాఁగనిబండికండులు దొమ్మిదితునుకలతొడుసు తేరు,
పెక్కు బ్రాహ్మణులచేఁ జిక్కినగుజ్జుముక్కు చిలుకుట నజిగినచివుకుటిరుసు,
బహుముఖవిభ్రాంతి బడలిన సారథి వినువీథి నలమిన వీఁగువిల్లు,
పదిబ్రద్దలై యొడ్డువాసినబాణంబు పొరలెత్తిపోయిన బోలునారి,
గీ. పట్టఁబస లేదు సాధనప్రకరశక్తి
విషమశబ్దంబు లైనట్టివిమతపురము
లెల్ల సాధించి గెల్చితి వేకహేల ?
బాపు ! త్రిపురాంతకేశ్వర ! భక్తవరద! (జ) 513

సీ. బవరాన సూతుఁడై పార్థున కాతండు నచ్చినాఁ డీతండు మెచ్చినాఁడు,
చంచత్కృపాస్ఫూర్తిఁ బంచాస్త్రు నాతండు పెంచినాఁ డీతండు నొంచినాఁడు,
శేషపన్నగరాజు సెజ్జగా నాతండు వ్రాల్చినాఁడీతండు దాల్చినాఁడు,
హాలాహలముఁ జూచి యల్లంత నాతండు చెంగినాఁ డీతండు మ్రింగినాఁడు,
గీ. చక్రి యాతండు వసుమతీచక్రి యితఁడు
నవనపరుఁ డాతఁ డీతఁడు హరణపరుఁడు
విశ్వమయుఁ డాతఁ డీతండు విశ్వనాథుఁ
డనుచు హరిహరనాథుల నభినుతింతు.[1] (జ) 514

1. నాచనసోముని ఉత్తర హరివంశము(న నుండఁదగునా) ?

క. సుకవులు పలుకఁగఁ గెళవులు
కుకవులు దా రజుతు రౌర! కొలఁకుల భ్రమర
ప్రకరము ఝుంకారింపఁగ
'బెకబెక' మనకేల మాను భేకము లవలక్షా. (జ) 515

## సోముఁడు — [వసంతవిలాసము] (ఆం)

శా. ప్రాలేయప్రతిసీరసేనఁబజుపెన్ బైపై వసంతం బిలన్
గాలోన్మీలితకోరకోదరపరాగ ప్రౌఢకోపాగ్నియై
హాలాపానవిహారపౌరమహిళాహంకార దోస్సారమై
హేలాపల్లవహేతిఖండితమహాహేమంత సామంతమై. (జ) 516

## సోమేశ్వరుఁడు-పాలపర్తి. [?] (జ)

సీ. తలకమ్మికొండయు విలుకమ్మికొండయుఁ గడయును నడుములుగాఁ గలుగుతేరు
సరసిజముకుళంబు సద్వాక్యసకలంబు మాతయు నా లగుమాలలియును,
మిన్నులఁ జనువాఁడు కన్నుల వినువాఁడు నంకపర్యంకంబు లైనశరము,
చల్లనిపవనఁబు నెల్లైనభువనంబు మేపును మోపుగా మెలఁగునారి,

ఆ.వె కాఁక కోర్చువిల్లు గబిగలగుత్తాలు
పగలు రేయుఁ దిరుగుబండికండ్లు
గలుగఁ బురజయంబుఁ గైకొన్ననినుఁ గొల్తు
చిరశుభాంక ! సోమశేఖరాంక ! (జ) 517

సీ. వింటిక్రిందటికొమ్ము పికలించి పెఱికిన భూకాంతపసను నాభి పొలపు మిగిలె
నమ్ముపుచ్చుకొనఁగ నమితతరంగముల్ పాలసంద్రంబుపఁ బ్రజ్వరిల్లె,
బండికండులు రెండు పం డ్లిగిలించినఁ గలుపలు దామరల్ చెలిమి చేసె,
వాజులఁ గొనివచ్చి వరరథంబునఁ బూన్పఁ జిచ్చుపు నాఁకలిచిచ్చు వుట్టె,

గీ. నారి సంధింపఁ గశ్యపునారి వడఁకెఁ
గోల సంధింప లచ్చికి గోల పుట్టె
విల్లుఁ దెగఁ బాపి పురములు ద్రెళ్ళ నేసి
తరిదివిలుకాఁడ వౌదు వోశరభలింగ ! (జ) 518

## హరిభట్టు - [ఉత్తరనృసింహపురాణము] (జ)

సీ. మందారకుసుమంబుఁ జందురుండును గూడి మౌళిభాగంబునఁ గీలుకొనఁగ,
ఫణిమండలంబును మణికుండలంబును గండభాగంబునఁ గప్పుకొనఁగ.
వరచక్రశూలాబ్జవరదహస్తములందుఁ గంకణభుజగకంకణము లమరఁ,
గనకకౌశేయంబు గజరాజచర్మంబు మునుకొని కటిభాగమున నటింపఁ,
గీ. దిమిరమును జంద్రికయు జోక నమరినట్లు
పుండరీకోత్పలద్యుతు ల్పొదివినట్లు
నీలవజ్రంబు లొకచోట నిలిచినట్లు
హరిహరాకృతి త్రిభువనానంద మయ్యె. (జ) 519

## [?] అన్నదానమహత్త్వము.

గీ. ఆదిమూర్తి మహాలక్ష్మి యప్పురంబు
సొచ్చి నిల్చిన వారాశి చూడ వచ్చి
కోట సొర రాక తూఁతుపైఁ గూర్మిఁ జుట్టు
హాఱియున్నటు లొప్పారి పరిఖ మెఱయు. (?) 520

గీ. మహిత సన్మార్గవర్తనమాన్యు లనఁగఁ
బొలుచునినరాజగురుకవిబుధుల నైనఁ
దగులుపడఁ జేయుపెంపునఁ దనరువీటి
కొమ్మలకు సాటి యై కోటకొమ్మ లమరు. (?) 521

## [?] ఇంద్రద్యుమ్నము. (ఆం)

చ. పుడిసిటిలోఁప [illegible] కడుఁ బొల్పఱి యమ్మునిన నింకి చల్లినన్
గడపలఁ గాన పచ్చ వెనఁ గైకొని త్రచ్చిన రొల్లఁజొచ్చి య
జ్జడనిధి భంగపడ్డ[illegible] స్రష్ట యపాయము లేనివార్ధిఁగాఁ
గడఁగి యొనర్చె[illegible] యన నగర్త పొగడ్తల నొప్పు నప్పురిన్. (ఆం) 522

## [?] కామందకము. (జ)

క. అరుణుండు కిరణము(ల)సం
చరణంబుల వాయ కెపుడు చరియించుగతిన్

జరజనులచేత నృపతియు
నురుగతి జగమెల్ల నెఱిఁగియుండఁగవలయున్. (జ) 523

## [?] నీతిసారము.

సీ. ఒనరంగఁ గమలంబు నుపహారసంధియు సంతానసంధియు సంగడంబుఁ,
జాల నుపన్యాససంధియు...సంధియు యోగసంధికమును,
బుష్పాంతరాదృష్టపురుషనామకములు నాదిష్టకంబును నాత్మమిషయు,
బంధురోపగ్రహసంధి పరిక్రియ సంధియు నుచ్ఛిన్నసంధికంబు,

ఆ వె. ననుపమపరభూషణాంచితస్కంధోప
నేయసంధు లనఁగ నిశ్చితముగ
షోడశప్రకారసునిశితసంధివి
ధాన మెఱుఁగవలయు ధరణిపునకు. (?) 524

శా. నానాశాస్త్రవిశారదుండు నయనానందాంగుడున్ సత్కుల
స్థాన శ్రేష్ఠుఁడు నిస్పృహుండు పరచిత్తజ్ఞుండు వాక్చుద్ధుఁడున్
శ్రీనిత్యుండును లోకమాన్యుఁడును నిశ్చింతుండు నై యుండినన్
వానిన్ మానుగ రాజదూత యని చెప్పన్ వచ్చు నుర్వీస్థలిన్ (?) 525

క. పతి కలిగి తానె పొలియును
బతి నలిగించు (టనుఁ) దనకె భంగము వచ్చున్
బతిమతమె కాని భటునకుఁ
బతితో నాగ్రహము చనదు బద్దెనరేంద్రా॥ (?) 526

క. పతిచీర లట్టిచీరలు
పతితొడవుం బోలుతొడవుఁ బతిగతివేష
స్థితియును సేవకులకుఁ దగ
దతిధనయుతు లైన నసుఁగు లైనను సభలోన్. (?) 527

సీ. బలుకాపు వాకిళ్ళఁ బగలు రేయును నిడి కోటఁ బాళెముఁ దగుచోటఁ బెట్టి,
కనుమట్లనెల్ల[?] కావలి నియమించి నడిమిచావడిఁ దగునరుల నునిచిఁ,
నగరిచుట్టును జాలె నడిపించి క్రంతలఁ దిరుగుచుఁ దగఁ దలవరుల నునిచి,
దిన[?]...యుఁ బాళెముల్ దృష్టి వెట్టుచుఁ గేలదివియలు విడువక తిరుగఁజేసి,

ఆ.వె. దొరలు రాజులందు నరయుచు భటులందు
భేద మొదవకుండ నాదరించి
యుచితవృత్తిఁ గావకుండిన దుర్గంబు
నేలఁ గలఁడె భూమి నింద్రుఁ డైన? (?) 528

## [?]పంచతంత్రము. (జ)

గీ. అన్యదేశ మెల్ల నాత్మదేశంబ కా
తలచువాఁడు నెపుడు తలఁకు లేక
రమణ సేఁతయెల్ల రాజ్యంబు సేతగాఁ
దలఁచువాఁడు ప్రియుఁడు ధరణిపునకు. (జ) 529

చ. చెలువుగ దుష్కరంపుఁబని సేసియుఁ జేసితినాక, క్రూరతం
బలుమఱు వేసినం గడపఁ బల్కిన నుల్లములోన నొండుగాఁ
దలఁపక, పల్క చొప్పిదము తథ్యముగాఁ దగఁ బల్కి మోసలన్
బిలువక వచ్చియున్నతఁడు భృత్యుఁడు రాజున కెన్నిభంగులన్. (జ) 530

క. బలుకొఱడువోలె నెండకుఁ
జలికిని వానకును నోర్చి జనపతి నెవ్వం
డలసడఁ గొలుచును వానికి
వలనొప్పఁగ సిరులు దాన వచ్చి వసించున్. (జ) 531

క. మానుగఁ బతి పనిచినఁ దన
చే నది గా దనక వేగ సేకొని యనలం
బైనఁ జొరవలయు నంబుధి
యైనను నీఁదంగవలయు నర్థిని భృత్యుల్. (జ) 532

## [?]పురాతనచరిత్రము. (ఆం)

క. చీటికిమాటికి వెలువడి
హాటకమయవప్ర మెక్కి యహికన్యలు మి
న్నేట విహరింతు రనినను
గోటపొడువుఁ బరిఖలోఁతుఁ గొలఁదియె పొగడన్. (ఆం) 533

## [?] రంగనాథశతకము (ఆం)

సీ. కురులు తుంపెస లాడఁ గ్రుమ్మ్రడి యరవీడఁ
గుచకుంభయుగళంబు గునిసియాడఁ,
గటియుగంబు నటింపఁ గౌను కంపముఁబెంప
సరు లురంబున గల్లు చౌకళింపఁ,
గనుఁజంకె లొాలపెక్క గగు రంగముల నిక్కఁ
గర్ణపత్రము లాటగతుల కెక్కఁ,
గంకణంబులు మ్రోయఁ గలనాద మెసపోయ
రశనాకలాపంబు రట్టుసేయ,

గీ. నటునిరీతి వీరభటునిచందంబునఁ
గమ్రవిలుతుకీలుబొమ్మ కరణి
నుపరిభాగకేలి నొప్పెదోఁ గావేరి
రంగవిభునిఁ గూడి రాజవదన. (ఆం) 534

## [?] 'రామా! రాజచూడామణీ' (ఆం)

శా. అజ్ఞానప్రబలాంధకార తరుణోద్యద్భానుతేజోనిధుల్
ప్రజ్ఞాపావనపుణ్యసద్గుణపయఃప్రస్ఫీతభాగీరథుల్
విజ్ఞానోజ్జ్వలచంద్రికామృతకరుల్ వీక్షింపఁగా నొప్పుఁబ
హ్మజ్ఞాను ల్భవదీయసేవకులు రామా! రాజచూడామణీ! (ఆం) 535

శా. కంథాధారులు చర్మధారణపరుల్ కాపాలికుల్ దుష్క్రియా
పాంథు ల్నిమ్ము భజింపనేరక వృథాపాషండు లైనారు స
ద్గ్రంథార్థాప్రతిమానవాదనులు [?] సత్కావ్యప్రవీణుల్ మహా
మాంధాతల్ భవదీయ సేవకులు రామా! రాజచూడామణీ! (ఆం) 536

మ. కనకంబుల్ వెదచల్లువా రభయముం గైకొంచుమేలందువా
రనురాగంబునఁ గామినీమణులతో నానందముం బొందువా
రనుకూలించిన పుత్త్రపౌత్త్రతతులన్ హర్షించువా రెల్లము
న్మనసారన్ నినుఁగొల్చినారు రఘురామా! రాజచూడామణీ! (ఆం) 537

శా. చంకం గొల్లఁడు మేఁకపిల్లనికి తచ్ఛాయాకృతుల్ నీటిలో
శంకం గన్గొని నూతఁ బడ్డగతి శాస్త్రంబు ల్వితర్కించి హృ

త్పంకేజంబున నిన్నుఁ గానక మనస్తాపంబున న్మూఢులై
మంకుల్ గొందఱు గాథఁ దప్పుదురు రామా ! రాజచూడామణీ ! (ఆం) 538

మ. తినదే చెట్టులయాకు మేఁక, గుహఁగొందిన్ పాము నిద్రింపదే,
వనవాసంబునఁ బక్షులున్ మృగములన్ వర్తింపవే, నీటిలో
మునుఁగం జూడవె మత్స్యకచ్ఛపములున్, మోక్షార్థులై ముక్తికిన్
మనసే మూలము నీదుభక్తికిని రామా ! రాజ చూడామణీ ! (ఆం) 539

మ. పరమార్థజ్ఞుఁడు సర్వభూతచయమున్ బ్రహ్మస్వరూపంబుగాఁ,
బరకాంతామణిఁ దల్లిగా నహితునిన్ బ్రాణోక్తబంధుండు గాఁ,
బరికించున్ సమలోష్టకాంచనమతిన్ భావింపఁ డాత్మన్ జరా
మరణక్లేశభయంబు నొంది రఘురామా రాజచూడామణీ ! (ఆం) 540

మ. బుధధాత్రీజవికాసముల్ గుణలతాభోగప్రియావాసముల్
మధురస్త్రీసుఖహాసముల్ పికవచోమాధుర్యవిన్యాసముల్
విధురప్రాయతుషారభాసములు విద్విడ్భ్రాంతి సంత్రాసముల్
మధుమాసంబులు నీ విలాసములు రామా ! రాజచూడామణీ ! (ఆం) 541

మ. రణరంగంబున వజ్రకాయమన సంరక్షించు సంసారదా
రుణ బేతాళభయంబు పాఱనణఁచున్ రోగాగ్ని సంతాపమున్
క్షణమాత్రంబునఁ బాయఁ జేయవె భవత్కల్యాణ నామావళుల్
మణిమంత్రౌషధసేవ పుణ్యులకు రామా ! రాజచూడామణీ! (ఆం) 542

## గ్రంథనామము, కర్తనామము, తెలియరానివి.

సీ. అఖిలలోకానందుఁ డగుచంద్రుఁ డెందేనిఁ గలిగె నుజ్జ్వలఫేనకంబుమాడ్కి,
నైరావతాదిమహాకరు లెందేనిఁ బ్రభవించె మకరశాబములపగిదిఁ,
గమనీయసురతరుసముదయం బెందేని జనియించె శైవాలచయముభంగి,
భువనైకమాత మాధవుపత్ని యెందేనిఁ బొడమె మాణిక్యంపుబొమ్మపోల్కి,

గీ. నాదిమత్స్యకూర్మములు విహారలీలఁ
దనరు నెందేనిఁ బ్రకృతిసత్త్వములకరణి
నట్టియంభోధి యొప్పారు నద్భుతైక
సారమహనీయమహిమ కాధార మగుచు. (ఆం) 543

మ. అతిమాధుర్యమనోజ్ఞచూతఫల మాహారంబుగాఁ గల్గియున్
మతి గర్వింపక కోకిలంబు వలుకున్ మంజూక్తి, జంబాలదూ
షితనీహారముఁ గ్రోలి భేక మఱచున్ జృంభించి యాకర్ణ (న)
స్థితిఁ గాఠిన్యము దోఁపఁగా 'బెకబెక' స్ఫీతాకులారావముల్. (జ) 544

మ. అనిలోద్ధూతపరాగరేఖలు సముద్యచ్చంచలాలీలఁగా,
ఘనమత్తాళిగభీరగానరవముల్ గర్జావిభూతిం దన
ర్ప, నమందంపుమరందబిందుతతి వర్షస్ఫూర్తి నొప్పారఁగాఁ
దనరెం గారుమొగిళ్ళ పెల్లున (ను) నుద్దండోత్పలవ్రాతముల్. (జ) 545

గీ. అమరనాయకుకొలువుకూటమునయందుఁ
గరము విలసిల్లువెలిపట్టుఁ దెరయపోలెఁ
జెలువ మై తూర్పుదిక్కునఁ దెలుపు కోఁచె
బ్రజల కెల్లను గన్నులపండు వగుచు. (ఆం) 546

గీ అమరు లమృతాబ్ధిలోపలి యమృతరసము
వెండిచేరులఁ బటికంపుఁగుండఁ గట్టి
చేఁదుకొనియెదరో నాఁగ శీతరోచి
మెల్లమెల్లన రుచులతో మిన్ను బ్రాఁకె.[1] (ఆం) 547

ఉ. అరయక మున్ను పుష్పవతి యైనలతాసతిమిట్టి యంబుజా
కరముల నీళ్లు లాడి మఱిఁ గ్రమ్మఱ ముట్టెద మొక్కొ- యన్వెఱం
బొరిఁ బురవీథులం దెరలఁబోవక మెల్లనఁ బోవునట్టి వై
పరిమళ శైత్యమాంద్య సులభంబుగఁ బల్మఱు వీచుఁ దెమ్మెరల్. (ఆం)548

శా. ఆనందాశ్రుల నగ్ని నిల్పె నాకానా నల్లాడు దృగ్దీధితుల్
మానం బుష్పమధుప్రసంగము కడున్ మత్తిల్లెనాఁ గుమ్మురుల్
జానై క్రాలఁగ మంథరస్థితి నిజేచ్ఛన్ షోడశావస్థలున్
బూనం బొందఁగఁ దద్దయుప్పి రరుణాంభోజాక్షు లున్మత్తలై. (ఆం) 549

ఉ. ఆరయ జీవనం బమృత, మల్లుఁడు దేవర, సొమ్ము లన్నియున్
సారపురత్నముల్, కొడుకు చంద్రుఁడు, కూఁతురు లక్ష్మి, యాలు భా
గీరథి, తాసముద్రుఁ, డని కీర్తన సేయుదు రెల్లవారు నా
క్షీరపయోధి, నన్యులకుఁ జెల్లునె యిట్లు సమస్తభాగ్యముల్. (ఆం) 550

---

1. మెఱుఁగు మెఱుతోన యల్లన మిన్నుప్రాఁకె. (పాఠాం)
చూ. పారిజాతాపహరణము (2-40).

శా. ఆరాజాస్యలు గాంచి రయ్యెడ సముద్యల్లోలకల్లోలసం
చారోద్ధూతనవీనఫేనదరహాసస్ఫారమున్ నిర్ఝరా
హారశ్రీకరవారిపూరము ఖగవ్యాపారవిస్తారమున్
బారావారగభీర మున్నతమహాపారంబుఁ గాసారమున్. (అం) 551

చ. ఇరవున గోపురాగ్రముల నెత్తినకేతనవాతపూరణో
త్కరము వియన్నదీజలము గ్రాయుచు వాతహతిం దదంబుశీ
కరములఁ జల్లుటన్ జలదకాలముగాఁ గొని యాడు నెప్పుడున్
బురిని నెముల్ ప్రమోదగతి భూరిహిరణ్మయహర్మ్యవేదులన్. (అం) 552

ఉ. ఈఁకలు నల్లనైన వని యెంచి విశాలరసాలశాఖ యు
త్సేకముతోడ నెక్కి వికసించి ఫలంబులు నీవు మేయుచున్
గోకిలరీతి నుందు ననుకొన్నను సంటివి కాక పాపపుం
గాకమ! నీకు నమ్మధురగానము గల్గునే యెన్ని వల్కినన్! (జ) 553

గీ. ఉదయరాగ మించించుక యుజ్జగించి
నిండుచంద్రుండు కన్నులపండు వయ్యె
ధావనానంతరస్నిగ్ధదాక్షిణాత్య
రాజశుద్ధాంతదంతవజ్రములకాంతి. [1] (అం) 554

ఉ. ఏచి తలిర్చి గొప్ప లగునెల్లనిపూవులతోడిబూరుగున్
రాచిలు కర్థిఁజేరి మధురంపుఫలంబుల నాస సేసినన్
జూచి నిరాశ యై చనిన చొప్పగు నల్పుల నాశ్రయించినన్
... ... ... ... ... (జ) 555

గీ. కడలుఁజేతు లార్చుచు ఫేనఘనతరాట్ట
హాసరుచితోఁ బ్రవాళజటాలి విచ్చి
యౌర్వశిఖి ఫాలలోచన మనఁగ సింధు
వమరుఁదాండవ మాడెడు హరునిఁ బోలి.[2] (?) 556

సీ. కదళికాకాండయుగ్మముమీఁద నెట్టొకో నిద్దంపుఁబులినంబు నెలవుకొనియె,
జలజాకరంబులో మొలచి యేగతి నాక్కో తోఁతెంచె మవ్వంపుధూమరేఖ?

---

1. చూ. భీమఖండము (2-43).
2. ప్రథమముద్రణమున నీ తుది రెండుపంక్తులందు చుక్క లున్నవి.

బయలుపై నేమాడ్కిఁబదిల మైనదియొక్కొ కొమరారునవ
హేమకుంభయుగళి?
మొలకచందురుమీఁద నిలిచి యేక్రియనొక్కొ బలసి క్రాలెడు నోలి
నలఁతియిరులు?

గీ. జగతి నరు దనఁ దొడలును జఘనతలము
నాభియును నారు నడుముఁ జన్గవయు నుదురు
నలకములయొప్పు వర్ణింప నలవియగునె
రాజబింబాస్యచెలువంబు రాజతనయ! (అం) 557

మ. కనియెన్ దుర్గమసానురింఖణతురంగగ్రావణానూరువున్
దిననాథద్యుతిపుంజభంజనలసద్దీప్తిచ్ఛటాచారువున్
కనదభ్రంకషతుంగశృంగవిహరద్గాయన్మరుద్భీరువున్
దనుజారిస్థితి భద్రదారువును దద్వందారువున్ (?) మేరువున్.[1] (అం) 558

మహాస్రగ్ధర. కని రుగ్రగ్రాహనక్రగ్రహణఘుమఘుమాకారకల్లోలడోలాం
చనబద్ధాందోళకేళీసరభసఫణభృచ్చారుజూటాగ్రజాగ్ర
ద్ఘనరత్నోద్దంచదత్యుత్కటకుటిలమయూఖచ్ఛటాటోపమిథ్యా
జనితౌర్వారంభశుంభత్సలిలనివహనిస్తంద్రు రత్నాకరేంద్రున్.[2] (అం) 559

గీ. కన్నుఁగవఁ గాటుకయు బోటికచ్ఛడంబు
భూతి రుద్రాక్షమాల త్రిపుండ్రకములు
ధవళదంతవాటికాస్థాపుటములు
నంగవికృతియు సజ్జాతిభృంగిరిటికి. (అం) 560

చ. కమలిని యించుకేని యెసఁగం గనుమూయదు లోన నవ్వెడిం
గుముదిని రాగపల్లవితకోమలశీతలధాముఁ డంబరాం
తముఁ గబళింపఁ జొచ్చెనని తాను నవాంగనవోలె సిగ్గునన్
శమితము సేసె నల్లన నిశాసతి ప్రౌఢనుగేహదీపమున్. (అం) 561

చ. కలఁగినపూఁతయున్ నుదుటికస్తురి నంటినకుంతలంబులున్
బలసినయూర్పులున్ గలిగి పొన్నుఁ గరంబున నూఁది మూఁపునం

---

1. ఎఱ్ఱనరచన (హరివంశము?)
2. నాచన సోముని ఉత్తరహరివంశము పోల్కి.

దలకభరంబు పూని గనయం బొకచే నమరన్ రతాంతవే
ళల శయనంబు దిగ్గుసతులన్ వనజాక్షుఁడు పొందె వెండియున్.(ఆం) 562

సీ. కలకంఠమదకీరకలకలధ్వనులతో బెడఁగుగా నెలవీరు విడిసె మరుఁడు,
మరుధనుర్జ్యావల్లి మొరపంబుగతి లతామంటపంబుల నించె మధురరవము,
మధుపరవోల్లసన్మంజరీమకరంద సురభిగంధంబులు నెరసె దిశల,
దిశలెల్లఁ దాన యై తిరిగె బంధుశ్రేణి కంపింప దక్షిణగంధవహుఁడు,
గీ. వనము లెల్లను గ్రొత్తజవ్వనముఁ దాల్చె
దళితహేమంతగర్వమై వెలసె నెండ
సతులహిందోళగానంబు లతిశయిల్లె
రాగకర మైననవవసంతాగమమున. (ఆం) 563

గీ. "కాంత! నీమోముఁ బోలమిఁ గందె నిందుఁ
డీసువాఁ డని కినియకు మింక" ననుచు
బ్రార్థనము సేయుచున్ బ్రమొక్కుసట్టి యుడుగ
ఱంబొకోనాఁగ సతిపాదనఖము లమరు. (ఆం) 564

చ కుసుమశరాళి బాసటము గొల్పినకై వడిఁ దమ్మి తేకులం
గసిబిసి సేసి క్రాలుతెలిగన్నులఁ గజ్జల మిడ్డ బ్రహ్మన
త్వెసఁగఁగ గండుమీల సృజియించుతఱిన్ ఋజులేఖ క్రొత్తయ
వ్యసనపు నీలినూ ల్మెడఁచినట్లు మృగాక్షికి నొప్పు నెంతయున్ (ఆం) 565

సీ కొండంత హేమకోదండంబు విలసదహీనగుణంబున నెక్కు వెట్టి,
హరినీలమణికాంతి యగునమ్ముశరధిపొం దెడలించి వలచేత నేర్చిపట్టి,
స్వరముల సకిలించు వారువంబుల గుణాధారభూతం బగుతేరఁ బూన్చి,
నలుదిక్కులును జూడ్కు లొలయంగ సకలంబుఁ గనువాని సారథిగా
నొనర్చి,
గీ. కదఁగి రథచక్రములు తనకన్ను లట్ల
యేమఱక యేఁగఁ ద్రిపురంబు లేర్చి సకల
లోకములు నెమ్మిఁ బ్రోచుపినాకపాణి
మనలఁ గరుణావిధేయుఁ డై మనుచుఁగాత! (ఆం) 566

మ. క్షయకాలంబున సీధుసాగరరసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యాకాళరాత్రీకర

ద్వయతాళానుగతిం బ్రమోదమున మత్తల్లీమహానృత్యముల్
ప్రియ మొప్పారఁగఁ జేయుభైరవుఁడు గల్పించున్ మహైశ్వర్యముల్.[1]
(ఆం) 567

సీ. గండపాళికలును గన్నులుఁ దెలుపెక్కెఁ దోరంబు లయ్యెఁ బెందొడలు నడుము,
గతియును దీపనస్థితియు మాంద్యముఁ దాల్చెఁ బృథులత మించె నాభియును బిఱుఁదుఁ,
జనుముక్కులును నారుఁ జాల నీలిమ నొప్పె సన్నంబు లయ్యె వాచవులఁ దనువుఁ,
గోర్కులు నూర్పులుఁ గొనలు సాగఁగఁ జొచ్చెఁ దలసూపె నిదురయు నలసతయును.

గీ. సిగ్గువదలెఁ బుట్టెఁ జిట్టుము లుప్పొంగె
వింతకాంతి యోకిలింత లడరె
నర్కవంశతిలక మైనకుశధ్వజు
నువిద కవుడు గర్భ మొదవుటయును. (ఆం) 568

గీ. గజ్జపరిద్రొక్కెఁ జూపె ఖాగడవిధంబు
గీతమున కాడెఁ జేసె సంకీర్తనంబు
పాడె సూళాదిగీతప్రబంధవితతి
భృంగి పంచాంగకం బైనపేరణమున. (ఆం) 569

సీ. గొజ్జంగివిరులపైఁ గుప్పించుఁ గుప్పించి కన్నె గేదఁగులపై గంతుగొనును,
వకుళగుచ్ఛములపై వర్తించు వర్తించి పున్నాగతతులపైఁ బూన్కి నెఱపు,
గురువెందపొదలపైఁ గ్రుమ్మరుఁ గ్రుమ్మరి విరవాదిలతలపై విశ్రమించు,
మల్లికావలులపై మసలాడు మసలాడి సురపొన్నతరులపైఁ బొరలు వెట్టు,

గీ. ననుదినము నిట్లు పుష్పవాసనలఁ దేలి
యంగజాభంగరతులందు ననఁగి పెనఁగి
యలసిపడియున్నజనముల యలఁతమాన్చు
మలసి యప్పురిఁ బ్రాభాతమారుతంబు. (జ) 570

మ. గ్రహయుక్తం బయి ఫేనతారకలచేఁ గన్పట్టి మందాకినీ
సహితం బై ధ్రువలక్ష్మిచే నమరుచున్ సర్వాతిరిక్తంబు నై

1. చూ. కాశీఖండము (5-83).

బహుభూతంబులఁ దాన లోఁగొనుచు శబ్దస్థాన మై యద్భుతా
వహ మై విష్ణుపదత్వ మేర్పడఁగ నవ్వారాశి యొప్పుం దగన్. (ఆం) 571

సీ. చందనం బలఁదినసౌభాగ్యలీల మైఁ బూసినకస్తూరిపూఁతతోడ,
వికలి యై విరిసిననఖరేఖవ్రణముతో వీఁగాడుకుచముల వ్రేఁగుతోడఁ,
జుంబించి విడిచిన బింబాధరంబుతో మూలవదలుపుష్పమాలతోడ,
నన్నువనడుము దా నసియాడుచుండంగ వదలినగనయంబు నదిమికొనుచుఁ,

ఆ.వె. దొడలు నడుగులుఁ దడఁబడఁ ద్రొక్కికొనుచును
దలుపుదెఱచి యొక్కతయు లతాంగి
సురతసుఖము లెల్ల సుభగున కొప్పించి
మారుతార్థి యగుచు మగుడి వెడలె. (ఆం) 572

ఉ. చుక్కల నెయ్యపుందగవు సూచిన యామినికూర్మి సూచినన్
జక్కన నాధు దీనతకుఁ జాలక ముక్కడు నస్తమించె న
మ్మక్క ః శిలావిశేషముగదా ః శశియశ్మము నీలరోచి గా
దొక్కొ కలంక నొల్లనని యోర్చిఁ దదీయవియోగదుఃఖమున్ ? (జ.) 573

గీ. తనరి రాగిల్లి ముక్తుఁ డై తరతరంబ
నిర్మలత్వంబుఁ బొందుచు నీరజారి
పరమయోగియుఁ బోలె సత్పథమునందు
నడవఁగాఁ జొచ్చెఁ గువలయానంద మెసఁగ. (ఆం) 574

సీ. తమకు మందటు నింకఁ దలవంపు లౌ నని నాతిచన్మొక్కలు నల్లనయ్యెఁ,
దనయౌవనార్థ మింతటఁ దీఱునో యని పల్లవాధరమోము తెల్లవాఱెఁ,
దనయులు లే రని తరుణి రోసినమాడ్కి నింతికెంతయు నోకిలింత లొదవెఁ,
దనవంశ మెల్ల వర్ధన మొందు తెఱఁగునఁ బొలఁతినెన్నడుము మంతఁ బొదలఁ
దొడఁగె,

గీ. నడపు జడ నయ్యె వెడనిద్ర దొడఁకఁ జొచ్చె
దప్పి మోమునఁ జాలఁగ నుప్పతిల్లె
జెలువ యొప్పారె నాగర్భచిహ్నలందుఁ
బేద పెన్నిధిఁ గాంచిన ప్రియము దోఁప. (ఆం) 575

సీ. తస్కరశత్రుభూధవసర్పవృశ్చిక శార్దూలభల్లూకసలిలపవన
వహ్నినవగ్రహవారణవిషరోగ దివిజాతకాసురవరమహోఘ

శాకినీబ్రహ్మరాక్షసభూతభేతాళ కూశ్మాండధారిణీక్రూరశస్త్ర
దారిద్ర్యదుర్భిక్షదారుణదుస్స్వప్న దుశ్శకునోత్పాతదుష్టమృత్యు
గీ. ఘోరసంసారభవభయాపారదుఃఖ
సమితి నిర్జించి రక్షింపఁ జాలు నీదు
భవ్యపంచాక్షరీమంత్ర పఠనశక్తి
భానుశతకోటిసంకాశ ! పాణికేశ ! (అం) 576

సీ. తిమిరభూతమునోఁకు దెలియ జగత్త్రయీ లలన దాల్చినరక్త తిలకమనఁగ,
సఖ్యంబునకు నిశాశబరి యిచ్చినఁ బ్రాచి పాటించు గురివెందబంతి యనఁగఁ,
దోయధి వెడ గ్రుంకఁ దోఁచుపురందరకుంభినీ సిందూరకుంభ మనఁగఁ,
గులిశాయుధుని పెద్దకొలువునఁ జెన్నొంద దీపించు మాణిక్యదీప మనఁగఁ,
గీ. గుముదినీరాగరససిద్ధగుటిక యనఁగఁ
గాముజనరంజనౌషధికబళ మనఁగఁ
బొడుపుఁగెంపున బింబఁబు పొలుపు మిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతిని స్తంద్రుఁ డగుచు. (అం) 577

సీ. తుహినధాత్రీధరోత్తుంగ గాత్రస్ఫూర్తిఁ బరిపూర్ణచంద్రికాప్రభలు మాయఁ,
గఠినబంధురతరస్కంధఘంటాధ్వని నదిరి దిశావలి యెదురు మ్రోయఁ,
బవిచండనిష్ఠురపటుపాదఖురహతిఁ బటిపటి యై మహీభాగ మగల
వరభోగభోగీంద్ర వాలవాతోద్ధతిఁ, జెదరి ధారాధర శ్రేణు లవియ,
గీ. వర్ణితాయతశృంగతీవ్రక్షతములఁ
బెల్లుకొని పద్మజాండంబు బెల్లు లొలయఁ
జండగతి వచ్చుకైలాసశైల మనఁగ
నెసఁగు పడివాగెతో వృషభేంద్రుఁ డమరె. (అం) 578

చ. ద్విగుణసరోజ మయ్యె సుదతీజనచారుముఖవ్రజంబుచేఁ
ద్రిగుణితమీన మయ్యె యువతీజనలోచనపంక్తిచేఁ జతు
ర్గుణితకోక మయ్యె రుచిరప్రమదాననరాజిచే నదం
బగణిత షట్పదప్రకర మయ్యె సతీకుటిలాలకాలిచేన్. (అం) 579

చ. నెఱఁకులయందుఁ గ్రిక్కిఱిసి నిండినపొంపిరి నిక్కుపట్లు ద
గ్గఱుటయు నూరడించి తమకంబున నెవ్వరికన్న వేడ్కఁ ద
త్తఱ వెస మీఁది పట్టుకొనుతొలము లొండొరుఁ జుట్టుముట్టి త
మ్మెఱుఁగని సంగమక్రియ మహీతలనాథుఁడు రాజపుత్త్రియున్. (అం) 580

గీ పదియుఁ బదియు నింకఁబదియేను బది యేను
నిరువదేను నూటయిరువదేను
నూఱు నూఱు నూఱును న్నూఱు నన్నూఱు
తలలవాఁడు నిన్ను ధన్యుఁ జేయు (జ) 581

చ. పరమ వివేకసాగరుఁడు పంకజసంభవసంభవుండు ధూ
మరహితవహ్నితుల్యుఁ డసమానతపోనిధి విష్ణుభక్తిత
త్పరుఁ డఘదూరుఁ డాద్యుఁడు కృపారసచిత్తుఁడు దివ్యబోధసు
స్థిరుఁ డగునవ్వసిష్ఠుఁ డరుదెంచె దిలీపనృపాలుపాలికిన్. (అం) 582

చ. పలుకులయాస వాయపునెపం బిడిపల్కు సఖీజనంబుతోఁ
బలికినమాత్రఁ జూడ్కులకు బ్రాఁతిగ వెన్నెలఁ బుక్కిలించిన
ట్లలువులవెళ్ళు గాంత దశనాంశువిభాతికి వజ్రదాడిమీ
ఫలనవబీజమౌక్తికవిభాతికి రా జనుమాట పూజయే (అం) 583

సీ. పలుకుల వెడలజ్జ వెలితి సేయుచు నొయ్యఁ బలికించి చూడ్కికిఁ బట్టుకొలిపి,
చెంతకునెఱయని చెయ్వులఁ బయిలోట సడలించి వేడ్కలఁ గడకుఁ దెచ్చి,
నెపమునఁ జోఁకి పొఱెమ్మెడుకంపములు మాన్చి డాసి వంచించి పొం దాసపఱచి,
యుపగూహనములకు నొఱ పిచ్చి పురికొల్పి చుంబనంబులఁ జవి చూపి రేచి,

గీ. మూరి బోయినమవ్వఁపుఁగూరి మెసఁగఁ
గాయ్వి దనకంటెఁ జెయ్వుల గడవఁగఱప
బాలనవసంగమంబున నోలలార్చె
రాజనందనుఁ డారతిరాజు పోలె (అం) 584

సీ. పసిఁడిక్రొమ్మొగ్గులలోఁ బ్రభవించి యచలిత శ్రీమించుచంచలరేఖ యైన,
వరసుధారససరోవరములో జనియించి యనిశంబు నలరెడువనజ మైన,
నిష్ఠురసాబ్ధిలో నెలసి మార్దవమున నతిశయిల్లుప్రవాళలతిక యైనఁ,
బరిపూర్ణచంద్రబింబం బనుకరసాన నొరసిననురువాఁడిశరములైన,

గీ. బోల్ప నొకకొంత పొసఁగినఁ బొసఁగుఁగాక
ముదితనెమ్మెనిమెఱుఁగును మోముచెలువు
నధరమును గటాక్షములసోయగము నందు
దొరయు నన నెందు నొండువస్తువులు గలవె? (అం) 585

సీ. పాటించు నెయ్యది బహుళనిర్మలధర్మ గంభీర మగుమూర్తిగౌరవంబుఁ,
గావించు నెయ్యది కాంతిమై దిశలకు వాడని చంద్రికావైభవంబు,
గర్జించు నెయ్యది ఖణిలుఖణిల్లున ఘోరదైతేయులగుండె లదల,
మెచ్చించు నెయ్యది మీనకేతనవైరి వాహ్యాళికావల్గువల్గనముల,

గీ నది రయంబున నవ్విభునగ్రవీథి
నిర్భరారూఢి నొప్పఁ బ్రాదుర్భవించెఁ
బృథులపదపాతనిర్ఘాతభీతపన్న
గేశ్వరం బైన శ్రీ వృషభేశ్వరంబు. (అం) 586

ఉ. పీడనతాడన గ్రహణభేదములన్ బహుబంధబంధన
క్రీడల హాస్యలీలఁ గిలకించితముఖ్యవిలాసలక్ష్మికిన్
జాడలుదీయునేర్పుల రసంబుల భావములం బ్రగల్భుఁడై
ప్రోడలఁ బొంది శ్రీవిభుఁ డపూర్వసుఖంబులఁ జొక్కఁ జేయుచున్. (అం) 587

ఉ. పీనసరోగి నిన్నుఁ దిలపిష్టసమానము చేసినంతనే
వానివివేకహీనతకు వందుర నేల కురంగనాభమా !
మానవతీకపోలకుచమండలమండిత చిత్రపత్రికా
నూనవితానవాసనల నుండుట లోకము నిన్నెఱుంగదే ! (జ) 588

చ. పురవనదౌత్యపానములు భూధరనాయకవిప్రలంభముల్
శరధియుఁ బెండ్లి యుద్ధము విచారము యానము పుత్రసంభవం
బిరవుగఁ జంద్రసూర్యు లుదయించుటయున్ జలకేళియున్ ఋతుల్,
సురతముఁ జెప్పఁగావలయు సొంపుగ సత్కృతులందు నేర్పునన్ (అం)589

ఉ. ప్రేమముతోఁ జకోరశిశుబృందము ముక్కుల కెక్కకుండ జ్యో
త్స్నామృతధార వంచుటకు నైయుడురాట్కులశీముఖంబునన్
యామవతీవిలాసవతి యడ్డము వెట్టినహస్తమో యనం
గా మెఱసెన్ బరిస్ఫురితకజ్జలదీధితిచిహ్న మయ్యెడన్. (జ) 590

సీ. బడబానలం బనుఫాలేక్షణముచేత నక్రాదిఫణిభూషణములచేతఁ,
బవడంబు లనియెడుబహుజటావలిచేత నాతతఫేనవిభూతిచేతఁ
బ్రకటబుద్బుదచయస్ఫటికదామంబుచే శుక్తిఖండార్ధేందుశోభచేత,
భాసురభంగకపాలమాలికలచేఁ గమనీయమాధుర్యకలనచేతఁ,

గీ. దుహినకుధరసుతావాసమహిమచేతఁ
దనదుగంగాధరత్వంబు తథ్య మనఁగ
శౌరి కేప్రొద్దు సంతోషకారి యగుచు
నొప్పు నొప్పులకుప్ప నా నప్పయోధి (ఆం) 591

ఉ. బాలముఖేందుబింబరుచి పద్మనిభాననయానలీల నీ
లాలకచన్నుదోయి రుచిరాంగిమనోజ్ఞవిలాసహాసముల్
లోలకురంగలోచనవిలోకనసంపద నెట్టువోల్చినన్
బోలినఁ బోలు నారతముఁ బోలఁగ నీత్రయి నొందు గల్గునే? (ఆం) 592

శా. బేటంబై ధృతి పల్లటిల్లఁదొడఁగెన్ బ్రేమంబువట్రిల్లె నా
రాటం బుజ్జన మయ్యె లజ్జ యెసఁగెన్ రాగంబు వాటిల్లెఁ బు
ల్లోటం బుత్కట మయ్యెఁ గంపములపై నుప్పొంగెఁ బ్రస్వేద మ
జ్జోటిం జెప్పఁగ విన్నమాత్రఁ బతికిన్ సూనాస్త్రబేటంబునన్. (ఆం)593

సీ. భసితంబు వేదోక్తపదనిరూఢం బగు భసితంబు మునిజన ప్రాణపదము,
భసితంబు సర్వేశభక్తి కాధారంబు భసితంబు సకలశుభప్రదంబు,
భసితంబు దుర్మేఘపటలానిలం బగు భసితంబు లోకైకపావనంబు,
భసితంబు భవరోగభంజనౌషధ మగు భసితంబు ప్రత్యక్షభర్గమూర్తి,

గీ. భసిత మనవరతాశేషభయహరంబు
భసిత మనమసుజ్ఞానవైభవకరంబు
భసిత మాభరణము యోగివిసరమునకు
భసితమహిమ వర్ణింపఁగ బ్రహ్మతరమె? (ఆం) 594

సీ మొగమును మొగమును ముచ్చట లాడంగ నగవును నగవును నవ్వియాడ,
మోవియు మోవియు ముద్దులు గురియంగఁ జూపును జూపును దీపులాడ,
నొడలును నొడలును నొక్కటియై యుండఁ బులకలు పులకలుఁ
గలయఁబడఁగఁ,
దొడలును దొడలును దొడరి పెనంగఁగ నడుగులు నడుగులు నదిమికొనఁ,

గీ. వరుసఁ దలయంపిఁజేతులు సరసమాడ,
నితరకరములు పైనొప్ప రతుల యెడల
సరస శయనించి పరిరంభసంభ్రమముల
బ్రేతలును దాను సుఖియించె విశ్వవిభుఁడు. (ఆం) 595

సీ. రాజకదంబవిరాజితం బగుఁ గాని కంటకపార్థివోత్కరము గాదు,
పద్మాలయాతిశోభన మనం జనుఁ గాని కుముదోదయాతిసంకులము గాదు,
స్నిగ్ధసువర్ణప్రసిద్ధాత్మమగుఁ గాని వరచిత్రవర్ణ సంకరము గాదు,
పరమౌషధిప్రభాభాసురం బగుఁగాని దుస్తృణద్యోతవిద్రుతము గాదు,

గీ. వరకులంబును సత్సరోవరకులంబు
చెలువ మగుహర్మ్యకులము సుక్షేత్రకులము
పోల నన్నింటితో దానిఁ బోలియున్నఁ
బ్రస్తుతం బగునోషధిప్రస్థపురము [1]. (ఆం) 596

ఉ. రాజితతేజుఁ డై నదినరాజు తిరోహితుఁడై నపిమ్మటన్
రా జుదయాద్రి పీఠము తిరంబుగ నెక్కెడునందుకట్టునన్
భ్రాజితసత్పథంబులకు బాధ యొనర్చుచు జారచోరసం
పూజిత మై తమంబు గడుఁ బొంగె నధర్మముతోటి జోటియై. (ఆం) 597

ఉ. లేమికి లేఁత కౌను ప్రతి లేమి కుదాహరణంబు రూపు మా
ర్లేమికి మచ్చుచూడ్కు లగు లేమివిలాసము వల్లిచిత్రముం
దామర తేకులుం గలకతంబునఁ బోల్పఁ దలంచి లోకు లా
నామము లెన్న వాతెఱవ నాలుక యాడునె మై వడంకదే. (ఆం) 598

క. లోకమువిరహులకును శశి
భీకరుఁ డగు టరుడె ? సురలు పీఁకుకతినఁగా ?
నాకాశపిండ మై తిరి
గేకుటిలాత్మునకు నేడ కృప మదిఁ దలఁపన్. (జ) 599

సీ. విటసేన పై దండు వెడలినవలజేని గొల్లెనపై హేమకుంభ మనఁగఁ,
గాముకధృతివల్లికలు ద్రుంప నెత్తిన శంబరాంతకుచేతిచక్ర మనఁగ
మరుఁడు పాంథశ్రేణిమానాటవులు గాల్పఁ గూర్చిననిప్పులకుప్ప యనఁగ,
విరహిమృగంబుల వేఁటాడ మదనుండు దెచ్చినమోహనదీప మనఁగ,

ఆ.వె. పీఁకునునుపు గలిగి వృత్త మై యరుణ మై
కాంతితోఁ జకోరగణము లుబ్బఁ
బొడుపుఁ గొండచక్కిఁ బొడిచె రాకాచంద్ర
మండలంబు గగనమండనంబు. (ఆం) 600

---

1. నన్నిచోడని కుమారసంభవములోనిది. (7-127)

చ. విరహుల కెల్లసంధ్యపతి వేడుక జోతము సెప్పవచ్చుచో
నితరసముతోడ నక్షతలు నించి తగన్ గరపంకజంబునన్
మురియుచుఁ బట్టినా మెఱుఁగుముత్తెపుఁజిప్పన నొప్పెఁ జూడ్కికిన్
శరనిధిపుత్రునిన్ విదియచంద్రునిఁ గంటిరె పశ్చిమంబునన్. (ఆం) 601

సీ. విషమాస్త్రునకు వేఱ విండులు గలవెట్టు పొలఁతుకనెలవంకబొమలు గాక,
యంగజునకు వేఱ యమ్ములు గలవెట్టు తనుమధ్యలోలనేత్రములెకాక,
శంబరారికి వేఱచక్రంబు గలదెట్టు బింబోష్ఠిపృథుజఘనంబ కాక,
చిత్తజునకు వేఱ చిగు రెల్లి గలదట్టు ధవళాక్షియధరపల్లవమ కాక,

గీ. కాయజునకు వేఱ కవదొనల్ గలవెట్టు
తోయజాస్యపిన్నతొడల కాక
భావజునకు వేఱ పాశంబు గలదెట్టు
తరుణికేల కాక ధరణినాథ! (ఆం) 602

సీ. వెన్నెలపులుఁగులవెన్నెలపులగంబు చెఱకుసింగిణికానిచెలిమికాఁడు,
వేయికన్నులవానివీశివొత్తులమేఁత జోడువాయనివారిచొక్కు మందు,
కలువచుట్టంబు చుక్కల కెల్ల మను(?)భ్రాఁతి వేడుకకాంద్ర చేవెన్నుతఱటు,
మబ్బుమూఁకల కెల్ల నబ్బాచి పెనువేల్పు తలపూవు రేకొమ్మవలపులాఁడు,

గీ. కలిమిముద్దియసైదోడు కదలిపట్టి
జక్కవలమిత్తి తామరచల్లఁజంపు [1]
దొంగలకు గొంగ యల ప్రొద్దుసంగడీఁడు
పొడిచెఁ బున్నమ రేతేఁడు పొడుపుఁగొండ. (ఆం) 603

చ. వెలయుకళ్యాడ్యుఁడై నళశి వేడుకఁజేయురతోత్సవంబునన్,
లలితరుచిస్ఫురద్గగనలక్ష్మి మనోహరహారమౌక్తికం
బుల్రకియ నున్న తారకలు పూర్వసురాధిపుభాగ్యచిహ్నముల్
తొలఁగినమాడ్కి దృష్టిపథదూరము లయ్యెఁ గ్రమక్రమంబునన్. (జ) 604

చ. వెలువెలఁబాటె దీపములు వెన్నెల వెల్లువ దొంకఁబాటెను
త్పలములజోకలెల్ల దిగఁబాటె రథాంగము లించు వేడ్కలన్
గలగొనఁబాటెఁ దుమ్మెదలు కంజవనంబులు చేరఁ బాటెఁ దా
రలరుచి మాఁగువాటె సురరాజదిగంతయు తెల్లవాఱెఁగన్. (ఆం) 605

1. చల్లఁజంపులు జోగిజంగమంబులు. మా. హరవిలాసము.

చ. వెలువెలఁబాఱె దూర్పు ననవిల్లు మనోభవుఁ డెక్కు డించెఁ దా
రలపొది విప్పఁజొచ్చె ననురక్తికిఁ జెలంగె రథాంగదంపతుల్
జలజము లుల్లసిల్లె విలసద్గతి వీచెఁ బ్రభాతవాయువుల్
కలకల పల్కెఁ బక్షులు వికాసము కల్వలఁ బాసె నయ్యెడన్. (జ) 606

మ సరి నుప్పొంగుచు వాహినుల్బెరయఁగాఁ బక్రచ్ఛటాకుంతభీ
కర మై పోటును బాటునుం గలిగి సంగ్రామంబునుం బోలె నె
వ్వరికిం జొచ్చి మెలంగరాక ఘనసత్త్వ ప్రౌఢి శోభిల్లుచున్
ధరణీభృన్నికరంబు రాయ నమరెం దత్తత్ప్రదేశంబులన్. (అం) 607

సీ. సురలోనఁ దనరూపుఁ జూచి యెప్పుడు పొత్తునకు వచ్చితే యని నవ్వువారు,
అన్నినట్లైన నిట్లాడుమా నీ వని నీడకుఁ గఱపుచు నాడువారుఁ,
జిలకపలుకు విని యెలుఁగు సూపఁగ నేల వలతేని రమ్మని పిలుచువారు,
ముఖసౌరభమునకు మొరయుతుమ్మెదప్రోఁత వించుఁ దోడన
దాళగించువారు,

గీ. జాడమునుకొని వెడమాట లాడువారుఁ
జేయి తాళంబు లొండురు వ్రేయువారు
నై రి కాదంబరీపానహర్షమున మ
నంబు లలరంగ ముదితేందుబింబముఖులు. (అం) 608

గీ. హారిమందసమీరవిహారలీల
వెలయుపుప్పొళ్లలో నలినిశర మడరఁ
బొలుచు కెందమ్మికొలఁకులు పుష్పసాయ
కప్రతాపానలంబులగను లనంగ. (అం) 609

## అనుబంధము - ౧

సీ. శ్రీకర నవపుండరీకసంపదలకుఁ గవ యైన నేత్రయుగ్మంబుతోడ,
శంఖశార్ఙ్గస్ఫురచ్చక్రగదాశోభితము లైనహస్తపద్మములతోడ,
నూర్జిత మకుటకేయూరకౌస్తుభచారు రమణీయమణిభూషణములతోడఁ,
బదియాఱు వన్నెలపసమించుతళుకుల వల నైనపసిఁడిదువ్వలువతోడ,
గీ. నిరతమును గూర్మి మీఱి పేరురమునందుఁ
గాఁపురం బున్నదుగ్ధాబ్ధికన్యతోడ
శ్రీజగన్నాథుఁ డెలమి నాశ్రితనిధాన
మర్థిఁ గల నాకుఁ బ్రత్యక్షమైనఁ జూచి. 1

సీ. నీలాచలాగ్ర సన్నిహితనిత్యనివాస ! వాసవార్చితదివ్యవస్తునిరత !
రతగోపకన్యకాచతురతాతత్పర ! పరతత్త్వవాసనాప్రకటసార !
సారసోద్భవనుత ! శయనపారావార ! వారణోద్ధరదయావరవిశేష !
శేషాహితల్ప ! సుస్థిరసచ్చిదానంద ! నందవ్రజస్ఫుటోన్నతవిహార !
గీ. హారకేయూరమకుటమంజీరవిసర
సరసభూషణభూషితస్ఫారరుచిర !
చిరదయాలోల ! రక్షణస్నేహవిజయ !
జయ జగన్నాథ ! దేవతాసార్వభౌమ ! 2

గీ. అనుచు వినుతించువాఁడు నెమ్మనము నెలఁగ
ననఘుఁ డాద్యుండు పురుషోత్తమాఖ్యపురపు
శ్రీజగన్నాయకుఁడు సమాశ్రితనిధాన
మాదరంబున ని ట్లని యానతిచ్చె. 3

ఉ. ఆరయ రామప్రెగ్గడకులాగ్రణిగంగయమంత్రిజగ్గ ! మా
పేరిటివాఁడ, వెప్పుడును బ్రేమ ఘనం బగు మాకు నీపయిన్.
గౌరవలీల నీవు సమకట్టినమేలిమి కావ్యసార మిం
పారఁగ మత్సమర్పణము సన్వహకీర్తిగఁ జేయు నావుడున్. 4

వ. మనమునఁ బ్రమోదాయత్తుండ నై యిట్లని వితర్కించితి. 5

చ. జననుతు లోకవీశ్వరులసత్కృతిసారము కావ్యసారవ
ర్ణన మని చేసి నీలగిరినాథునికర్పణసేయుటొప్పఁ జ
క్కనిపదియాఱువన్నెకనకంబున వాసన కమ్మకస్తురిన్
గనదురుకాంతియున్, జెఱకునన్ ఫల మబ్బుట భాగ్యమేకదా! 6

వ. అని కృతనిశ్చయుండనై జగన్నాథదేవకరుణాసుధాసారంబునఁ గా.
వ్యసారం బొనరింపఁ బ్రారంభించి మదీయవంశావతారం బభి
వర్ణించెద. 7

సీ. తనప్రభుత్వము దేవతాప్రభుత్వమున కంతయు నొప్పవేయునేత్రములవానిఁ,
దనలావుననె భూతధాత్రీతలంబెల్లఁ దలఁ బూనుకొనువేయుఁదలలవానిఁ,
దనపేరుఁ దడవినజనులపాపౌఘముల్ మర్దించువేయునామములవానిఁ,
దనమూర్తి త్రిభువనతమస మౌల సనంగఁ దటిమెడువేయుఁబాదములవానిఁ,

గీ. దనదుకూరిమిసుతునిఁగాఁ గనినవానిఁ
దరమె వర్ణింప సంతతోదారకీర్తి
ననుపమజ్ఞానమూర్తి దయానువర్తి
భవ్యగుణఖనిఁ గశ్యపబ్రహ్మమౌని. 8

శా. ఆమౌనీంద్రుశుభాన్వయప్రకటదుగ్ధాంభోధిశుభ్రాంశుఁ డౌ
రామప్రెగ్గడగంగరాజునకు విభ్రాజద్యశస్స్ఫూర్తి వ
ల్లామాత్యుం డుదయించి కాంచె నురుభవ్యాకారులన్ బేర్మి రా
మామాత్యాగ్రణి గంగరాయని సముద్యద్బంధుమందారులన్. 9

వ. అం దగ్రజుండు. 10

ఉ. దండెగు[?] ప్రఖ్యాతిపాటిపురధాముఁడు వల్లన రామమంత్రి తా
నిండినవేడ్క నారరథినీపతివీరమనున్ వివాహమై
కొండయ తిమ్మమంత్రిమణికోవిదులం గనియెం బ్రసూనకో
దండజయంతతుల్యసముదంచితరూపవిలాసవంతులన్. 11

వ తదనుజుండు. 12

చ. శరనిధికన్యకామణిని శౌరి వరించినసొంపునన్ మనో
హరగుణశాలి గంగసచివాగ్రణి సమ్మతిఁ బెండ్లియాడె నా
హరితపవిత్రగోత్రు, డగునబ్బురిలింగనకూర్మిపుత్రి సు
స్థిరగుణధాత్రిఁ జానమ నశేషశుభాంచితగాత్రి నుర్వరన్. 13

చ. సతతము సజ్జనార్థిబుధసన్నుతు లై విలసిల్లు నట్టిదం
పతులకు నుద్భవించితిమి పంకజనాభకృపాసమృద్ధిచే
ధృతి నమరాద్రితుల్యు లగుతిమ్మయవల్లయలున్ సమున్నత
స్థితిఁ గవిమిత్రబాంధవవిధేయుఁడ జగ్గనమంత్రివర్యుఁడన్. 14

వ. అం దగ్రజుండు. 15

శా. భారద్వాజనితాంతగోత్రుఁ డని చెప్ప న్మించు నాదాతెపల్
సూరామాత్యునిపుత్త్రి నమ్మననుసంశోభాంగి[?] నుద్వాహమై
సారోదారుఁడు తిమ్మమంత్రి గనియెన్ సత్పుత్రునిన్ వేంగనన్
గారా మొప్పఁగఁ గొండమంత్రిమణి నాగంగయ్యచానార్యులన్. 16

వ. తదనుజుండు. 17

గీ. లలితభరద్వాజగోత్రుఁ డౌవెలఁగలేటి
కొండనామాత్యశేఖరుకూర్మిపుత్త్రి
వసుధ రామాంబఁ బెండ్లి యై వల్లమంత్రి
మదనసమమూర్తి సింగనామాత్యుఁ గనియె. 18

సీ. శాశ్వతవిక్రమైశ్వర్యసంపదలందుఁ గపికేతు వృషకేతు గరుడకేతు,
భుజబలకారుణ్య భూరిప్రతిజ్ఞల బలరాము రఘురాముఁ బరశురాము,
సత్కార్యవితరణ సౌందర్యములయందుఁ బాణుఁ బన్నగబాణుఁ బ్రసవబాణు
ఘనతరమానసకాంతిపెన్నిధులందు రారాజు ద్విజరాజు రాజరాజు,

గీ. సాటిసేయంగఁ దగుఁ జతుర్జలధివేష్టి
తావనీచక్రరాజసభాంతరముల
రమ్యతరభాగ్యగుణశాలి రామప్రెగడ
మంత్రిగంగయవల్లనామాత్యవరుని. 19

వ. తదనుసంభవుండు. 20

సీ. శ్రీపెదపాటిపురీ బాలగోపాల కృష్ణప్రసాదితశ్రీల వెలసి,
ఘనవైష్ణవమతజ్ఞ కందాళతిరుమలాచార్యకృపాకటాక్షమున నలరి,
కావ్యలక్షణలక్ష్యగణితాదిసత్కళాప్రజ్ఞావిశేషవైభవము గలిగి,
రాజవిద్వత్సభారసికబాంధవమాననీయధర్మాచారనియతి మెఱసి,

గీ. మల్ల ప్రెగ్గడ వీరనామాత్యపుత్రి
రామ నభిరామగుణధామ రామ రామ
కామినీమణిఁ బెండ్లియై ఘనగృహస్థ
మహిమఁ జెలువొందు జగ్గనమంత్రివరుఁడ. 21

## షష్ఠ్యంతములు

క. శ్రీరమణీరమణునకును
నారదశుకజనకసనకనలినాసనహృ
న్నీరజనిరతోపాసన
కారణపదకమలయుగళకలితాకృతికిన్. 22

... ... ... ... ...

వ. ఏను విన్నవింపం బూనినప్రబంధరత్నాకరంబునకు వర్ణనాక్రమం బెట్టిదనిన నారాయణస్తుతియు, శంకరప్రభావంబును, త్రిపురవిజయాభిరామంబును, నర్ధనారీశ్వరంబును, హరిహరాత్మకంబును, బ్రహ్మస్తుతియుఁ, త్రిమూర్తి స్తుతియు, లక్ష్మీగౌరీసరస్వతీ ప్రభావంబును, సప్తదిక్పాలకాదిదేవతాప్రార్థనంబును, వినాయక షణ్ముఖ మైలారగుణోత్కర్షయుఁ, జంద్రాదిత్యులప్రభావంబును, వైనతేయ శేష వ్యాసవాల్మీకసుకవిప్రశంసయుఁ,గవిత్వలక్షణంబును, గుకవినిరసనంబును,మన్మథవిభ్రమంబును, బురవర్ణనయుఁ, బ్రాకారపరిఖాప్రాసాదధ్వజసాలభంజికా గోపురదేవాలయ గృహవిలసనంబును, బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రజాతివిస్తారంబును విపణివిభ్రమంబును బుష్పలావికాభిరామంబును, వారాంగనావర్ణనయుఁ, జామరకామినీచతురతయుఁ, జెంచెతల యొప్పును, బుణ్యాంగవాజనవిశేషంబును, నుద్యానవనసరోవరచయసుభగంబును. మలయమారుతంబును, గజాశ్వపదాతివర్గవిలసితంబును, (1. ఆ.), నాయకోత్కర్షము, సభావర్ణనయు నృత్తగీత వాద్యసాహిత్యసమంజసంబును, నాశీర్వాదంబును, నీరాజన విధానంబును, నన్యోన్యవీక్షణంబును, దశావస్థలును, స్త్రీ పురుషవిరహంబులును, విరహభ్రాంతియు, శిశిరోపచారంబులును, సఖీవాక్యంబులును. మన్మథ చంద్రాది ప్రార్థనంబులును, దద్దూషణంబులును, వైవాహిక పతివ్రతాలక్షణంబులును, నభ్యంగవిధియును, సూపకారవిరాజితంబులును, విషనిర్విషవిశేషంబులును, భోజనమజ్జనతాంబూలాదులును, కేళీగృహంబులును, సురతప్రకారంబును, సుర

తాంత్య్రశ్రమంబును, సంతానవాంఛయు, గర్భలక్షణంబును బుత్త్రోదయంబును, బాలెంత లక్షణంబును, బాలక్రీడయు, శైశవంబును, యౌవనప్రాదుర్భావంబును, సాముద్రికంబును, (2 ఆ.). రాజనీతియు, సేవకనీతియు లోకనీతియు, సుజన ప్రవర్తనంబును, గుజనవ్యాప్తియు, నన్యాపదేశంబులును, సూర్యాస్తమానంబును సాంధ్యరాగంబును, సాయంకాల సమీరణంబును, దీపకళికావిధానంబును, విదియచందురునిచందంబును, దారకావర్ణనంబును, జక్రవాకవియోగంబును, విట విడంబనలక్షణశృంగారంబులును, విటలక్షణంబును, వేశ్యాలక్షణంబును, గుటీ వేశ్యాచేష్టలును, వేశ్యామాతృప్రగల్భంబులును, భద్రదత్తకకూచిమారపాంచాల లక్షణంబులును, జిత్తినీహస్తినీశంఖినీపద్మినీ జాతి ప్రకారంబును, బాలాయౌవనా ప్రౌఢాలోలాలక్షణంబులును, గూఢప్రకారంబును రతివిశేషంబును, రతి వర్ణనంబును, గళాస్థానవిశేషంబును, బ్రణయ కలహంబును, నందుఁ గూర్మిగలుగుటయు, నంధకారంబులును, నిశివిడంబంబును, జార సంచార లక్షణంబులును, జంద్రోదయంబును, జంద్రకిరణలాంఛన చంద్రికావిభ్రమం బులును, జకోరికావిభ్రమంబును, జకోరికావిహారంబును వేగుఁజుక్క పొడు చుటయును, గుక్కుటారవంబును, జంద్రతారకాస్త మానంబులును, బ్రత్యూ షంబును, బ్రభాతమారుతంబును, నరుణోదయంబును, బ్రభాతరాగో దయంబును, (మూఁడవ యాశ్వాసము), మధ్యాహ్న సూర్యవిడంబంబును, గీష్మ వర్షాశరద్హేమంతశిశిరవసంతర్తువర్ణనంబులును, వనవిహారంబులును, దశదోహ దంబులును, నళికోకిలకీరహంసవిరావసంచారక్షణంబులును, జలకేళియుఁ వస్త్రాభరణ వర్ణనంబును, మధుపాన సిద్ధపురుషప్రభావంబును, యోగినీప్రభావం బును, ద్యూతలక్షణంబును, మృగయావినోదంబులును, మృగలక్షణంబులును, సముద్రవర్ణనంబును, దల్లంఘనవిధంబును, సేతుబంధంబును, నదీవర్ణనం బును, బుణ్యక్షేత్రప్రభావంబును, వ్రతమహాత్మ్యంబును, గిరివర్ణనంబును, నారదాగస్త్యాది మహర్షిప్రభావంబులును, వైరాగ్యయోగతపోలక్షణంబు లును, దపోవిఘ్నంబును, దేవతాప్రత్యక్షంబును, దండయాత్రయు, శంఖభేరీ రవంబులును, గుణధ్వనియు, రథాస్త్రవేగంబులును, బాణపాతంబును, బ్రతి జ్ఞయు, వీరాలాపంబులును, దూతవాక్యంబులును, హీనాధిక్యంబులును, రణ ప్రకారంబును, మల్లయుద్ధంబును, రణభయంబును, రణాంత్యంబును, లోభ దైన్యగుణంబులును, మనోవ్యధయు, దనికదారిద్ర్యక్షుధార్తిక లక్షణంబులును, రోదనంబును, శకునంబును, స్వప్నఫలంబును, దిగ్విజయంబును, ధర్మోపదేశం

బును, శృంగారంబును, భావవిస్తారంబును, గీర్తియు, భూభరణంబును, గాంభీర్య ధైర్యగుణంబులును, దానవిశేషంబులును, ధాటీచాటుధారావిశేషంబులును, బరోక్షంబును, గల్పితకల్పవల్లియుఁ, జక్రికా నాగ పుష్ప ఖడ్గ గోమూత్రికా మురజాదిబంధంబులును, బాదగోపన పాదభ్రమక పంచవిధవృత్త చతుర్విధ గర్భకందవృత్త పంచపాదవృత్తంబులును, నిరోష్ఠ్యంబును, ద్వ్యక్షరియును, నవరసోత్పత్తియు ననువర్ణనంబులుం గలుగఁ గవీంద్ర కావ్యనామంబులతో వివరించెద.



# అనుబంధము - ౨

## పెదపాటి జగన్నాథ కవిమాత్రమే యుదాహరించిన కవులు, కావ్యములు

1. అప్పన్న - చారుచర్య; 2. ఎఱ్ఱయ (కూచిరాజు) - కొక్కోకము సకల పురాణసారము; 3. ఎఱ్ఱాప్రెగడ (పెదపాటి) - కుమారనైషధము, మల్హాణ చరిత్రము;* 4. కేతన (మూలఘటిక) - ఆంధ్రభాషాభూషణము, దశ కుమార చరిత్రము; 5. కొండయ (బొడ్డపాటి) - చాటువు; 6. కొమ్మయ్య (నిశ్శంకుని) - శివలీలావిలాసము; 7. గౌరనకవి - నవగ్రహ స్తవము; 8. చంద్రమౌళి - హరిశ్చంద్రకథ; 9. చౌడయ్య (గంగరాజు) - సాముద్రిక శాస్త్రము 10 త్రిపురాంతకుఁడు (రావిపాటి) - తారావళి 11. తిమ్మయ్య (ముక్కు) పారిజాతాపహరణము;* 12. దుగ్గన (దగ్గుఁబల్లి) - నాసికేతోపాఖ్యానము; 13. ధర్మయ (చరిగొండ) - చిత్రభారతము;* 14. నరసింహభట్టు (ఆమదూరి) - షోడశ రాజచరిత్ర; 15. నన్నిచోడఁడు - కళావిలాసము, కుమారసంభవము;* 16. పెద్దన్న (విన్నకోట) - కావ్యాలంకారసంగ్రహము;* 17. పేరయ్య (బొడ్డపాటి) - అనంతమహత్త్వము, చాటువు, పద్మినీవల్లభము, మంగళగిరివిలాసము, శంకరవిజయము, సూర్యశతకము; 18. షోలమరాజు - పర్వతపురాణము; 19. బసువయ (అంగర) - ఇందుమతీ కల్యాణము; 20. బసువయ్య (తులసి) - సావిత్రికథ; 21. మల్లయ్య (నంది) - మదనసేనము; 22. మల్లయ (నంది) సింగయ (ఘంట) - ప్రబోధచంద్రోదయము;* 23. మల్లయ (నండూరి) - హరిదత్తోపాఖ్యానము; 24. మల్లయ (ప్రౌఢకవి) - రుక్మాంగదము;* 25. మల్లయ (మద్దికాయల) - రేవతీపరిణయము; 26. మల్లయ (మాడయగారి) - రాజశేఖరచరిత్ర;* 27. మల్లుభట్లు (ఘటసాసి) - జలపాలి మహత్త్వము; 28. మాధవుఁడు (ఫణిదపు) - ప్రద్యుమ్న విజయము; 29. ముత్తరాజు (నెల్లూరి) పద్మావతీకల్యాణము; 30. రామరాజు (ఎలుకుర్తి) - రామలింగశతకము; 31 రామలింగయ్య (తెనాలి) - కందర్పకేతువిలాసము; హరిలీలావిలాసము; 32. వల్లభరాయఁడు - వీథినాటకము; 33 శేషనాథుఁడు - పర్వతపురాణము; 34. శ్రీ

నాథుఁడు-వల్లభాభ్యుదయము; 35 సర్వన్న (మలయమారుతము) - షష్ఠ స్కంధము; 36. సింగయ (ఏర్చూరి)-కువలయాశ్వచరిత్ర, భాగవతము (షష్ఠ స్కంధము)*37. సింగయ (మడికి)-వాసిష్ఠము ;*38 సూరయ్య (కంచిరాజు)-కన్నప్పచరిత; 39. సూరయ్య (నూతనకవి).ధనాభిరామము;* 40. సోమయ్య (దామరాజు) - భరతము; 41. సోమయ -(పెదపాటి) - అరుణాచల పురాణము, శివజ్ఞానదీపిక; 42 సోమేశ్వరుఁడు (పాలపర్తి)[1]; 43. హరిభట్టు ఉత్తరనృసింహపురాణము, కామందకము, నీతిసారము పంచతంత్రము.

## ఆంధ్రసాహిత్యపరిషద్గ్రంథ సంధాత మాత్రమే యుదాహరించిన కవులు, కావ్యములు.

1 అధర్వణాచార్యులు-భారతము ; 2. అనంతుఁడు-ఛందస్సు; 3. అన్నమరాజు (కానుకొలను)-అమరుకము ; 4 అన్నమయ్యంగారు (తాళ్ళపాక) - తిరువేంకటేశ్వరశతకము ; 5 ఎఱ్ఱాప్రెగడ-హరివంశము;* 6. కేతన-కువలయాశ్వచరిత్ర ; 7. కొమ్మయ (నిశ్శంకుని)-వీరమాహేశ్వరము ; 8. గంగాధరుఁడు (కాకమాని)-బాలభారతము ; 9 గణపయ (రాయసం) - సౌగంధికాపరిణయము ; 10. చిక్కయ (చందలూరి)-నాసికేతోపాఖ్యానము ; 11 తిప్పరాజు (కుడిచెర్ల)-కాంచీమాహాత్మ్యము ; 12. తిమ్మయ (కుంటముక్కల)- శైవాచారసంగ్రహము; 13. దుగ్గన (దగ్గుఁబల్లి)-శివకాంచీమాహాత్మ్యము ; 14 దేచిరాజు-నాపరిది; 15 దేవరాజభట్టు-హరిశ్చంద్రకథ; 16. నాగనాథుఁడు(పశుపతి) -శ్రీవిష్ణుపురాణము; 17. పద్మకవి-జినేంద్రపురాణము; 18 పెద్దన్న (అల్లసాని) -మనుచరిత్రము;* 19 పోతరాజు-బేతాళపంచవింశతి; 20 భీమన్న;[2] 21. మారన-మార్కండేయపురాణము;* 22. ముద్దమరాజు (రెడ్డిపల్లె) అష్టమహిషీకల్యాణము; 23. రామయ్య (వాసిరాజు)-బృహన్నారదీయము ; 24. రామయ్య (ఆంధ్రకవి)-విష్ణుకాంచీమాహాత్మ్యము ; 25 వీరయ్య (పోతరాజు)-త్రిపుర విజయము ; 26. వీరయ్య (పిల్లలమఱ్ఱి) - పురుషార్థసుధానిధి, శాకుంతలము ;* 27. శ్రీ గిరన్న (చెనమల్లు)-శ్రీరంగమాహాత్మ్యము ; 28. సర్వదేవుఁడు-ఆదిపురాణము, విరాటపర్వము; 29. సిద్ధనప్రెగడ-శాకుంతలము; 30. సోమయ(పెద

1. ఈ కవి యుదాహరించిర పద్య మే గ్రంథములోనిదో ?

2. పద్యసంఖ్య 481 (నూతనసంఖ్య 486) జగన్నాథకవి కంచిరాజు సూరయ్యదిగా నుదాహరించినాఁడు. "భీమకవి దశావతారపద్య" మని ఆం.సా.ప. గ్రంథసంధాత.

పాటి) - త్రిపురవిజయము ; 31. సోముఁడు - వసంతవిలాసము, ఇంద్రసేనము, పురాతనచరిత్రము, రంగనాథశతకము.

## ఇర్వురు నుదాహరించిన కవులు, కావ్యములు

1. అమరేశ్వరుఁడు -(చిమ్మపూఁడి-విక్రమసేనము. (11, 12, 13, 14' 15, 16, 17, 19, 20, 21, 23, 24, 25, 27, 28, 29, 30, 31, 32, 33' 34, 35, 36, 37, 38, 39, 40, 41, 42, 45, 46, 47, 48, 49, 51, 52, 53, 55, 56, 57, 58, 59, 60, 61, 62 - అం.) (18, 26, 43,44, 50, 54-జ.) (22, 63-ఇ); 2. ఎఱ్ఱాప్రెగడ—నృసింహపురాణము * 3. కసవ రాజు (తేళ్లపూఁడి)-కళావతీశతకము. (93-అం.) (చూ. పు. 21 ప. 93) (94-ఇ); 4 కేతనప్రెగడ (భాస్కరుని) - కాదంబరి. (96-జ) (97-ఇ.); 5. గంగరాజు (చిరుమూరి) - కుశలవోపాఖ్యానము. (116-అం.) (117-జ.); 6 చౌడయ్య (గంగరాజు)-నందనచరిత్ర. (147, 148, 149, 150, 151-అం.) (145, 146-జ.); 7. జక్కన (పేరమరాజు) - విక్రమార్కచరిత్ర*; 8 తిక్కన-విజయసేనము. (153, 157-అం.) (152, 154, 155, 156, 158, 159, 160-జ.);-ఉత్తరరామాయణము;* 9. త్రిపురాంతకుఁడు (రావిపాటి)-అంబికాశతకము. (168,169-అం.) (170-జ); ఉదాహరణము(171-ఇ) 10. నన్నయ్య-భారతము;* 11. పెద్దిరాజు (పొన్నాడ) - ప్రద్యుమ్న చరిత్ర. (206-అం.) (189, 190, 191, 192, 193, 194. 195, 196, 197, 198, 199, 201, 202, 203, 204, 205, 207, 208, 209, 210-జ.) (200ఇ); 12. పెమ్మన (భావన)-అనిరుద్ధచరిత్ర. (211 మొదలు 221 వఱకు, 223, 224, 226-229, 231-236, 238-244, 246-262, 265-273-అం.) (222, 230, 245-జ.) (225, 237, 263, 264-ఇ.); 13. పోతరాజు (బమ్మెర) - భాగవతము;* 14. భాస్కరుఁడు - రామాయణము;* 15. భైరవుఁడు (పోతరాజు) - శ్రీరంగ మాహాత్మ్యము; * 17. ముమ్మయ (జైతరాజు) - విష్ణు కథానిధానము (365, 368, 369, 371, 372, 373, 375, 377, 377 (a), 379, 380, 381, 385, 387 388, 389, 391, 392, 393, 398, 402, 403, 405,— అం.) (367, 374, 376, 378, 382, 383, 390, 394, 395, 396, 399, 400, 401, 404, 406, -జ). (366, 370, 384, 388, 397-ఇ.) 18. రంగనాథుఁడు (408-

ఆం) (407, 409-జ); 19. వీరయ్య (పిల్లలమఱ్ఱి) - శాకుంతలము;* 20. సింగయ (మడికి) - పద్మపురాణము;* 21 సోమయ (పెదపాటి) - కేదార ఖండము; (499, 500, 501, 504, 505, 506 ఆం.) (499, 502, 503, జ.); 22. సోముఁడు (నాచిరాజు) - ఉత్తరహరివంశము;* గ్రంథనామము కర్తృ నామము తెలియరానివి. (524, 527-533, 535, 538 — 549, 551, 552 554 - 560, 562 - 567, 569, 571 - 578, 580-583, 585, 587-597-ఆం.) (525, 526, 534, 536, 550, 553, 561, 568, 570, 579, 584, 586. జ)

---

* ఈ గుర్తు గల గ్రంథములన్నియు ముద్రితములు.

ఆం. = ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథ సంధాతచే నుదాహృతములు.

జ. = జగన్నాథకవిచే నుదాహృతములు.

ఇ. = ఇర్వురచే నుదాహృతములు.

(అనుబంధము-౨ న గల పద్యసంఖ్యలన్నియు ప్రథమముద్రణము ననుసరించినవే.

—ప్రకాశకులు)

